# తాంత్రిక ప్రపంచం




రచయిత

కుర్తాళం పీఠాధిపతి - జగద్గురు

**శ్రీశ్రీశ్రీ సిద్ధేశ్వరానందభారతీ స్వామి**

# తాంత్రిక ప్రపంచం

Cell: 98485 90002., 2233027
Cell: 97042 53700
Sri Raghavendra Book Center
2/1, BRODIPET, GUNTUR-522 002.

రచన

పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు

**శ్రీ సిద్ధేశ్వరానందభారతీస్వామి**

కుర్తాళం శ్రీ సిద్ధేశ్వరీపీఠాధిపతులు,

ప్రచురణ

శ్రీ మంత్రం ఈ-స్టోర్ ఇండియా ప్రై. లి.



పరమహంస, పరివ్రాజకాచార్య, జగద్గురు

# శ్రీసిద్ధేశ్వరానంద భారతీస్వామి

జననం : 23-1-1937 ప్రకాశం జిల్లా, ఏల్చూరుగ్రామం

పేరు : ప్రసాదరాయకులపతి

విద్య : గుంటూరు జిల్లా సంతగుడిపాడు ఎలిమెంటరీ స్కూలు
గుంటూరు హిందూకాలేజి హైస్కూలు, హిందూకాలేజి
తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

ఉద్యోగం : ప్రిన్సిపాల్, హిందూకాలేజి, గుంటూరు.

రచనలు : లలితాదేవి చరిత్ర, బృందావన భాగవతం, వ్రజభాగవతం, బృందావన యోగులు, కాళీసిద్ధులు, సిద్ధాశ్రమ యోగులు, కుర్తాళయోగులు, భైరవసాధన, నాగసాధన, ప్రత్యంగిరా సాధన, రసవాహిని, రసగంగ, కవిబ్రహ్మ మొ॥నవి.

సన్యాసము : పీఠాధిపత్యము - క్రీ.శ. 2002

పీఠములు : తమిళనాడు కుర్తాళ సిద్ధేశ్వరీపీఠము,
గుంటూరు స్వయంసిద్ధ కాళీ పీఠము, శ్రీనాథపీఠము,
విజయవాడ త్రిపురసుందరీపీఠము, నెల్లూరు దత్తాత్రేయ మఠము, విశాఖపట్టణం లలితాపీఠము,
హైదరాబాదు - ప్రత్యంగిరా పీఠము

విశేషాంశాలు: పూజ్యశ్రీస్వామిజీ మహాయోగి, మంత్రసిద్ధులు, రాధాదేవి, కాళీదేవి, కాలభైరవుడు, ఇత్యాది దేవతల సాక్షాత్కారము పొందిన మహాపురుషులు. కొన్ని వేలమందికి మంత్రోపదేశము చేసి ఆధ్యాత్మిక చైతన్యము, కష్టనివారణ, అభీష్టప్రాప్తి అనుగ్రహించిన మహిమాన్వితులు. భారతదేశంలోని వివిధ రాష్ట్రాలు, అమెరికా, శ్రీలంక, నేపాల్, టిబెట్ మొదలైన దేశవిదేశాలలో హిందూధర్మరక్షణ యజ్ఞాలు చేసిన, చేయిస్తున్న దివ్యశక్తి సంపన్నులు.

# మరో ప్రపంచం

మరో ప్రపంచం మహా ప్రపంచం

మంత్ర తంత్ర మయ మాయా ప్రపంచం

ఈ తాంత్రిక ప్రపంచం చిత్ర విచిత్రమైనది. ఈ గ్రంథాన్ని చదవటం మొదలు పెడితే మీరు ఒక అగాధ రహస్య ప్రపంచంలోకి ప్రవేశిస్తారు. పద పదానా ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తవి. సంశయాలు తలలెత్తుతవి. శంకా సంకోచాలు ఊహాసందేహాలు ఎన్నో అవరోధాలుగా నిలుస్తవి. కొన్ని వందల సంవత్సరాల విమతస్థుల విదేశీయుల పాలనలో ఈ జాతి విశ్వాసాలు దెబ్బ తిన్నవి. ఆర్షధర్మం మీది నమ్మకాలు సడలినవి. నాస్తికులు హేతువాదులు విజృంభించారు.

అక్కడక్కడ అప్పుడప్పుడు పూర్వకాలపు ఋషుల వలెనే ఇటీవలి కాలంలో కూడా పరమహంసలు, మహర్షులు, మహాయోగులు లేకపోలేదు, రాకపోలేదు.

దైవాధీనం జగత్సర్వం

మంత్రాధీనంతు దైవతం

మంత్రాధీనులైన దేవతల అనుగ్రహం పొందటానికి తపస్సు చేసే వాళ్ళు తక్కువైపోయినారు. ప్రచారం ఆశించని మహాత్ముల మహిమాన్విత ఘట్టాలకంటే విదేశీయుల ధన వ్యామోహ ప్రసారాల ప్రభావం అధిక సంఖ్యాకుల మీద విస్తరిస్తున్నది. అయినా అధైర్యపడవలసిన పనిలేదు. ఎందుకంటే దేవతల నుండి ఋషుల నుండి ఉదయించిన యోగివర్యుల భావతరంగాలు వాయుమండలంలో వ్యాపించి ఉన్నవి. కొంచెం మనసు పెడితే ఆశక్తి అలలు అలలుగా మనిషిలోకి అవతరిస్తవి. తాత్కాలికంగా వైదేశిక నాగరకతా మేఘ సముదాయం సనాతన భావ భాస్కరునికి అడ్డం రావచ్చు. మబ్బులు కమ్మి చీకట్లు ఆవరించినట్లు అనిపించవచ్చు. కాని అవి ఎక్కువ కాలం ఉండలేవు. జ్ఞానభాస్కరుని కాంతి కిరణాలను స్వీకరించే సహజలక్షణం భారతీయుల రక్తంలో ఉంది. ఈ సందర్భంగా వివేకానందుని జీవితంలో ఒక ఘట్టం స్మరించదగినది.

స్వామి ఒక గ్రామం నుండి దగ్గరగా ఉన్న మరొక గ్రామానికి నడిచి వెళుతున్నాడు. త్రోవలో ఒక ఆలయం ధ్వంసమై కనిపించింది. లోపలికి వెళ్ళి చూస్తే భవాని విగ్రహం ముక్కలు చేయబడి ఉంది. చాలా బాధ కలిగి అమ్మా! నీవు సర్వేశ్వరివి. అందరినీ రక్షిస్తావని గుడికట్టి నిన్ను ప్రతిష్ఠిస్తే నిన్ను నీవే రక్షించుకోలేకపోతే మతం మీద - దేవుని మీద ప్రజలకు విశ్వాసం ఎలా నిలుస్తుంది.నీవా దుర్మార్గులను ఎందుకు శిక్షించలేదు ? అని ప్రశ్నించాడు వివేకానందుడు. అతని కంటి ముందు దేవత కనిపించి "నాయనా! నీవు యోగివి. భక్తుడవు. కనుక నీకు కనిపించి చెపుతున్నాను. మేమే దిగివచ్చి జోక్యం చేసుకుంటే మా ముందు ఎవరు నిలుస్తారు? మానవులు చేసిన సత్కార్యాలకు దుష్కార్యాలకు తగిన ఫలితాలిచ్చి స్వర్గ నరకాలలో అనుభవింప చేస్తాము" అన్నది. "అమ్మా! నీ సమాధానం తృప్తి కలిగించలేదమ్మా! నీవు రాకపోతే ఎలా? దుష్టశిక్షణకు దిగిరావాలి" అన్నారు స్వామి. ఆమె చిరునవ్వుతో" వస్తాను. తప్పక అవతరిస్తాను. నీవిప్పుడు పిలిస్తే వచ్చాను గదా! నీవు కోరితే ఈక్షణంలో ఇక్కడ స్వర్ణ దేవాలయాన్ని సృష్టిస్తాను. నన్ను పిలవగలవాడు పిలిస్తే వెంటనే వచ్చి తీరుతాను. దేవతలను పిలువగలవాళ్ళను తయారుచెయ్యి! ఏ కోరికనైనా తీరుస్తాము" అని పలికి అదృశ్యమైంది.

దేవతలను ఎలా పిలవాలో, త్వరగా వాళ్ళను దర్శించటానికి మార్గాలేమిటో లౌకికాలౌకిక వాంఛలను తీర్చుకోవటానికి ఏం చేయాలో తెలుసుకోటానికే ఈ గ్రంథం. ప్రపంచంలో అందరూ విరాగులు కారు. సన్యాసులు కారు. ముక్తికాములు కారు. మంచి చెడులతో అన్ని రకాల కోరికలతో నిండినదీ లోకం. మంత్రం ఒక కత్తి వంటిది. కత్తితో రోగికి శస్త్రచికిత్స చేయవచ్చు. ఎవరినైనా పొడిచి చంపటానికి ఉపయోగించవచ్చు. చంపేది కాబట్టి కత్తి ఉండకూడదు అనటం న్యాయం కాదు కదా!

తాంత్రికసాధనలు అటువంటివే. అయితే కొందరు వీటిని చేతబడులకు క్షుద్ర ప్రయోగాలకు వినియోగించటం వల్ల ఈ విద్యలకు కొంత అపకీర్తి వచ్చింది. పట్టణాలలో తక్కువగాని, పల్లెటూళ్ళలో మాంత్రికుడంటే ప్రయోగాలు చేసేవాడనే అర్థం బాగా వ్యాపించి ఉండేది. అరవై యేండ్ల క్రింద మా గ్రామంలో ఒక పెద్దాయన వృద్ధుడు - ఆస్తికుడే - కాని ఎక్కువకాలం చీట్లపేకతో గడిపేవాడు.

భోజనానికి కూడా లేచేవాడు కాదు. ఒకరోజు నేను ఆయనతో చనువు కొద్దీ - ఎందుకిలా వ్యర్థంగా కాలం గడుపుతావు ? ఏదైనా మంత్రజపం చేసుకోవచ్చుగదా! ముసలితనం వచ్చింది అన్నాను. ఆయన వెంటనే తడుముకోకుండా "నేను మంత్రాలు చేసి ఎవరిని చంపాలి ? ఎందుకీ మంత్రాలు" అన్నాడు. అంటే పల్లె ప్రజలలో మంత్రాలంటే చెడు చేయటానికే అన్న విశ్వాసం బాగా వ్యాపించి ఉంది. తాంత్రికుడంటే చెడ్డ అభిప్రాయం కలగటానికి క్షుద్ర ప్రయోగాలు చేసేవాడు అనే పేరు కలగటమే కారణం. ఎవరైనా ఎక్కువగా ఉమ్మేస్తుంటే ఏమిటిరా ఉచ్ఛిష్టగణపతి మంత్రం చేసేవాడిలాగా అనేవాళ్ళు. అలానే తీవ్ర విద్యలు చేసేవాళ్ళ దగ్గరకు వెళ్ళటానికి భయపడేవాళ్ళు. ప్రత్యంగిర చేసేవాడి పంచన ఉండగూడదు. శరభసాళ్వం చేసేవాడి చెంతన చేరకూడదు. అనే మాటలుకూడా వ్యాపించి ఉన్నవి.

కొంతమంది మోసగాళ్ళు భయపెట్టి ధనం సంపాదించటానికి మాంత్రికుల వలె నటిస్తూ - పెద్ద బొట్టు పెట్టుకొని ఎముకల పూసల మాలలు మెడలో ధరించి సంచరిస్తూ ఉంటారు. మరికొందరు ఎవరికైనా పెద్ద బాధో, వ్యాధో వస్తే నీ మీద ప్రయోగం చేశారని చెప్పి బాగు చేస్తానన్న పేరుతో డబ్బులు గుంజటం జరుగుతున్నది. ఇక నిధి నిక్షేపాలపేరుతో చేస్తున్న మాయలు ఇన్నీ అన్నీ కాదు. మొత్తం మీద ఇటువంటి వాళ్ళ వల్ల తాంత్రిక విద్యలంటే ప్రయోగాల విద్యలు. తాంత్రికుడంటే క్షుద్రమాంత్రికుడు - అనే చెడు పేరు వ్యాపించింది. అసలు విద్యలు తెలిసిన వారికంటే నటించేవాళ్ళ సంఖ్య అధికమై పోయింది.

ఇక మరికొందరున్నారు. వీరిది వేరొకమాయ. "అంతశ్శాక్తా బహిశ్శైవా సభాయాం వైష్ణవామతాః" అన్న పద్ధతి. పరమాచార పరులవలె వేష భాషలుంటవి. సభలలో, సమావేశాలలో తాంత్రిక పద్ధతులు వామాచారమని క్షుద్రప్రక్రియలని తీవ్రంగా ఖండిస్తుంటారు. రాత్రివేళ ఏకాంతంగా మద్య మైథునాలతో పంచమకార సాధనలు చేస్తుంటారు. వీళ్ళను చూస్తుంటే ఒక పౌరాణికుని కథ గుర్తుకు వస్తున్నది. పురాణం చెబుతూ గుళ్ళో అందరూ సాత్వికాహారమే తీసుకోవాలి. ఉల్లిగడ్డ తినగూడదు - నపలాండుం భక్షయేత్ అని ధర్మశాస్త్రంలో ఉంది అని ప్రవచనంలో ఉద్ఘాటించాడు. రాత్రిభోజనంలో

పులుసులో ఉల్లిగడ్డ ముక్కలు లేవు. ఎందుకు వెయ్యలేదు అని భార్యను గదమాయించాడు. మీరు ఇందాక పురాణంలో తప్పని చెప్పారు గదండీ! దోషం గదా అని వెయ్యలేదు అన్నదామె. ఆ చెప్పింది అందరికోసంగాని మనకోసం కాదు. రేపటి నించి మరిచిపోవాకు అని హెచ్చరించాడు.

కొంతకాలం క్రింద ఒక ఆశ్రమాధిపతి నాతో ఏకాంత సమావేశం కోరి మాట్లాడాడు. "స్వామివారూ! మనం చిరకాలంగా పరిచితులము కొంత సన్నిహితులము. మీ వల్ల అసాధ్యములైన వ్యాధులు కుదరటము, భూతగ్రస్తులు బాగుపడటం, మరికొన్ని అద్భుతాలు నేను చూచాను. మీరు వామాచారపరులని, శ్మశాన సాధకులని కొందరు చేస్తున్న ప్రచారమూ గమనిస్తున్నాను. వాటిని లెక్క చేయని మీ అజేయశక్తిని చూస్తున్నాను. నేను సన్యాసినే గాని ఆ నియమాలను సరిగా అనుసరించటం లేదని మీ వరకు తెలియజేస్తున్నాను. నాకు దివ్యశక్తులుల సాధించాలని ఉంది. కఠోరతపస్సు చేయలేను. మీరు మా ఆశ్రమంలో కొద్దిరోజులుండి నా చేత తీవ్రసాధనలు చేయించండి. కావలసిన అన్ని ఏర్పాట్లు చేయగలను. అత్యంత రహస్యంగా ఉంటుంది" అని అభ్యర్థించాడు. "హిమాలయ సిద్ధాశ్రమ యోగుల జన్మాంతర సంబంధం వల్ల, వారి అనుగ్రహం వల్ల కుర్తాళపీఠస్థాపకుడైన మౌనస్వామి కరుణ వల్ల నాకు దేవతానుగ్రహం లభించింది. మీరు చెప్పిన ఇతరేతర మార్గాలు నాకు నచ్చవు. కొంతకాలం కాశీలోనో శ్రీశైలంలోనో తీవ్రంగా తపస్సాధన చేయండి. వేగంగా సాధన పరిపూర్ణమయ్యేట్లు మంత్రదేవతను కోరుతాను" అని చెప్పి వచ్చేశాను.

మనుష్యులలో రకరకాల వాళ్ళున్న విధంగానే దేవతలను గూడా వివిధ వర్గాలుగా కొందరు విభజించి చూస్తున్నారు. మహాదేవతలకు అపచారం చేస్తున్నారు.

కాళీ విగ్రహం ఇంట్లో పెట్టుకోవచ్చునా ? ఆ దేవత మంత్రం చేయవచ్చునా? అలాగే భైరవుడు, బేతాళుడు, డాకిని మొదలైన దేవతల పూజలు చేయవచ్చునా? ఎన్నో సందేహాలు – కాశీ వెళితే భైరవుడంటే యేమిటో తెలుస్తుంది. డాకినీ బేతాళాలయాలు అక్కడక్కడ ఉన్నవి. శాకినీ డాకినీ దేవతల

గురించి లలితా సహస్రనామాలలో ఉంది. బేతాళుడు విక్రమార్కునకు దీర్ఘాయువు నిచ్చిన దేవత. పూర్వం బేతాళుని గొప్ప దేవతగా ఆరాధించి పిల్లలకు పేరు పెట్టుకొనే వారు. విక్రమార్కుని ఆస్థానంలోని నవరత్నాలలో బేతాళభట్టారకుడు అలాగే భైరవశర్మలు - భైరవారాధ్య - ఇలాంటి పేర్లు గలవారు చాలా మంది. టిబెట్‌లో డాకిని అంటే మధురగానం చేసే అప్సరస. కాళికా పురాణంలో వీరికథలు వివరంగా ఉన్నవి. ఈ సంశయాత్ములకు పట్టింది అనుమాన పిశాచం. సత్యం తెలిస్తే అది వదిలి పోతుంది.

ఆ ప్రయత్నం చేస్తుంది యీ గ్రంథం. అసలు దేవతలంటే యేమిటో, శక్తులంటే యేమిటో, తంత్రమార్గాలేమిటో ఈ పుస్తకం కనువిప్పు కలిగించి అవగతం చేస్తుంది. అజ్ఞాన తిమిరంలో నుండి తంత్రజ్ఞాన సూర్య తేజస్సులోకి ప్రవేశింప జేసేదే యీ రచన. దాదాపు యాభై సంవత్సరాల క్రింద ఇందులోని వ్యాసాలు ఆంధ్రప్రభ దినపత్రికలో ప్రతి ఆదివారం ప్రచురితమైనవి. రెండు మూడు తర్వాత చేర్చి ప్రచురించటం జరిగింది. ప్రస్తుతం ఇది నాలుగవ ముద్రణ.

ప్రసార మాధ్యమాలలో మార్పు వచ్చి ఫేసుబుక్కులు, యూట్యూబులు, టి.వి.ఛానల్స్ మొదలైనవి పెరిగిన తరువాత ఈ మార్గం వైపు వేల లక్షల మంది ప్రజలు ఆసక్తి చూపిస్తున్నారు. ఆకర్షితులవుతున్నారు. దేశవిదేశాలలోనూ సంచారంలో ఈ విషయం స్పష్టంగా గోచరిస్తున్నది. అసంఖ్యాకులు మంత్రోపదేశాలు తీసుకుంటున్నారు. కష్టాల నుండి బయటపడుతున్నారు. దివ్యానుభవాలు పొందుతున్నారు. ఇది శుభపరిణామమే. అయితే దొంగ మాంత్రికులు, మాయా తాంత్రికులు - వీళ్ళ విషయంలో ప్రజలు జాగ్రత్త వహించాలి. ఇక పుస్తకంలోకి ప్రవేశించండి ! చీకటిలో నుండి వెలుగులోకి, అసత్యంలో నుండి సత్యంలోకి నడవండి.

# విషయసూచిక


| క్ర.సంఖ్య | శీర్షిక | పుట |
|---|---|---|
| 1. | తంత్ర ప్రక్రియలు | 11 |
| 2. | తంత్ర విశిష్టత | 14 |
| 3. | తంత్ర శాస్త్రములు | 17 |
| 4. | దక్షిణాచారము | 22 |
| 5. | దీక్షలు - పరీక్షలు | 26 |
| 6. | వామాచారము - కౌలము | 30 |
| 7. | మద్యపానము - అర్చనలు | 34 |
| 8. | చక్రార్చనము - స్వేచ్ఛాకామము | 38 |
| 9. | పాము మంత్రములు | 42 |
| 10. | సర్పశాప యోగము | 46 |
| 11. | స్వప్న విద్యలు | 50 |
| 12. | శ్మశాన సాధనలు | 53 |
| 13. | శవములు - సమాధులు | 61 |
| 14. | ఆవేశాలు, పూనకాలు | 65 |
| 15. | సూక్ష్మశరీరము - 1 | 72 |
| 16. | సూక్ష్మశరీరము - 2 | 75 |
| 17. | ప్రేత లోక విశేషాలు - 1 | 79 |
| 18. | ప్రేత లోక విశేషాలు - 2 | 83 |
| 19. | గ్రహాలు - రకాలు | 87 |
| 20. | దయ్యం పట్టిన మనుషులు | 90 |
| 21. | భూతావేశము | 95 |
| 22. | గ్రహాలు - దయ్యాలు | 99 |
| 23. | ప్రేతాత్మల ఆవాహన - 1 | 104 |
| 24. | ప్రేతాత్మల ఆవాహన - 2 | 108 |
| 25. | దివ్య దృష్టి | 111 |
| 26. | ఉచ్ఛిష్ట గణపతి | 116 |
| 27. | కర్ణ పిశాచి | 120 |
| 28. | శవ చింతామణి | 124 |
| 29. | సారస్వత విద్యలు | 128 |
| 30. | దీపావళి - దీపదేవతలు | 132 |
| 31. | కాల తంత్రము | 136 |
| 32. | రాజకీయాలు - మంత్ర తంత్రాలు | 141 |
| 33. | సంసారము - మంత్ర ప్రయోజనము | 152 |
| 34. | ముఖ్యమైన ప్రయోజన మంత్రములు | 160 |

# తాంత్రిక ప్రపంచం

## తంత్ర ప్రక్రియలు

తంత్రమనే మాట ఎంతో ప్రాచీనకాలం నుంచీ ఉపయోగించబడిన పదం. నిఘంటువులు ఈ పదానికి చాలా అర్థాలు ఇచ్చినవి. తన్యత ఇతితంత్రం-తనువిస్తారే. విస్తరించబడునది అని వ్యుత్పత్తి. ప్రధాని, సిద్ధాంతము, నూలుపడుగు, పరివారము అని అమరకోశం అర్థాలిస్తే - వైజయంతీ నిఘంటువు స్వరాష్ట్ర చింత అన్న అర్థం ఇచ్చింది. ఈ అర్థాన్ని బట్టే స్వతంత్రము మొదలైన శబ్దాలు ఉపయోగించబడుతున్నవి. భారతం ఆదిపర్వంలో ఒక దృశ్యం తంత్రంగా చెప్పబడింది.

ఉదంకుడనే మహర్షి గురుపత్ని కోరిక ప్రకారం పౌష్యమహాదేవి కుండలాలు తెస్తూ త్రోవలో తక్షకుడు వాటిని అపహరించగా వాని వెంటబడి పాతాళానికి వెళ్లాడు. అక్కడ సితాసితతంతు సంతానపటము నేస్తున్న యిద్దరు స్త్రీలను, ద్వాదశారచక్రము తిప్పుతున్న ఆరుగురు కుమారులను, అతిప్రమాణతురగారూఢుడైన ఒక దివ్యపురుషుణ్ణి చూచాడు. అదంతా ఒక దేవతా రహస్యం. దాన్ని ఒక గొప్ప తంత్రంగా వ్యాసుడు వర్ణించాడు. ఈ విధంగా ఈ శబ్దం ఎంతో విశిష్టతను సంతరించుకొన్నది.

మంత్రశాస్త్ర విశేషాలను చెప్పే గ్రంధాలు చాలావాటికి తంత్రములనే పేరే పెట్టబడింది. మంత్రాన్ని సిద్ధి పొందటానికి అవసరమయ్యే సామగ్రి అంతా తంత్రం కిందికే వస్తుంది. మాలికలు, హోమద్రవ్యాలు, కుండ విశేషాలు, తర్పణ వస్తువులు, వాటిని ఉపయోగించే విధానాలు ఇవన్నీ తంత్ర విభాగాలే. కనుక ఈ వ్యాస పరంపరలో తంత్రమనేది మంత్ర సంబంధమైన సిద్ధిసాధనాలను వివరించే ప్రక్రియగా భావించవచ్చు. ప్రాచీనమంత్ర శాస్త్రవేత్తలు ఏ అర్థంలో ఉపయోగించారో ఆ అర్థాన్నే అనుసంధానించవచ్చు.

శాస్త్రగ్రంధాలలో తంత్రశాస్త్రానికి ఎంతో ప్రాధాన్యం ఇవ్వబడింది.

శ్లో॥ **విష్ణుర్వరిష్ఠో దేవానాం హ్రదానాముదధిస్తథా**
**నదీనాంచ యథాగంగా పర్వతానాం హిమాలయః**

అశ్వత్థః సర్వవృక్షాణాం రాజ్ఞామింద్రో యథావరః
దేవీనాంచ యథాదుర్గా వర్ణానాం బ్రహ్మణో యథా
తథా సమస్త శాస్త్రాణాం తంత్రశాస్త్రమనుత్తమం
సర్వకామప్రదం పుణ్యం తంత్రం వై వేద సమ్మితం

దేవతలలో విష్ణువు వలె, హ్రదములలో సముద్రము వలె, నదులలో గంగ వలె, కొండలలో హిమవంతము వలె, చెట్లలో రావివలె, రాజులలో ఇంద్రుని వలె, సమస్త శాస్త్రములలో తంత్రశాస్త్రము శ్రేష్ఠమైనది, వేదసమ్మితమైనది.

ధర్మార్థకామమోక్షములను సాధించే వివిధ మార్గాలు, పద్ధతులు వివరంగా ఈ శాస్త్రములో గోచరిస్తవి. మోక్ష సాధన అన్నిటిలోకి గొప్పది. అయితే లోకంలో అంతా ముక్తిమార్గగాములు కాలేరు. అలా అయ్యే ఏ కొద్దిమందో వైరాగ్యనిరతులై సన్యాసులవుతారు. భక్తి జ్ఞాన సమన్వితులై మహానుభావులై లోకాదర్శప్రాయులై తరిస్తారు. ప్రకృతంతా వారికి జోహారు చేస్తుంది. ప్రకృతే తామై పోతా రా నిస్సంగులు.

వ్యాసపుత్రుడైన శుకమహర్షి ఆ విధంగా సముడై, ముక్తకర్మచయుడై, సన్యాసియై వెళ్లిపోయాడట. పుత్రమోహంతో వ్యాసుడు వెంటబడి పిలిస్తే ప్రకృతిలోని వృక్షములు కూడా శుకమయమై ప్రతిధ్వనులు చేసినవట. అటువంటి వారికి తంత్రశాస్త్రముల అవసరం లేదు. ప్రాథమిక దశలో తపోమార్గ నిర్వహణకు కొంత ఉపయోగిస్తే ఉపయోగించవచ్చు. అంత మాత్రమే.

ఇక మిగతా విషయానికి వస్తే ప్రతి వ్యక్తికీ ఎన్నో కోరికలుంటవి. వాటిల్లో కొన్ని ధర్మబద్ధమైనవి ఉంటవి. కొన్ని కానివీ ఉంటవి. కాని వాటిని సాధించి తీర్చుకోవటానికి మాత్రం చేతగాని అసమర్థస్థితిలో ఉంటాడు. ఎవరినైనా పెద్దలను సమీపించి సలహా అడిగితే,

శ్లో॥ యద్దుష్కరం యద్దురాపం యద్దుర్గం యచ్చదుస్తరం
తత్సర్వం తపసాసాధ్యం తపోహి దురతిక్రమం

లౌకిక మార్గాల ద్వారా సాధించటానికి ఏది సాధ్యం కాదో, ఏది దుస్తరంగా, పొందరానిదిగా ఉంటుందో దానిని తపస్సుచేత సాధించవచ్చు. అయితే తపస్సు మాత్రం చాలా కష్టం సుమా అని చెపుతారు.

నిజమే, ఆదికాలంలోని మహర్షులవలె ఎంతమంది కఠోరంగా తపస్సు చేయగలరు? ఎండాకాలంలో పంచాగ్నిమధ్యంలోను, శీతాకాలంలో గొంతులోతు చన్నీళ్ళలో నిలచి నిరాహారులై పర్ణ, జల, వాయుభక్షులై ఎందరు తపించగలరు? పూర్వం హిరణ్యకశిపుడైతే ఎముకలు మాత్రమే మిగిలేలా శరీరాన్ని కృశింపజేసి తపస్సు చేశాడట. రావణుడు తలలు తరిగి హోమం చేశాడట. అదంతా పూర్వయుగాలలో-కలియుగంలో ఇటీవలి కాలంలో రామకృష్ణపరమహంస, రమణమహర్షి వంటి కొద్దిమంది కఠోర తపస్సు చేసినవాళ్ళు కనిపిస్తున్నారు. మహాత్మాగాంధీ ఉపవాసవ్రత దీక్షలు నడిపి కొంచెంగా ప్రకృతిమీద అనుశాసనశక్తి సంపాదిస్తే అదే ఎంతో గొప్పగా చెప్పుకొన్నారు. ఒళ్ళు కొరడువారే చలిలో తెల్లవారుజామున ఆయన లేచి వెళ్లి థేమ్సునదిలో స్నానంచేసి కొల్లాయిగుడ్డతో వీధుల్లో నడిస్తే ఆంగ్లేయులే కాదు ప్రపంచమంతా విభ్రాంతిని వ్యక్తం చేసింది.

కాని అంతా పరమహంసలు, మహర్షులు, మహాత్ములు కాలేరు గదా! తీరని కోరికలు మాత్రం ప్రతి మనిషినీ వెంటాడుతూ, వేటాడుతూనే ఉంటవి. కనుక ఏ కోరికైనా సాధించాలంటే తంత్రసహాయం అవసరం. తంత్రశాస్త్రాలలో ఎటువంటి కష్టమైన పనినైనా సాధించటానికి కావలసిన పద్ధతులు చెప్పబడినవి. ఇంద్రజాలతంత్రంలో ఉపోద్ఘాతంలో ఇలా చెప్పబడింది.

"నీ కెవరిమీదనైనా కోపం వచ్చిందనుకో, వాడు లౌకికంగా నీ కంటే ఉన్నతుడనుకో, ఏం చేస్తావు ? అసమర్థతతో బాధపడక తప్పదు. కనుక ఇంద్రజాలం నేర్చుకో. ఏమైనా చేయవచ్చు".

సత్యమే, ఒక్కోసారి అనిపిస్తుంది. ఈ లోకంలో జరుగుతున్న అన్యాయాలు చూస్తున్నప్పుడు తంత్రప్రక్రియలు మళ్ళీ బాగా వ్యాప్తిలోకి వస్తే బాగుండుగదా అని. ప్రపంచంలో ఎందరో అక్రమాలు చేస్తున్నారు. అన్యాయాలు చేస్తున్నారు. ధనాధికార పదవీ ప్రాభవాలచేత వాళ్ళను ఎవరూ ఏమి చేయలేకపోతున్నారు. అదేమిటి భగవంతుడు లేడా ? దుష్టశిక్షణ, శిష్టరక్షణ ఆయన కర్తవ్యం గదా అనవచ్చు. ఎప్పుడో మరీ మితిమీరితే, రావణాసురుడంత, దుర్యోధన దుశ్శాసనులంత దుష్టులు వస్తే అప్పుడు గదా దేవుడు దిగివచ్చేది ! అందాకా మనుషుల గతి ? నిర్గతేనా ?

కాబట్టే తంత్రప్రక్రియలు బాగా ప్రాచుర్యం పొందాలి. అయితే ఒక మాట అనవచ్చు. శక్తిసంపాదకమైన ఈ సాధనలవల్ల దుర్మార్గాలు చెయ్యరా?

దుష్టమైన కామక్రోధాలకు ఇవి వినియోగం కావా ? అని ప్రశ్నించవచ్చు. కావచ్చు. కాని లోకంలో ఆయుధాలను దుర్మార్గానికి వినియోగించవచ్చు గదా అని తత్సాధన మానటంలేదు. కత్తి దుష్టశిక్షణకేగాక ఆత్మరక్షణకూ అవసరం. ఒకప్పుడు దుర్వినియోగం కావచ్చు. అట్లని దాని సాధన మానరాదు. సద్గురువు సరియైన శిష్యులను ఎన్నుకొని తాంత్రిక సాధనలు చేయించవచ్చు. వాటిని లోక శ్రేయస్సుకు వినియోగించవచ్చు. బూటకపు మాంత్రికులు, వంచకులైన యోగులు పెరిగిపోయిన యీ కాలంలో నిజమయిన తంత్రరహస్యాలు తెలిసి సాధించిన సిద్ధుల అవసరం ఎంతైనా వుంది. ఆ దృష్టితో తంత్రశాస్త్ర పరిశోధన ఈనాడు బాగా జరగాలి. ఈ వ్యాసాలు అందుకు కొంతైనా దోహదం చేయగలవని ఆశిద్దాము.

# తంత్ర విశిష్టత

శ్లో॥ ఇహాసనే శుష్యతు మే శరీరం
త్వగస్థి మాంసాణి లయం చ యాంతు
అప్రాప్య బోధం బహుజన్మ దుర్లభం
నైవాసనాత్ కాయ మత శ్చలిష్యతి.

శాక్య సిద్ధార్థుడు బుద్ధత్వం పొందటానికి తపస్సుకు కూర్చుంటూ "ఈ కూచున్నచోటనే శరీరము శోషించును గాక ! చర్మము, మాంసము, ఎముకలు నశిస్తే నశించును గాక ! బహుజన్మ దుర్లభమైన జ్ఞానమును పొందకుండా ఆసనము నుండి కాయము కదలదు" అని ప్రతిజ్ఞ చేసి దీక్షపట్టి సాధించాడట!

ఈ కలికాలంలో అంతటి కఠిన వ్రతాలను చేసే పట్టుదల, శక్తి ఎంతమందికుంటుంది ? కృతయుగంలో ఎముకలుంటే చాలు చర్మము మాంసమూ పోయినా ప్రాణాలుండేవట ! త్రేతాయుగంలో ప్రాణం చర్మగతమై ఉండేదిట ! ద్వాపరయుగంలో మాంసం ఉన్నంత కాలం ప్రాణం ఉండేదిట ! కలియుగంలో మాత్రం మనుషులు అన్నగతప్రాణులు. అటువంటి అన్నాన్ని వర్జించి పవనపర్ణాంబు భక్షులై నవసే ఓపిక ఈకాలంలో చాలా తక్కువ. అయితే సిద్ధశక్తులు ఊరక శ్రమపడక వస్తయ్యా మరి ! కాని వీలున్నంతలో తక్కువ కష్టంతో ఎక్కువ ఫలితాలు సంపాదించే మార్గాలను తంత్రశాస్త్రములు అందిస్తవి. అంటే ఉదాహరణకు ఒక వ్యక్తి వట్టి జపం పదికోట్లు చేశాడనుకోండి. దానివల్ల వచ్చే ఫలితము – దానికి

తగిన ద్రవ్యాలతో హోమంచేస్తే పదోవంతు శ్రమతోటే వస్తుందని చెప్పవచ్చు.

అసలు ఈ తపఃప్రక్రియలు, హోమబలి తర్పణాది పద్ధతులు ఇవన్నీ ఎవరికంటే గట్టిగా మనసు నిలవని వాళ్ళకనే చెప్పాలి. ఈ మాటంటే కొంతమంది ఇదేమిటా అని నిలదీయవచ్చు. కొంచెం వివరిస్తాను, పురాణాలలో, ఋషుల కథలలో చాలాచోట్ల పంచాగ్ని మధ్య తపస్సు, శీతలజల మధ్య తపస్సు, ఎడమకాలి బొటనవ్రేలి మీద నిలబడి చేసే తపస్సు ఇలా కఠోర నియమాలెన్నో వర్ణించబడినవి. ఆ విధంగా చాలాకాలం కష్టపడగా ధ్యేయదేవత ప్రత్యక్షమై వరాలివ్వటము చెప్పబడినది. భాగవతంలో హిరణ్యకశిపుని తపస్సు, రామాయణంలో రావణుని తపస్సు, ఇతర పురాణాలలో ఋషులు, రాక్షసుల తపస్సులు, కుమారసంభవంలో పార్వతీదేవి తపస్సు ఎంతో అద్భుతంగా వర్ణించబడినవి. ప్రాచీన కాలంలో తపస్సులు అనుసరించిన మార్గమిది.

అంటే ఒక మనిషికి ఒక కోరిక సాధించాలని పట్టుదల కలిగిందనుకోండి అది లౌకిక మార్గాల వల్ల లభ్యం కానప్పుడు తపోదీక్షను ఎన్నుకొనేవాళ్ళు. పూజ్యులైన పెద్దల దగ్గర తన ఇష్టదేవతా మంత్రాన్ని ఉపదేశం పొంది దాన్ని జపం చేయటం మొదలు పెట్టేవాళ్ళు. ఏదో ఒక పవిత్ర ప్రదేశాన్ని, ఏకాంతంగా ఉండే స్థలాన్ని ఎన్నుకొని బ్రహ్మచర్యంతో ఏకభుక్తంతో వ్రతం నడిపేవాళ్ళు. అలా కొంత కాలం చూచి దేవతానుగ్రహం రాకపోతే ఆ ఒంటిపూట కూడా ఆహారం వదలి పండ్లు, నీరు మాత్రమే తీసుకుంటూ జపం సాగించేవారు. ఆ తర్వాత ఆ పండ్లు కూడా వదలి, వట్టి నీళ్ళతో ప్రాణాలు నిలుపుకుంటూ తపించేవారు. ఈ విధంగా తాము చేయగలిగినంతగా శరీరాన్ని కృశింపజేస్తూ ప్రాణాలు మాత్రం పోకుండా జాగ్రత్తపడుతూ దేవతాసాక్షాత్కారం అయ్యేదాక ఘోరవ్రతాలు ఆచరిస్తూ ఉండేవారు. ఎప్పటికో సాక్షాత్కరించిన ఆ దేవతలు కూడా చాలా అసామాన్యమైన వరాలే ఇచ్చేవారు.

దేవతా మంత్రజపం ప్రారంభం కాగానే మనస్సులయమైపోయి సమాధిదశ ఎవరికైనా వచ్చిందనుకొందాము. అప్పుడా వ్యక్తి కుటీరంలో ఆసనంమీద కూర్చున్నా ఒకటే, ఎండలోనో, చలిలోనో ఉన్నా ఒకటే. సమాధిదశలో బాహ్య ప్రపంచంతో సంబంధం ఉండదు గనుక బయట ఏ స్థితిలో ఉన్నాడు అనేది లెక్కలోకి రాదు. పాదాంగుష్ఠం మీద నిలిచే వ్యక్తి కావాలని ఆ శ్రమ ననుభవిస్తూ జపం చేస్తుంటాడు. అలాగే మధ్యందిన గ్రీష్మమార్తాండుని వేడిని, శిశిర శీతలతనూ అనుభవిస్తూ తపిస్తూ

దేవతాభావన చేయటం తపస్సులో ప్రక్రియలు. ధ్యానయోగంలో మనస్సు నిలిస్తే ఈ శ్రమంతా అక్కరలేదు. ఆ విధంగా సమాధిస్థితిని పొందలేనివారే ఈ తపస్సు చేయటం జరిగేది. పద్మపురాణంలోని కార్తవీర్యార్జునుని కథలో ఈ విషయం స్పష్టంగా చెప్పబడింది. దత్తాత్రేయుని అనుగ్రహము వల్ల కార్యవీర్యార్జునుడు నెలలతరబడి సమాధిలో ఉండేవాడు. మళ్ళీ బయటికి వచ్చి లౌకిక ప్రపంచంలో పనులు చేసుకొనేవాడు.

యోగసాధనలవల్ల సమాధిస్థితిలోకి పోవటం చేతనైనవాడు దీర్ఘాయువును సాధించిన వాని క్రింద పరిగణించాలి. మృత్యువును కూడా జయించటం దానివల్ల సాధ్యమని యోగశాస్త్రాలు చెపుతున్నవి. జ్ఞానము చేత మృత్యుసమయాన్ని తెలుసుకొని ఆ వేళకు సమాధిస్థితిలో ఉంటే సరి ! మృత్యుదేవత వస్తుంది. చూస్తే యోగి మృతునితో సమానుడు. సమాధిస్థితిలో హృదయనాడీ స్పందనాదులుండవు. మనస్సు పని చేయదు. నిద్రా అంటే నిద్రకాదు. మెలకువా అంటే అదీకాదు. అటువంటి విచిత్రస్థితి చూచి మృత్యువు వెళ్ళిపోతుంది. యోగి సమాధిలోనించి బయటికి వచ్చి జీవిస్తాడు.

ప్రారబ్ధకర్మవాదులు కొందరంటారు గదా – **"మనిషి ఆయుర్దాయం నిర్ణీతం, ఈ జీవితంలో చేసే ఏ కర్మ వల్ల కూడా ఆయువు పెరగటం, తరగటం ఉండదు అని. సుకృతం చేస్తే ఆయువు పెరుగుతుందనీ, దుష్కృతం చేస్తే ఆయువు తరుగుతుందనీ అనుకోటం భ్రాంతి. పాపపుణ్యాల ఫలితాలు ఈ జన్మలో అనుభవానికి రావు. కనుక పూర్వజన్మ కర్మచేత ఈ దేహంలోకి వచ్చేప్పుడు జీవుడు ఎంత ఆయువు తెచ్చుకొంటే అంతే తప్ప క్షణం పెరగదు, క్షణం తరగదు"** అని చెపుతారు.

ఒక గడియారం ముల్లు ఉందనుకోండి. అది ఒక అంకె దగ్గరనించి మరొక అంకె దగ్గరకు సామాన్యంగా నిర్ణీత వేగంతో ప్రయాణం చేస్తూ వుంటుంది. యంత్రవిశారదుడైన వ్యక్తి కావాలంటే దాన్ని వేగం పెంచికాని, తగ్గించికాని కావాలంటే కొంతసేపు ఆపిగాని ముల్లు త్రిప్పగలడు. అదే విధంగా యోగి ప్రాణాన్ని వశంచేసుకొని సమాధిస్థితిని సాధించటం వల్ల ఎక్కువ కాలం జీవించగలడు. సిద్ధాంతరీత్యా చెపితే అది ఆయువును పెంచటం కాదు. జీవితాన్ని అనుభవించటంలో వేగాన్ని తగ్గించటమన్న మాట. భట్టివిక్రమార్కుడి కథలో చెపుతుంటారే అటువంటిది. కాళీదేవి భట్టికి రెండువేలేండ్లు బ్రతుకుతావని

వరమిచ్చింది. విక్రమార్కుడికి వెయ్యేండ్లు రాజ్యపాలన చేస్తావని వరమిచ్చింది. భట్టితో సమానంగా జీవించటంకోసం విక్రమార్కుడు ఆర్నెల్లు రాజ్యపాలన చేస్తూ ఆరునెలలు దేశసంచారం చేశాడు. అలానే ఆయుర్యంత్రాన్ని సమాధిస్థితి ద్వారా వశం చేసుకొని కొంచెం నెమ్మదిగా తిప్పవచ్చు. లోక పరిభాషలో ఆయువును పెంచుకోటమంటే అదే.

తంత్రశాస్త్రములో కూడా మృత్యువును జయించే ప్రక్రియలు చాలా చెప్పబడినవి. అపమృత్యువును పోగొట్టుకోటానికయితే అసంఖ్యాక మార్గాలున్న వనుకోండి. అవన్నీ అలా ఉంచి, తంత్ర సాధనలచేత అసాధ్యమయిన వాని నెన్నంటినో సాధించవచ్చునన్నది సారాంశం.

అయితే ఒకటి గమనించాలి. ఘోరవీర రావణ తపస్సు ఎలానూ సులభం కాదు కనుక, తంత్రమార్గం అవలంబించనున్నాము గదా అని తపస్సు అసలు అక్కరలేదని మాత్రం కాదు. తపస్సువల్ల వచ్చే మహాఫలితాల ముందు ఇవెంత ? కాని అల్పసారులు, కించిత్కరులు మాత్రమే అయిన సామాన్యులకు వేగంగా కామ్యసాధనకు తంత్రశాస్త్రం బహువిధమార్గాలను బోధిస్తుందని గుర్తించాలి. తంత్రశాస్త్రముల మహత్వాన్ని కీర్తిస్తూ మేరుతంత్రంలో ఇది ధర్మసారము, వేదసారము, మహనీయము అని శివుడు పార్వతితో చెపుతూ తానే నూటయెనిమిది తంత్రగ్రంథాలను లోకప్రయోగదృష్టితో పలికినట్లుగా అన్నాడు. కనుక తంత్రశాస్త్రమహిమ అసామాన్యము.

# తంత్రశాస్త్రములు

ఊహకందని పూర్వకాలంనించి తంత్రములు ప్రఖ్యాతంకాగా వాటి విశేషాలు చెప్పే గ్రంథాలు కూడా ఇంచుమించు అంత ప్రాచీనమైనవనే చెప్పాలి. మహావిశ్వసారతంత్రంలో యామళోడ్డీశ భూతడామరాదులు అరువది నాలుగు తంత్రగ్రంథాలు చెప్పబడినవి. వాటిల్లో మేరుతంత్రం చాలా గొప్పదని మేదినీమధ్యంలో మేరువులాంటిదని కొందరు విద్వాంసులు భావిస్తున్నారు. అందులో శివవిష్ణుగణేశాదిత్య గౌర్యాది దేవతల యొక్క, గంగా యమునాది నదుల యొక్క అనేకానేక - ఇతర దేవతల యొక్క మంత్ర యంత్ర ధ్యాన న్యాస పీఠావరణార్చనాది విధులన్నీ స్పష్టంగా చెప్పబడినవి.

అటువంటిదే శారదాతిలకతంత్రము. చాలా ప్రామాణికమైన గ్రంథం. అయితే మేరుతంత్రంలో ఉన్నంత స్పష్టత దీనిలో లేదు. ఇందులో సాంకేతిక పదాల గజిబిజి ఎక్కువ. వ్యాఖ్యాన రహితంగా చదవటం కష్టం. అలాగే మంత్రమహోదధి అనే గ్రంథం ఉంది. ఎంతో ప్రశస్తమైనది. అదీ సవ్యాఖ్యానమై మంత్రరత్నాకరమనే పేరుతో ప్రఖ్యాతి చెందింది. ఇవి ప్రధానంగా వైదికమార్గ ప్రశస్తి చెప్పే గ్రంథాలు. అక్కడక్కడ వామాచార ప్రక్రియలు కొన్ని ఉన్నా ఇవి దక్షిణాచారానికి ప్రాధాన్యాన్నిచ్చి చెప్పేవే. మేరుతంత్రంలో ఈశ్వరుడు నూట ఎనిమిది తంత్రములను పలికినట్లు చెప్పబడింది.

శ్లో॥ మయాకృతాని తంత్రాణి సంఖ్యయాష్టోత్తరంశతం
యేన యేన ప్రార్థితోహం దేవీ సంప్రార్థితామయా.

కౌళావళీ నిర్ణయమనే గ్రంథంలో డెబ్బది రెండు తంత్ర గ్రంథాలు ప్రస్తావించబడినవి. వాటి పేర్లు ఎలా వుంటవో పాఠకులకు తెలియటానికి ఆ పట్టిక మాత్రం ఇస్తాను.

1) రుద్రయామళము, 2) బ్రహ్మయామళము, 3) విష్ణుయామళము, 4) శక్తియామళము, 5) భావ చూడామణి, 6) తంత్రచూడామణి, 7) కుల చూడామణి, 8) కులసారము, 9) కులోడ్డీశము, 10) కులామృతము, 11) కులార్ణవము, 12) కాలికాకుల సర్వస్వము, 13) కులసద్భావము, 14) కాళీతంత్రము, 15) కులానందము, 16) కులచక్రము, 17) కాళీకల్పము, 18) మహాకాలము, 19) కుమారీ తంత్రము, 20) సమయాఖ్యకౌళీతంత్రము, 21) ఫేత్కార తంత్రము, 22) భైరవీ తంత్రము, 23) శ్రీక్రమము, 24) యోగినీ తంత్రము, 25) శ్రీహంస పరమేశ్వరము, 26) స్వతంత్రతంత్రము, 27) తంత్రరాజము, 28) జ్ఞానమాలా తంత్రము, 29) వాయవీతంత్రము, 30) హంస తంత్రము, 31) తారాకల్పము, 32) మాలినీ తంత్రము, 33) మంత్రనిర్ణయ తంత్రము, 34) యోగినీ హృదయము, 35) కౌలార్ణవము, 36) గాంధర్వ తంత్రము, 37) ఉడ్డీశయాన తంత్రము, 38) తోడల తంత్రము, 39) శివశాసన తంత్రము, 40) మందర తంత్రము, 41) ప్లావనీ తంత్రము, 42) వీరావళీ తంత్రము, 43) వారాహ తంత్రము, 44) కుబ్జికా తంత్రము, 45) నీలా తంత్రము, 46) మత్స్య సూత్రము, 47) వీర తంత్రము, 48) లలితా తంత్రము, 49) శంభునిర్ణయ తంత్రము, 50) వామకేశ్వర తంత్రము, 51) వటుకసంహిత, 52) తారార్ణవము,

53) గుప్తార్ణవము, 54) చండరోషతంత్రము, 55) మాయా తంత్రము, 56) నీలమణి తంత్రము, 57) సమయ తంత్రసారము, 58) మంత్ర విమర్శని, 59) జ్ఞానసార తంత్రము, 60) యోగావళీ తంత్రము, 61) భైరవీ తంత్రము, 62) భైరవ తంత్రము, 63) సిద్ధసారస్వత తంత్రము, 64) త్రిపురార్ణవ తంత్రము, 65) ఉత్తర తంత్రము, 66) ఛిన్నా తంత్రము, 67) వాతూల తంత్రము, 68) దక్షిణామూర్తి సంహిత, 69) నయోత్తర తంత్రము, 70) ఏకవీరా తంత్రము, 71) గురుప్రపంచము, 72) వివిధ తంత్ర సంగ్రహములు.

ఇవిగాక పరశురామ కల్పసూత్రములు, కులచూడామణి నిగమము, కౌలోపనిషత్తు, కామరత్న తంత్రము మొదలైన ఎన్నో తంత్ర గ్రంథములున్నవి. పైన చెప్పబడినవన్నీ ఎక్కువ భాగం కౌలమతాన్ని వివరించే గ్రంథాలు. కౌలం వామాచారంలో ఒక భాగం. వామాచార, దక్షిణాచారములంటే ఏమిటో విశదీకరించటం ఇక్కడ అవసరం. రాజకీయాల్లో ఉన్నట్లే లెఫ్ట్, రైట్ తంత్రమార్గాలలోను ఉన్నవి.

మేరు తంత్రంలో తంత్రస్థానం ఇలా చెప్పబడింది.

శ్లో॥ **నిష్పక్షపాతం వక్ష్యామి మేరుతంత్రే యథార్థతః**
**సర్వేభ్యోవైదికం శ్రేష్ఠం తతశ్చస్మార్తముత్తమం**
**తతస్తంత్రంతుతత్రాపి సంహితా అర్ణవాస్తతః**
**యామల స్తత్సంగ మాచ్ఛం మహేశానీచతాండవం**
**ఇంద్రజాలం కక్షపుటీ బౌద్ధం జైనం చ శాబరం.**

వేదం తర్వాత స్మృతి - తరువాత తంత్రశాస్త్రము. వానిలో బౌద్ధమైన శాబర తంత్రములు చివరివి. ఆయా తంత్రములలో అవే సర్వోత్కృష్టమైనవని ఉంటుంది. అది విషయాంతరం.

ఇక ఈ తంత్రవాదులలో వామాచారులు, దక్షిణాచారులు అని రెండు రకాలు చెప్పుకొన్నాము గదా ! ఈ విభాగాన్ని గురించి చిన్న కథ ఒకటి ఉంది. సురాసురులు పాలసముద్రాన్ని మధించేప్పుడు సురాకలశధారిణియై శ్యామ, గౌరాంగి, అరుణచేల, హరితకంచుక, ధవళోత్తరీయ ఒక త్రిలోక మోహిని ఉదయించింది. అసురులు శుక్రాచార్య వర ప్రభావంచేత దేవతలను జయించి ఆ సురను త్రాగారు. ఎవరైతే ఆనాడు సురాపానం చేశారో వారంతా వామాచారులు. ఆ సంప్రదాయం

వామాచరమైంది. వాళ్ళ దృష్టిలో,

శ్లో॥ సురా గంగా సురా సింధుః సురా దేవీ సరస్వతీ
సురా గోదావరీ రేవా సురైవ పరమంపదం.

సుర గంగాది నదులతో సమానము. అదే పరమ పదము.

శ్లో॥ పవిత్రాం పరమాం శక్తిం భుక్తిముక్త్యేకభాజనాం
సురాం నిందంతి యేమూఢా స్తేమూఢా జన్మజన్మని.

పవిత్ర శక్తిరూపిణి భుక్తిముక్తిదాయని అయిన సురను ఏ మూఢులు నిందిస్తారో వారు జన్మజన్మలకు మూఢులవుతారు.

అటువంటి సురాపానమత్తులై అసురులు మళ్ళీ దేవతలతో కలసి సముద్రాన్ని మధించగా అమృతం పుట్టింది. అయితే ఈసారి అది విష్ణుమాయాప్రభావంచేత దేవతలకు దక్కింది.

శ్లో॥ యైః పీతమమృతం తేతే సోమాపా బలదర్పితాః
లక్ష్మ్యా సహసముద్భూతా శతయత్నాశ్చ సోమపాః
తేషా ముపాసనా ప్రోక్తా దక్షమార్గేణ సా ద్విజైః

అమృతం త్రాగిన వాళ్ళది దక్షిణాచారం. అది అయిదు విధాలు.

శ్లో॥ కర్తవ్యా వైదికీశ్రేష్ఠా స్మార్తీస్యాన్మధ్యమోత్తమా
పౌరాణీమధ్యమఖ్యాతా తాంత్రికీత్వవరాస్మృతా
దైశీచకాలీజాతీయా కనిష్ఠాస్యాదుపాసనా
వైదికీ, స్మార్తి, పౌరాణీ, తాంత్రికి, దైశికీ తథా ।

వరుసగా ముందు దానికంటె తరువాతది తక్కువది. ఆ విధంగానే వామాచారం కూడా అయిదు విధాలు.

శ్లో॥ కౌలికోంగుష్ఠతాం ప్రాప్తో వామస్స్యాత్ తర్జనీసమః
చీనక్రమోమధ్యమస్స్యాత్ సిద్ధాంతీయోవరోభవేత్
కనిష్ఠ శ్శాబరోమార్గః ఇతివామస్తు పంచధా.

చేతి అయిదు వ్రేళ్ళలో బొటనవ్రేలు వంటిది కౌలికం. చూపుడు వ్రేలువంటిది వామం. మధ్యవ్రేలు వంటిది చీనక్రమం. అనామిక సిద్ధాంతం. చివరి కనిష్ఠిక శాబరం. ఆయా మార్గాల శ్రేష్ఠతాహీనతలను ఆ ఉపమానాలను

బట్టి గ్రహించవచ్చు.

వామాచారులు, దక్షిణాచారులు ఒకరి మార్గంలో మరొకరు ప్రవేశించటానికి ప్రయత్నిస్తే చాలా ప్రమాదమని తంత్రశాస్త్రాలు నిషేధిస్తున్నవి.

శ్లో॥ వామమార్గేయదాదక్షం ప్రవిశేత్ తత్సురైస్సతు
విఘ్నేన పీడ్యతే చాపి న సిద్ధి మధిగచ్ఛతి.
దక్షమార్గోయదావామం ప్రవిశేత్ తత్సురాస్తదా
లోకద్వయాద్వాపయన్తి తంగ్రసంతిచవామినం.
తస్మాత్ స్వకులమార్గంతు జ్ఞాత్వాకుర్యాదుపాసనం.

ఒకరి పద్ధతిలో మరొకరు ప్రవేశిస్తే మంత్రదేవతలు వాళ్ళను తింటారు. కనుక తమతమ కులాచార సంప్రదాయాల ననుసరించి ఉపాసన చేయాలి. వేదమంత్రాలు మనమెందుకు చేయకూడదని ఒకరూ, శీఘ్రసిద్ధి వస్తుంది గనుక సురాపానాదులతో మంత్రజపం చేద్దామనీ, బలులు సమర్పిద్దామని మరొకరూ తమకు నిర్దేశించబడని మార్గాలలో ప్రవేశిస్తే మిగిలేది ఉభయభ్రష్టత.

గాయత్రీ మంత్రం వంటి వేదవిద్యను వామాచారంలో సాధిద్దామని ఎవరైనా అనుకుంటే అంతకంటే బుద్ధిహీనత మరొకటి లేదు.

శ్లో॥ వామమార్గే వేదమంత్రో వజ్రపాతసమః స్మృతః
బ్రాహ్మణానాం వామమార్గో నరకాయైవ జాయతే.

వేదమంత్రాన్ని వామమార్గంలో ఉపాసించ బూనుకొంటే అది పిడుగులాగా సాధకుణ్ణి దగ్ధం చేస్తుంది. బ్రాహ్మణులకు వామమార్గం నరకానికే దారితీస్తుంది.

అలానే ఉచ్ఛిష్టగణపతి వంటి విద్యను శుచిగా మడికట్టుకొని జపం చేస్తానంటే కుదరదు. దాన్ని వామాచార పద్ధతిలోనే అశుచియై, దిగంబరుడై తంత్రోక్త మార్గంలో ఉపాసించాలి.

ఈ వామ దక్షిణ భేదాలు మరింత వివరంగా చర్చించవలసిన అవసరం ఉంది.

# దక్షిణాచారము

ఇంతకుముందు దక్షిణాచార వామాచారములను గూర్చి కొంత ప్రస్తావించబడింది. ఇప్పుడు మరికొన్ని వివరాలు పరిశీలిద్దాము.

దక్షిణాచారానికి శౌచం ప్రధానం. ఏవిధమైన అశుచిత్వము సోకరాదు. ఆహారవిహారాలలో కఠోరనియమాలుండాలి. వాటివల్లనే మనశ్శుద్ధి ఏర్పడుతుంది గనుక వాటికి ఎంతో ప్రాధాన్యముంది. చాలామంది ఏది ఎక్కడ తింటేనేమి ? స్నానంచేసి మడికట్టుకొని పూజ జపము చేస్తే చాలదా అంటారు. అదే పొరపాటు. మనస్సుమీద ఆహారంయొక్క ప్రభావం సామాన్యమైది కాదు. పెద్దలలో ప్రసిద్ధికెక్కిన ఒక కథ చెపుతాను. గొప్పవాడుగా పేరుచెందిన ఒక సన్యాసిని గృహస్థు ఒకడు భిక్షకు పిలిచాడు. ఎంతో మర్యాదతో గౌరవంతో ఏలోటూ రాకుండా భిక్షచేశాడు. భోజనమైన తర్వాత సన్యాసి ఇవతలకు వచ్చి కూర్చున్నాడు. కాసేపటికి యజమానిభార్య సువర్ణరత్నా భరణాలంకృతయైనది యేదో పనిమీద అటువచ్చి వెళ్ళింది. ఆమెను చూచి యీ సన్యాసి - ఆమె ధరించిన ఆభరణాలు మనకు దక్కితే బాగుండును, ఆశ్రమాన్ని అభివృద్ధిపరచవచ్చు, ఎన్నో సాధించవచ్చు అనిపించింది. మళ్ళీ వివేకం దాన్ని అణచివేసి ఎన్నడూలేని ఇటువంటి ఆలోచన వచ్చిందేమిటి ? ఆభరణాలు కాజేయాలనే చోరబుద్ధి నాలో ఎందుకుపుట్టింది ? ఆశ్చర్యంగా ఉంది. ఈరోజు తీసుకున్న ఆహారంలో ఏదో వికృతి ఉండాలి - అని నిశ్చయించుకొన్నాడు. గృహయజమానిని పిలిచి అడిగాడు. ఈపూట వంటలోకి చేసిన పదార్థాలెక్కడివి? వివరంగా విచారణచేసి చెప్పమన్నాడు. కూరలు వాళ్ళ దొడ్లో కాసినవి. పాలు, పెరుగు, నెయ్యి ఇంట్లోవే. ఆవులు, గేదెలు పాడి వున్నది. ఒక్క బియ్యం మాత్రం ఎవరో బాకీ ఇవ్వవలసివుంటే తెచ్చి యిచ్చిపోయినారు. అవి వాడారు. ఆ బాకీ తీర్చినవాణ్ణి పిలిపించారు. తరచి తరచి విడిగా ప్రశ్నిస్తే అతడు వాటిని ఎక్కడో దొంగతనం చేసి తెచ్చినట్లు తెలిసింది. చౌర్యముచేత తీసుకురాబడిన ఆ బియ్యములో ఆ గుణము ప్రవేశించి ఎన్నో చేతులు మారినా అది తిన్నవాళ్ళలో ఆ గుణాన్ని ప్రకోపింపజేసింది. అందువల్లనే ఆ సన్యాసిలో ఆ భావం రేగింది. అయితే సంయమి గనుక వెంటనే దాన్ని అరికట్టుకోగలిగాడు. కాని ఇక్కడ ఒకప్రశ్న పుట్టవచ్చు. ఆ అన్నంతిన్న గృహస్థు, అతని భార్య తదితరులు వాళ్ళకు కూడా ఆభావం పుట్టిందా అని. సన్యాసి పరమశుచియై ఉన్నాడు గనుక

ఆహారం వెంటనే అతనిమీద విక్రియ చూపించింది. మిగతావారు ఇదివరకే రాజస తామస మాలిన్యావృతములైన మనస్సులతో వుంటారు గనుక ఆ ఆలోచనలు వచ్చినా వాళ్ళకవి క్రొత్తగా తోచవు. అందుకే రాజసిక, తామసిక ఆహారాదులు తీసుకొంటే మనస్సుకూడా ఆవిధమైన భావాలతో నిండిపోతుంది. ఆహారశుద్ధివల్ల సత్వశుద్ధి జరుగుతుంది. ప్రాణం శక్తివంతమగుతుంది. యోగులు తీసుకోవలసిన పదార్థాలను చూడండి. అన్నీ సాత్వికమైనవీ, మృదువైనవీ.

**శ్లో ॥ గోధూమశాలియవషాష్టిక శోభనాన్నం**
**క్షీరాజ్యఖండనవనీతసితామధూని**
**శుంఠీపటోలకఫలాదిక పంచశాక**
**ముద్గాది దివ్యముదకం చ యమీంద్రపథ్యం.**

ఉల్లిగడ్డలు మొదలైన రాజసాహారాలు, మద్యమాంసాది తామసాహారాలు నిషిద్ధములు.

ఆహారంలోవలెనే నిత్యజీవితంలో కూడా సత్యము, అహింస, అస్తేయము, శమము, దమము మొదలైన లక్షణాలను పెంపొందించుకోవాలి. కామ విషయంలో చాల నియమబద్ధుడై ఉండాలి. ధర్మకామము తప్ప అధర్మకామమునందు దృష్టిపోనీయరాదు. రామకృష్ణ పరమహంసవలె, వివేకానందునివలె కామవిజేతలు కానక్కరలేదు. కాని అక్రమ కామసంబంధముల కాశపడరాదు. మనస్సును జాగ్రత్తగా నిగ్రహించుకోవాలి. ముఖ్యంగా మంత్రదేవతలు సౌందర్యవతులైన స్త్రీలుగా వచ్చి స్వప్న, ధ్యాన దశలలో సాధకుణ్ణి పరీక్షిస్తుంటాయి. అందువల్ల దక్షిణాచార సాధకుడెప్పుడూ మనోవాక్కాయకర్మలా పరస్త్రీ విముఖుడుగా వుండాలి. రామపుత్రుడైన కుశమహారాజుకు కలలో దివ్యాలంకార యుతయైన స్త్రీ కనిపిస్తే అతడిలా అన్నాడు.

**శ్లో ॥ కాత్వంశుభే ! కన్యపరిగ్రహోవా**
**కింవామదభ్యాగమకారణంతే**
**ఆచక్ష్వమత్వా వశినాం రఘూణాం**
**మనఃపరస్త్రీ విముఖ ప్రవృత్తిః**

ఎవరమ్మా నువ్వు ? ఎవరి భార్యవు ? నా దగ్గరికి ఎందుకు వచ్చావు? రఘువంశీయులు పరస్త్రీ విముఖులని నీకు తెలియదా !

కలలో కూడా అంతటి నిగ్రహాన్ని కలిగిఉండాలి. అప్పుడే సాత్వికదేవతలు అనుగ్రహిస్తారు.

కాగా ఇక జపదీక్ష చేసే స్థలం కూడా జాగ్రత్తగా ఎన్నుకోవాలి. ఇక్కడ ఒక విషయం శ్రద్ధగా గమనించాలి. లోకంలో ఎందరో ఇంట్లో నిత్యము శ్రద్ధతో మంత్రానుష్ఠానం చేస్తూ లక్షలు కోట్లు జపం చేసినా దేవతానుగ్రహం కలుగలేదని బాధపడుతుంటారు. దానికి కారణం వాళ్ళు జపం చేసే వాతావరణం. కలుషిత భావతరంగాలతో నిండిన ఇళ్ళలో తపస్సు త్వరగా సిద్ధించదు. అక్కడకు దేవతలను వచ్చేలా చేసే వాతావరణం నిర్మించటానికి చాలా తపస్సు వ్యయమవుతుంది. అలాకాక దేవతలుండే చోటికే మనం వెళ్ళి తపస్సు చేస్తే సిద్ధి వేగంగా లభిస్తుంది. అందువల్ల పవిత్ర దేవాలయాలలో, సిద్ధక్షేత్రాలలో దీక్ష ధరించి తపస్సు చేయాలి. ఆ వాతావరణంలో ఉండే దివ్యభావతరంగాలు మనలను దేవమయం చేస్తవి. అంతేకాక అటువంటి ప్రదేశాలలో అదృశ్యరూపాలతో సిద్ధులు సంచరిస్తూ ఉంటారు. తీవ్రసాధకులైన వ్యక్తులను చూచి వాళ్ళు దయతో ఆశీర్వదిస్తారు. అందువల్ల వేగంగా దేవతల కరుణ లభిస్తుంది.

అశుచియైన ప్రదేశము, కలుషిత భావములతో నిండిన స్థలము మనస్సు మీద అటువంటి ప్రభావాన్నే కలిగిస్తవి. ప్రాంతీయమైన ఒక కథ ఉన్నది. సీతారామలక్ష్మణులు వనవాసం చేస్తూ దండకారణ్యంలో ప్రవేశించారట. సీతారాముల సామాన్లు లక్ష్మణుడు మోస్తున్నాడు. ఒకచోటికి వచ్చేసరికి లక్ష్మణుడు మీ సామాన్లు మీరే మోసుకోండి. మీకేం నేను కూలీనా! అని సామాను రాముడికి ఇచ్చేశాడట. కొంతదూరం గడిచిన తర్వాత మళ్ళీ పశ్చాత్తాపపడి అయ్యో ఇదేమిటి ? నేనిట్లా మాట్లాడానేమిటి ? అని రాముడి కాళ్ళమీద పడి క్షమాపణ వేడాటడ. రాముడు నవ్వి "అది నీ తప్పు కాదు. ఈ వాతావరణ ప్రభావమది. ఇక్కడ స్వార్థపూరితులైన రాక్షసులు తపస్సు చేశారు. వాళ్ళ భావతరంగాలతో ఇచటి వాయుమండలమంతా నిండిఉంది. ఎవరిక్కడ ప్రవేశించినా వాళ్ళ మనస్సుల మీద అది ప్రభావం చూపుతుంది. ఆ ప్రదేశం దాటి వచ్చాము. సహజమైన నీ మనస్సు మళ్ళీ పనిచేయటము మొదలుపెట్టింది. అద్దాన్ని ధూళి కమ్మినట్లుగా నిర్మలమైన నీమనస్సుమీద ఆ వాతావరణం కొంత ప్రభావాన్ని చూపించింది" అని సమాధానపరిచాడు.

కనుక దీక్షాస్థలాన్ని ఎన్నుకోవటంలో జాగ్రత్తపడాలి. దీక్షాకాలంలో బ్రహ్మచర్యము, భూశయనము, ఏకభుక్తము వంటి పురశ్చరణ నియమాలు పాటించాలి. వీటితోపాటు మౌనవ్రతం ధరించాలి. మౌనమంటే కేవలం మాట్లాడకపోవటమేకాదు. మానసికంగా ఆలోచనలు తగ్గించి క్రమంగా ఆలోచనారహితమైన దశకు చేరుకోవాలి. అంతేకాని ఇవాళ మౌనం కనుక మాట్లాడనంటూ పలకమీదనో, కాగితాలమీదనో అవతలివాళ్ళ ప్రశ్నలకు జవాబు వ్రాయటం మౌనం కాజాలదు. మౌనం మనస్సుకు సంబంధించినదనే అంశం గుర్తుంచుకోవాలి.

అదేవిధంగా పూజాద్రవ్యాలు, హోమవస్తువులు వృక్షలతాజన్యములు మాత్రమే అయి ఉండాలి.

ఇక మంత్రస్వీకారంలో కూడా వేదమంత్రం బంగారు వంటిదని, తాంత్రికమంత్రములు వెండివంటిదని మేరుతంత్రం వర్ణిస్తుంది. అయితే వేదమంత్రానికి స్వరంప్రధానం. వేదాధ్యయనం అంతగాలేని అధునాతన కాలంలో తంత్రశాస్త్రోక్త మంత్రాలను ఆశ్రయింపక తప్పదు. ఇదంతా శౌచప్రధానమైన దక్షిణాచారం.

# దీక్షలు - పరీక్షలు

జపదీక్షలు, తపోదీక్షలు తీవ్రంగా చేస్తూ కామ్యసిద్ధి కోసం సాధనచేసే వ్యక్తులు ఒక దశలో ఇంచుమించు తప్పనిసరిగా కఠినపరీక్షలకు నిలబడవలసి ఉంటుంది. ముఖ్యముగా పురాణాలలో ఇటువంటివి తరచుగా చదువుతాము. ఏ ఋషియైనా,రాక్షసుడైనా తపస్సు తీవ్రంగా చేయటం మొదలుపెట్టగానే త్రిలోకాధిపతియైన ఇంద్రుడు సహించడు. వెంటనే ఆ తపస్సు భగ్నం చేయటానికి ఏ రంభనో తిలోత్తమనో మేనకనో పంపిస్తాడు. వాళ్ళ కామవిలాసాలకు లొంగి తపోభ్రష్టుడైనాడా సరే ! లేదా వజ్రపాణి స్వయంగానే తపోభంగం చేయటానికి బయలుదేరుతాడు. ఈ కథలు చదువుతున్నా వింటున్నా ఇంద్రుడంటే చాలా చులకన భావం కలుగుతుంది. ఇతగాడికి తన పదవికి ఎప్పుడు ఎవరి వల్ల భంగం కలుగుతుందో అని అందరి తపస్సులూ పాడుచేయటం తప్పవేరేపని లేదా అని అనిపిస్తుంది.

కాని దాని అంతర్నిహిత సత్యం వేరే ఉంది. ఇంద్రుడు త్రిలోకాధిపతి. మానవులలో తీవ్రమైన తపస్సుచేసిన వాళ్ళలో కొందరు ఇంద్రపదవి పొందుతారు. మన లోకంలో ముఖ్యమంత్రులు, ప్రధానమంత్రులు, దేశాధ్యక్షులు ఎలాంటివారో ఊర్ధ్వలోకాలలో లోకపాలకులు, దిక్పాలకులు అటువంటివారు. భూలోక, భువర్లోక, సువర్లోకాలు మూడింటికి పరిపాలకుడు ఇంద్రుడు. ఇప్పుడు పురందరుడనేవాడు ఈ మన్వంతరంలో ఇంద్రుడు. రాబోయే మన్వంతరాలలో బలిచక్రవర్తి విష్ణువరంవల్ల, హరిశ్చంద్రుడు విశ్వామిత్రునివల్ల ఇంద్రులు కాబోతున్నారు.

ఈ పదవిలో ఉన్నవాడు తనక్రింద ఉన్న మూడులోకాలలో సర్వజీవుల కార్యకలాపాలను పర్యవేక్షిస్తుంటాడు. ఈ లోకంలో ఎవడో ఒకడు తపస్సుచేయటం మొదలుపెట్టా డనుకొందాము. కొద్దిపాటిదయితే ఇంద్రుడు జోక్యం చేసుకోడు. కాని కఠోర తపస్సు చేస్తుంటే మాత్రం ఒక చూపు చూస్తాడు. ఆ సాధకుని దగ్గరకు ఒక అప్సరసను పంపిస్తాడు. అది తన సౌందర్య సమ్మోహన శక్తితో అతణ్ణి వశంచేసుకొని తపస్సు ఆపిస్తుంది. ఆమెతో క్రీడల్లో అంతకుముందు వచ్చిన తపశ్శక్తి పోగొట్టుకొంటాడు. కొన్నాళ్ళుండి ఆమె వెళ్ళిపోతుంది. ఎందరో తపస్వులు అలా కామమోహితులై భ్రష్టులైన వాళ్ళున్నారు.

విశ్వామిత్రుడి జీవితం చూడండి. బ్రహ్మర్షిత్వం కోసం తపస్సు చేస్తుంటే ఇంద్రుడు మేనకను పంపించినాడు. ఆమెకు లొంగిపోయి కామక్రీడల్లో మునిగాడు. ఆమె ఇవాళ హిమాలయ సానువులలో విహరిద్దామనేది. మర్నాడు గంధమాదన పర్వతంమీద క్రీడిద్దామనేది. ఆవిడను సంతోషపెట్టటం కోసం ఆమెతో కలసి అక్కడికి వెళ్ళేవాడు. ఆమె అప్సరస గనుక సహజంగా ఆకాశగమనాది శక్తులు కలది. విశ్వామిత్రుడు మానవుడు. పైకి ఎగరాలంటే తపస్సు ఖర్చుపెట్టాలి. పెట్టాడు. ఆమెకోసం అపూర్వవస్తువులు సృష్టించాడు. కొన్నాళ్ళు గడిచింది. ఒకనాడు ఆవిడ ఏ గగన గంగా తరంగాలలోనో హిమాచల సానువులలోనో విలాసంగా తిరిగివద్దాము రమ్మన్నది. సరే అన్నాడు గాథేయుడు. ఆమెతో చెట్టాపట్టాలేసుకొని పైకెగబోయినాడు మేనక పైకి లేచింది. విశ్వామిత్రుడు లేవలేదు. రండీ అన్నది మేనక. రాలేకపోతున్నాను. శరీరంపైకి లేవటం లేదన్నాడతడు. అయితే నేను వెళుతున్నాను. వచ్చిన పనిపూర్తి అయింది అని వెళ్ళిపోయింది అప్సరస. ఒక్కసారి వెనక్కి తిరిగిచూచుకొన్నాడు ఋషి. తపశ్శక్తి అంతా ఖర్చయిపోయింది. ఇన్నాళ్ళూ బూటకపు ప్రేమను వెళ్ళబోసి మోసగించిందే శపిద్దాము మేనకను అని కూడా అనుకొన్నాడు. కాని శపించే శక్తి ఉంటే ఆమెతో వైహాయస విహారం చేసేవాడేగదా !

మళ్ళా క్రిందటిసారిలానే వెయ్యేండ్లు తపస్సు చేశాడు. ఈసారి ఇంద్రుడు రంభను వెళ్ళమన్నాడు. ఆమె వద్దని చెప్పిచూచింది. ఒకసారి కామానికి లొంగి తను పతనమైనానని తెలుసుకున్నాడు. ఈసారి లొంగడు. ఉగ్రకోపనుడై వసిష్ఠునంతవానిని అపత్యశోక సముద్రంలో ముంచిన అవారిత సత్వు డతడు. ఆయనకు అలుకవస్తే మూడులోకాలు గిరగిర తిరుగుతవి. నన్ను పంపవద్దు అని రంభ విజ్ఞప్తి చేసుకొంది. కానీ ఇంద్రుడు వినలేదు. పోయి తీరాలని ఆజ్ఞాపించాడు. ఏం చేస్తుంది. ఆమెదీ ఉద్యోగమే. సేవాధర్మం. వెళ్ళింది. హావభావ ప్రదర్శన చేసింది. విశ్వామిత్రుడికి కోపం వచ్చింది. ఇంక వీళ్ళకిదే పనా అనుకొన్నాడు. వెయ్యేండ్లు పాషాణంగా ఉండమని రంభను శపించాడు. ఇంద్రుని పని నెరవేరింది. రంభను అంతకాలం రాయిలా ఉంచాలంటే ఋషియొక్క వెయ్యేండ్ల తపస్సూ వ్యయమైంది. క్రిందటిసారి తపశ్శక్తితో మేనకతో సుఖమన్నా పొందాడు. ఈసారి అదీ లేదు. పొరపాటు తెలుసుకున్నాడు. ఇకపైన కామక్రోధాలకే కాదు. అరిషడ్వర్గంలో దేనికీ లొంగకూడదని ప్రతిజ్ఞ చేసుకొని బ్రహ్మర్షిత్వం సాధించాడు.

ఇంద్రుడీ పనులు చేయటం దేనికీ అని ప్రశ్నించవచ్చు. అతడు లోకేశ్వరుడు. తన పాలనలోనే ఒకడు ఘోరతపస్సు చేస్తే వా డెటువంటివాడో పరీక్షించవలసిన బాధ్యత అతడిమీద ఉంది. తపస్సు చేస్తే వరాలివ్వక తప్పదు. తపస్సు వల్ల ఒకనికి లోకవశీకరణ సామర్థ్యము, లోకశిక్షణ శక్తిరావచ్చు. దానితో అతడు లోకంలోని సౌందర్యవతులైన స్త్రీలంతా తనకే కావాలని కోరుకోవచ్చు. ప్రపంచాన్ని అతడు జయించి తన వశం చేసుకోవాలని కోరవచ్చు. వాడు సిద్ధుడై వరాలు పొందిన తర్వాత వాడిని ఏమైనా చేయాలంటే చాలా కష్టం. అందువల్ల లోకాలలో అవ్యవస్థ ఏర్పడకుండా ఉండటంకోసం ఇంద్రుడు ముందే వానికి కామక్రోధాలలో పరీక్ష పెడతాడు. వాడు లొంగిపోయాడా తపోభ్రష్టుడవుతాడు. వానివల్ల ప్రమాదం రాదు. లొంగడా అప్పుడూ ఇబ్బందిలేదు. కామక్రోధాలను జయించిన జితేంద్రియునివల్ల ఏ చిక్కూరాదు.

అయితే రాక్షసుల కీ రహస్యం తెలుసు. వాళ్ళు పరమ కాముకులు. అతి కోపనులు. కాని తపోవేళ మాత్రం జాగ్రత్తగా జితేంద్రియులై ఏ ప్రలోభాలకు లొంగక వరములు సాధించేవారు. తరువాత లోకాలను బాధించేవారు.

ఇంద్రుడు ఎందుకిలా చేసేవాడు అన్నదాని వివరణ యిది. తాంత్రిక సాధనల్లో కూడా ఈ పరీక్షలు తప్పవు. దక్షిణాచారమార్గంలో శుచియై, నిరాహారుడై, సాత్విక తపస్సు చేసేవ్యక్తి ఇంద్రియజయాన్ని సాధిస్తూ పురోగమిస్తుంటాడు. దేవతలు తొందరగా అతని జోలికిరారు. కాని మంత్రతంత్ర తీవ్రసాధనలు చేసేవాళ్ళకు సిద్ధి ప్రసాదించే ముందు మంత్రదేవతలు చాలా కష్టమైన పరీక్షలకు గురిచేస్తారు. వికృతాకారములతో పిశాచాలు అట్టహాసాలు చేస్తూ సాధకుణ్ణి భయపెడతవి. ఏమాత్రం భయపడినా పిచ్చెక్కటమో, మరణమో జరుగుతుంది.

మేరుతంత్రంలో ఇవ్వబడిన ఒక మంత్రసాధన చూడండి. గణపతులలో కలిప్రియుడనే దేవత. అతని యోగిని పేరు బృహత్కుక్షి. ఆమె ఘుటికాసిద్ధిప్రదాయిని. ఆవిడ చెలికత్తె నినాదిని. ఊర్ధ్వకేశి, త్రిలోచన, ఖేచరి, చంచలాక్షి, మహానాద అయిన ఆ శక్తిని సాధించాలంటే అమావాస్యనాడు సాయంకాలం నదిలో స్నానంచేసి ఒడ్డునే కూర్చొని అర్ధరాత్రి జపం చేయాలి. కస్తూరీ, కమలములతో హోమం చేయాలి. అప్పుడావిడ బయలుదేరుతుంది.

శ్లో ॥ మహాశబ్దం ప్రకురుతే భీతిదం ధ్యానతత్పరః
నబిభేతియదామంత్రీ తదాదేవీ ప్రసీదతి.

ఆమె చేసే భీషణశబ్దాలకు కంపితుడు కాకుండా ధ్యానతత్పరుడై నిశ్చల మనస్సుతో ఉంటే త్రిలోక గమన క్షమమైన ఘుటికనిస్తుంది.

సర్వసాధనాలకు ఏకాంతం ప్రధానం. ఒంటరిగా అడవిలో, శ్మశానంలో, కొండగుహలలో కూర్చుని సాధనలు చేసే సమయంలో ఈ భయంకర పరీక్షలకు నిలవవలసి ఉంటుంది. అందులోనూ రాజస, తామస దేవతలు సాహసుడు, ధీరుడు, నిశ్చలుడు అయిన వానికి గాని వశంకావు.

భూతప్రేత పిశాచగణాలు ఎవనికిబడితే వానికి కొద్దిపాటి జపం చేయగానే వశం కావటానికి ఇష్టపడవు. అటువంటి గణములకు నాయకులైన భైరవ, బేతాళాదులు సాధకునికి లక్షపరీక్షలు పెట్టిగాని వశంకారు. కాళీ, తారా, ఛిన్నమస్తా, భైరవీత్యాది దేవతలైనా అంతే. ఆ మహాశక్తులను వశం చేసుకోగలిగాడా ఇంక వాడికి లోకంలో ఎదురులేదు. అయితే వాటిని సాధించిన వారికంటే సాధనలలో పతనమైనవారు, ఉన్మాదులైనవారు, మృతులైనవారు ఎక్కువమంది. అందుకే పెద్దలు వాటి జోలికిపోవద్దని హెచ్చరిస్తారు. ఎవరో రామకృష్ణ పరమహంసవంటి, రామ్‌ప్రసాద్ వంటివారు శ్మశానాలలో, కపాలాసనాలమీద కూర్చుని కృష్ణపక్ష నిశీధులలో నిర్భయులై అన్నిపరీక్షలకు నిలచి సిద్ధులు సాధించారు. ఆ పరీక్షలకు నిలబడగల ధైర్యంలేనివారు ప్రశాంత సాత్విక మార్గాన్ని ఎన్నుకొని నెమ్మదిగా పురోగమించవచ్చు.

# వామాచారము - కౌలము

కౌళికులు ప్రసిద్ధంగా ఉదహరించే ఒక శ్లోకం చూడండి :

శ్లో ॥ సర్వేభ్య శ్చోత్తమా వేదా వేదేభ్యో వైష్ణవం పరం
వైష్ణవా దుత్తమం శైవం శైవా ద్దక్షిణ ముత్తమం
దక్షిణా దుత్తమం వామం వామా త్సిద్ధాంత ముత్తమం
సిద్ధాంతా దుత్తమం కౌలం కౌలా త్పరతరం నహి

అన్నింటికంటే వేదమార్గము శ్రేష్ఠము. దానికంటే వైష్ణవం గొప్పది. వైష్ణవంకంటే శైవం, శైవం కంటే దక్షిణం, దక్షిణం కంటే వామం, వామం కంటే సిద్ధాంతం, సిద్ధాంతం కంటే కౌలం గొప్పవి. కౌలం కంటే ఉత్తమమైనది మరొకటిలేదు.

ఈ శ్లోకాల వంటివి కౌలగ్రంథాలలోచాలా కనిపిస్తవి. అంతమాత్రం చేత వీటినన్నిటినీ పరమ ప్రమాణంగా స్వీకరించవలసిన అవసరమేలేదు. అయితే ఆయా మార్గముల స్వరూపాన్ని పరిశీలించటానికి ఈ వివిధ భావనలు మన కుపయోగపడతవి.

వామాచారంలో చీన, సిద్ధాంత, శాబర, కౌలమార్గాలున్నట్లు ఇంతకుముందే చెప్పబడింది. ప్రాంత భేదాలనుబట్టి సంప్రదాయాలలో కొద్దిపాటి విభేదాలనుబట్టి ఈ అవాంతర భేదాలేర్పడినవి. అన్నిటిలోను పంచమకారాలకు ప్రాధాన్యం వినియోగం ఉంది. తరతమ భేదాలలో, సాధకుల స్థాయికూడ వాటి ఉపయోగపద్ధతిమీద ఆధారపడి ఉంటుంది. ఇవి లేకుండా వామాచారంలో మంత్రసిద్ధి లభించదని కౌళావళీ నిర్ణయంవంటి గ్రంథాలు ఘంటాఘోషంగా చెపుతున్నవి.

శ్లో ॥ మద్యం మాంసం తథా మత్స్యం ముద్రా మైథున మేవచ
మకార పంచకం చైవ దేవతా ప్రీతికారకం.

మద్యము, మాంసము, మత్స్యము,ముద్ర, మైథునము ఇవి అయిదు పంచమకారములు.

శ్లో ॥ కేవలే నాద్య యోగేన సాధకో భైరవో భవేత్
ద్వితీయేనచ తత్వేన పూజకో బ్రహ్మరూపభాక్

కేవలేన తృతీయేన మహాభైరవతాం వ్రజేత్
చతుర్థేనతు తత్వేన భువి పూజకనాయకః
పరేణ పరతాంయాతి శివతుల్యస్ససాధకః
పంచమేనతు వీరేంద్రః సర్వపాపైః ప్రముచ్యతే.

మొదటిదైన మద్యాన్ని మాత్రమే ఉపయోగించే సాధకుడు భైరవత్వాన్ని పొందుతాడు. రెండవదైన మాంసంకూడా ఉపయోగించి సాధనచేస్తే బ్రహ్మరూపుడవుతాడు. మూడవదైన చేపల నుపయోగిస్తే మహాభైరవుడవుతాడు. నాల్గవదైన ముద్రలుపయోగించి సాధనచేస్తే శివతుల్యు డవుతాడు. ఐదవదైన మైధునంవల్ల సర్వపాపముల నుండి విముక్తుడై వీరేంద్రుడవుతాడు.

ఇక్కడ వీరశబ్దానికి ప్రత్యేకార్థం ఉంది. దేవతను తానే అన్న భావంతో అంటే అద్వైత స్థితితో ఆరాధించటం దివ్యభావ మార్గం. దేవతను తల్లిగానో, మహారాజ్ఞిగానో, ఏ ఇతర భావంతోనో పూజించటం పశుభావం. దేవత తన ప్రియురాలిగా భావించి ఆరాధించే మార్గం వీరభావమార్గం. వామాచారులు వీరమార్గానికి ప్రాధాన్యము ఇస్తారు.

శ్లో॥ అఖిలషిత పరస్త్రీ యోగపూజాపరోహం
బహువిధ జన భావారంభ సంభావితోహం
పశుజన విముఖోహం భైరవీ సంయుతోహం
గురుచరణ పరోహం భైరవోహం శివోహం

నేను పరస్త్రీ యోగ పూజాపరుణ్ణి, పశుజన విముఖుణ్ణి, భైరవీ సంయుతుడనైన భైరవుణ్ణి, శివుణ్ణి అని దివ్య, వీరభావాలతో వామాచారులు సాధన చేస్తుంటారు.

ఈవిధంగా మకార పంచకంతో చేస్తేనే తప్ప మంత్రసిద్ధి కలగదని కులతంత్రాలు చెపుతున్నవి.

శ్లో ॥ వినా పంచోపచారంహి దేవీపూజా కరోతియః
యోగినీనాంభవేద్భక్ష్యః పాపంచైవ పదేపదే
వినా మాంసేన మద్యేన పుంశ్చలీ సేవనం వినా
న మంత్రసిద్ధి మాప్నోతి తస్మా ద్యత్న పరోభవేత్.

పంచమకారాలు లేకుండా పూజచేస్తే వాణ్ణి యోగినులు తింటారు. అంతేకాక అది మహాపాపం - మాంసము, మద్యము, పుంశ్చలీ మైధునము లేకుండా మంత్రము సిద్ధించదు. అందుచేత ప్రయత్నంచేసి వాటిని సాధించాలి. దేవీపూజ కవి ప్రధానం.

**శ్లో ॥ తస్మా ద్భుక్త్వా చ పీత్వాచ పూజయే త్పరమేశ్వరీం**
**సత్య మే త ద్విజానీయాత్ వాక్యం శంకరభాషితం.**

కనుక మత్స్యమాంసములు భుజించి, మద్యంత్రాగి పరమేశ్వరుని పూజించాలి. ఇది శంకరుని మాట సుమా ! పరమ సత్యమైనది.

**శ్లో ॥ నభుక్త్వా చనపీత్వాచ నస్మరే న్నజపే త్సదా**
**యే స్మరంతి నరా మూఢా స్తేషాం దుఃఖం పదేపదే**
**ఆనందేన వినాయస్తు చండికాం పరిపూజయేత్**
**రోగీ దుఃఖీభవేత్సోపి మృతేచ నరకం వ్రజేత్.**

తినకుండా (మాంసాదులు), త్రాగకుండా (మద్యము)ఎవడు చండికను జపిస్తాడో వాడు మూఢుడు, అడుగడునా దుఃఖం పొందుతాడు. ఆనందం లేకుండా చండీపూజ చేస్తే రోగి, దుఃఖికావటమేకాక, చచ్చిన తర్వాత నరకానికి పోతాడు. ఆనందమంటే యేమిటో కూడా నిర్వచించబడింది. మనుచరిత్రలో కామసుఖ మహత్వాన్ని వర్ణిస్తూ వరూధిని ప్రవరునితో ఇలా అంది.

**ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్**
**జెందున్ కుంభగతప్రదీపకళికా శ్రీదోప నెందెందు బో**
**కెందే నింద్రియముల్ సుఖంబుగను నా యింపే పరబ్రహ్మ మా**
**నందో బ్రహ్మ యటన్న ప్రాజదువు నంతర్బుద్ధి నూహింపుమా"**

కుండలోని దీపంలాగా మనస్సు కదలకుండా ఎక్కడ పారవశ్యమును చెందుతుందో నిశ్చలములై ఇంద్రియము లెక్కడ సుఖాన్ని పొందుతవో ఆ యింపే పరబ్రహ్మము సుమా. "ఆనందో బ్రహ్మ" యన్న వేదవచనాని కర్థమిదే సుమా ! ఆ అప్సరస ఆ వేదమంత్రానికి కామపరంగా వ్యాఖ్యానం చేస్తే కౌళికులు మద్యపాన పరంగా చేశారు చూడండి.

**శ్లో ॥ ఆనందం బ్రహ్మణోరూపం తచ్చదేహే వ్యవస్థితం**
**తస్యాభివ్యంజకం మద్యం యోగిభిస్తేన పీయతే.**

బ్రహ్మరూపము ఆనందము. అది దేహమున నున్నది. దాని అభివ్యంజకము మద్యము. అందుచేత యోగులు మద్యపానము చేయుదురు.

కొందరు మద్యస్థానమున సంవిత్ (గంజాయి) పానము గావింతురు.

**"సంవిదాసవయోర్మధ్యే సంవిదేవ గరీయసీ"** అని కొందరి అభిప్రాయము. మద్యపానము కంటే గంజాయి పీల్చుట లేక భంగు త్రాగుట శ్రేష్ఠమని కొందరు యోగుల విశ్వాసము. దానికొక కారణము వారు చెప్పుదురు. మద్యపానములో నొక ప్రధాన లక్షణమున్నది. మనస్సు కేకాగ్రతనిస్తుంది. ఏ పని మొదలుపెడితే ఆ పనిమీదే ధోరణి. మంచి పారవశ్యాన్నిస్తుంది. గంజాయికి వీటన్నింటిని చేయటమేకాక మనస్సును ఊర్ధ్వభూమికలకు తీసుకువెళ్ళే లక్షణం ఉంది. శరీరంనించి మనస్సును-మనస్సు ననగూడదు. సూక్ష్మదేహాన్ని విడదీసే శక్తి ఆ మూలికకుంది. అందుకే ఇటీవలి కాలంలో పారవశ్యానికేకాక, కోరిన అనుభూతుల ప్రపంచములో విహరించటానికి గంజాయి మూలద్రవ్యంగా గల రకరకాల మందులు ప్రపంచంలో బయలుదేరినవి. వాటిని సేవిస్తే కొద్దిక్షణాలు మానవుడు ఊహావైహాయస వీధుల్లో విహరిస్తాడు. రంభాసంభోగం కావాలనుకొంటే మరుక్షణం వాడి మనోనేత్రం ముందు రంభ ప్రత్యక్షమై కోరిన కోర్కె దీరుస్తుంది. ఆ ఊహా సుఖాలకోసం ఈనాడు ప్రపంచంలో ఈ మందులు సేవించటం ఎక్కువైంది. అవి విషాలైనా, శరీరాలను నాశనం చేస్తున్నా వాటికి బానిసలైపోతున్నారు. వెనక మఠాలలో గంజాయి త్రాగే గోసాయీలు ఎక్కడో ఉండేవారు. ఇవాళ అమెరికన్ నాగరికత ప్రభావంవల్ల హిప్పీయిజం వచ్చి ఎక్కడ చూచినా హషీష్ మొదలైన గంజాయి మందులు వాడేవాళ్ళే. విశ్వవిద్యాలయాలలో విశృంఖలంగా యువతీయువకులు వీటితో హరించుకుపోతున్నారు. మద్యపానమే ప్రమాదకరమనుకుంటే అంతకంటే భయంకరోపద్రవకరమైన దిది.

సరే ! తాంత్రిక ప్రక్రియలలో ఏకాగ్రతనూ, దర్శనానుభూతులను త్వరగా సాధించటానికి వీటిని ఉపయోగించేవాళ్ళు. గంజాయి గాని మద్యంగాని సేవించి జపం, ధ్యానం చేయటానికి కూర్చుంటే కదలకుండా, ఒళ్ళునొప్పులు తెలియకుండా గంటల తరబడి దేవీమయమైన మనస్సుతో నిశ్చలంగా భావసమాధిలో ఉండటానికి వీలుకలుగుతుంది.

# మద్యపానము - అర్చనలు

సదాచార నిషిద్ధములు, సంప్రదాయ విరుద్ధములు అయిన యీ వామాచార పూజావిధానంవల్ల జీవుడుత్తమగతిని చేరుకో జాలడని లేకుంటే తాత్కాలికములు, వ్యామోహకరములు అయిన సిద్ధులు కొన్నిరావచ్చునని మంత్రశాస్త్రవేత్తల అభిప్రాయము. కేవలం శాస్త్రదృష్టితోను, పరిశోధనాత్మకమైన దృక్పథంతోను మాత్రమే యీ విషయాలు కొన్ని ఇక్కడ ఇవ్వబడుతున్నవి గాని ఈ పద్ధతులు ప్రచారంచేయటం ఉద్దేశ్యం ఎంతమాత్రంకాదు.

దేవతార్చనలో వామాచారంలో పంచమకారా లుపయోగిస్తారని అనుకొన్నాము గదా ! వాటిలో మొదటిది మద్యం ఎలాంటిది కావాలో ప్రయోజనాన్నిబట్టి నిర్ణయించాలని జ్ఞానానందగిరి అనే తాంత్రికు డిలా చెప్పుతున్నాడు.

శ్లో ॥ గౌడీపిష్టకజాత తాలతరుజాద్రాక్షీ చ మాధ్వీ తథా
ఖర్జూరీ నవనారికేల తరుజా గౌడీచ భోగ ప్రదా
పైష్టీసిద్ధికరీ విపక్షదళనీ తాళీ చ ద్రాక్షీ శుభా
అన్యా యావిహితా సదాశుభకరీ మోక్షప్రదా సప్తికా.

ఈశ్లోకంలో మద్యంలోని ఏడురకాలు వాటి ప్రయోజనాలు చెప్పబడ్డవి. ఈనాటి పరిభాషలో విస్కీ బ్రాందీ మొదలైన యే జాతి పానీయాలతో ఏవి సరిపోలుతవో వాటిలోని పదార్థాలనుబట్టి పరిశీలించి నిర్ణయించవచ్చు. ఎన్నోరకాలు ప్రాచీనాధునాతన కాలాలలో ప్రసిద్ధికెక్కి ఉన్నవి.

మద్య మాంస బలులతో దేవతాపూజ పూర్తి చేసిన తర్వాత ఉత్తములైన దేవతాభక్తులతో కలసి కులామృత పానం చెయ్యాలని కౌళావళీ నిర్ణయంలోని ఎనిమిదవ ఉల్లాసంలో చెప్పబడింది.

శ్లో ॥ సర్వధర్మాధికో లోకే కులధర్మః శివోదితః
ఇతియే నిశ్చితధియః ప్రోక్తస్తే కౌలికోత్తమాః
యోభవేత్ కులతత్వజ్ఞః కులశాస్త్ర విశారదః
కులార్చనరతః పుంసాం కౌలికస్సోధిక స్సదా
పంచతత్వ స్వీకరణాత్ మూల మంత్రార్థ తత్వవిత్
దేవతాగురు భక్తశ్చేత్ కౌలికః స్యాచ్ఛదీక్షయా.

సర్వధర్మములలో కులధర్మమే గొప్పదని, శివోదితమైనదని, నిశిత బుద్ధిగలవాడు కౌలికోత్తముడు. కులతత్వజ్ఞుడై, కులశాస్త్ర విశారదుడై, కులార్చనరతుడై, పంచతత్వములను స్వీకరించి, మూలమంత్రార్థతత్వము నెరిగి దేవతా గురు భక్తుడైన కులదీక్షాపరుడు సర్వోత్తముడని దీని అభిప్రాయము.

ఆవిధంగా కౌళికులైన వారిని తీసుకొని వచ్చి ముందు వారిలో స్త్రీకి సమర్పించి తరువాత మిగతావారు త్రాగాలట ! ఆ స్త్రీకి శక్తి అని ఇక్కడ పరిభాష.

శ్లో ॥ అథకౌలాన్ సమానీయ శక్తీశ్చైవ విశేషతః
స్వశక్తిం వీరశక్తింవా దీక్షితాంగృహిణీమథ
పాయయిత్వా పిబేద్ద్రవ్య మితి శాస్త్రస్య నిర్ణయం

కులామృతపాన వివరాలు ఇంకా చాలా చిత్రంగా ఉన్నవి.

శ్లో ॥ పూజాస్థానే ప్రయత్నేన ఆసనాని ప్రకల్పయేత్
తతః కౌలాః స్త్రియస్సర్వాః ప్రక్షాళ్య పాణి పాదకం
ప్రణమ్య ప్రవిశేచ్చక్రం ముద్రాభిః పంచసంజ్ఞికైః
స్త్రీణా మన్యతమం స్థానం పుంసా మన్యతమం పృథక్
అథవా మిథునం కృత్వా క్రమాత్ సముపవేశయేత్
పంక్త్యా కారేణవా సమ్యక్ చక్రాకారేణవాథవా.

పూజాస్థానంలో అందరికి చక్కగా ఆసనాలు వేయాలి. కౌలికులు పురుషులు స్త్రీలు కాళ్ళూ చేతులు కడుక్కొని కులచక్రానికి నమస్కారంచేసి అందులోకి ప్రవేశించాలి. కూర్చుండేటప్పుడు పురుషుని ప్రక్కన స్త్రీ, స్త్రీ పక్కన పురుషుడు ఉండేలా వరుసల్లో గాని గుండ్రంగా కాని కూర్చోవాలి.

చక్రమధ్యంలో జాతిభేదంగాని, వర్ణభేదంగాని పాటించరాదు. అలా ఎవరైనా పాటిస్తే అంటే నా పక్కన తక్కువ కులంవాడు కూచున్నాడే - అని ఎవడైనా అనుకుంటే వాడ్ని యోగినీగణం భక్షిస్తుందిట !

భైరవీచక్రంలో వున్నంతసేపు అందరూ ద్విజులే. కులార్ణవ, భైరవీ చక్రపూజ అయిపోయి బయటికి వెళ్ళిన తర్వాత ఎవని వర్ణం వానిదే. అసలీ రహస్యమార్గంలో ప్రవేశించినవారే నిజమైన విప్రులని, దేవతలనీ కులగ్రంథాలు కొనియాడుతున్నవి. వేదములో మాత్రం సర్వం బ్రహ్మమని చెప్పలేదా !

శ్లో ॥ స్వర్గాది పుణ్యలోకేషు దేవా దన్యో యథా నహి
తథైవ చక్రమధ్యేతు దేవా స్సర్వే హి మానవాః

స్వర్గాది పుణ్యలోకాలలో దేవతలు తప్ప ఇతరులుండనట్టే చక్రమధ్యంలో కూడా అంతే. మానవులంతా దేవతలే. సందేహంలేదు.

శ్లో ॥ బహునాత్రకిముక్తేన చక్రమధ్యేతు సాధకాః
పురుషా శ్శివరూపాశ్చ దేవీరూపాః స్త్రియస్సదా

ఇన్ని మాటలుదేనికి ? భైరవీచక్రంలో పురుషులంతా శివరూపులు. స్త్రీలంతా దేవీరూపిణులు. అందువల్ల వాళ్ళను జ్యేష్ఠానుక్రమంగా గంధాదులతో అనులేపనం చేసి పుష్పమాలలతో అలంకరించి పాత్రలను అందించాలి.

శ్లో ॥ పాత్రంబ్రహ్మ సురావిష్ణుః రసాదోరుద్ర ఏవచ
ఆనందః శేఖరఃప్రోక్తః ఆనందస్తు సదాశివః
మద్యంతు భైరవో దేవో మదః శక్తి స్సమీరితా
అహో భుక్తంచ మద్యంహి మోహయేత్ త్రిదశానపి
సురాశక్తిఃశివోమాంసం తద్భోక్తా భైరవస్స్వయం
తయోరైక్య సముత్పన్నం ఆనందం మోక్ష ఉచ్యతే

పాత్ర బ్రహ్మ, కల్లు విష్ణువు, త్రాగువాడు రుద్రుడు. ఆనందమే తురీయమైన సదాశివస్థితి. సారాయి భైరవుడు, మదము శక్తి. అందుచేత మద్యపానం వల్ల దేవతలను కూడా మోహింపజేయవచ్చు. మరొక ఉపమానంలో సుర శక్తి, శివుడు మాంసము, భుజించువాడు భైరవుడు. వీని ఐక్యమువల్ల ఆనందం పుడుతుంది. అదే మోక్షము అని చెప్పబడింది.

ఈ పానప్రక్రియ యెంతసేపు కొనసాగాలంటే త్రాగిపడిపోయి, లేచి మళ్ళీ త్రాగి పూర్ణానందపరవశుడయ్యేదాకా త్రాగుతూనే ఉండాలిట.

శ్లో ॥ పీత్వాపీత్వా పునః పీత్వా పతిత్వాచ మహీతలే
ఉత్థాయచ పునః పీత్వా పునర్జన్మ నవిద్యతే

కులార్ణవతంత్రంలోని యీ శ్లోకాన్నిబట్టి అలా త్రాగగా త్రాగగా ఇక పునర్జన్మ ఉండదట !

మళ్ళీ జన్మసంగతి దేవుడెరుగు. అంత త్రాగితే ఈజన్మ మాత్రం త్వరలో ముగుస్తుంది.

శ్లో ॥ యావన్నచలతేదృష్టిః యావన్నచలతేమనః
తావత్పానం ప్రకుర్వీత ... అని కౌళావళీ నిర్ణయకారుడు దృష్టి, మనస్సు చలించనిస్థితి వచ్చినదాకా త్రాగమంటాడు.

బెంగాల్‌లో రామకృష్ణపరమహంస కంటే కొంచెం ముందువాడు, మహాకవి, గాయకశ్రేష్ఠుడు - రామప్రసాద్ - పన్నెండు సంవత్సరాలు నిరంతరం మద్యపానం చేసి పంచకపాలాసనం మీద కూర్చుండి తపస్సు చేసి కాళీసాక్షాత్కారం పొందాడు. అటువంటి మహానుభావులు ఎక్కడో కోటికొకరు. మిగిలినవారికి త్రాగుడుమాత్రమే మిగులుతుంది.

మనుస్మృతి ప్రకారం సురాపానం మహాపాపం. దానికి ప్రాయశ్చిత్తం ఎర్రగా కాచిన సురను త్రాగమన్నాడు. దానివల్ల శరీరం కాలిపోతే అప్పుడే పాపవిముక్తి అని ఆయన నిర్ణయం.

**శ్లో ॥ సురాంపీత్వా ద్విజోమోహా దగ్ని వర్ణాం సురాం పిబేత్**
**తయా సకాయే సందగ్ధే ముచ్యతే కిల్బిషా త్తతః**

ఇంకా రకరకాల ప్రాయశ్చిత్తాలు చెప్పబడినవనుకోండి. అయితే ఇవి ద్విజులకే.

**"బ్రాహ్మణో మదిరాం పీత్వా బ్రాహ్మణత్వాత్ - విముచ్యతే"**

బ్రాహ్మణుడు మదిరాపానం చేస్తే బ్రాహ్మణత్వం పోతుంది. ఇది ప్రధానమైన అంశం.

ఇది కౌలికులకు తెలుసు. వారంటారు అజ్ఞానంవల్లగాని, మోహం వల్లగాని త్రాగితే గదా మనుస్మృతిలోని శిక్షలు ! తెలిసి త్రాగుతున్నాము గనుక తప్పులేదు, ఇది కులశాస్త్రమతం అని వారి వాదం, ఇదుగో !

**"పూర్ణాభిషేక యుక్తానాం పాన మత్యంతమిష్యతే" అట !**

భారతంలో శుక్రాచార్యులు సురాపానాన్ని పాతకంగా శపించాడు. తంత్రగ్రంథాలలో ఆ శాపాన్ని గుర్తిస్తూ, శుక్రశాప విమోచక మంత్రము లిచ్చారు. అంటే ఆ మంత్రంతో అభిమంత్రించి సురాపానం చేస్తే దోషం అంటదట ! ఇవన్నీ తప్పులు కప్పిపుచ్చుకోటానికి చెప్పిన కృత్రిమ ప్రమాణాలు.

# చక్రార్చనము - స్వేచ్ఛాకామము

ఇంతకుముందు మద్యపాన విధానం చెప్పబడింది. దేవతకు నివేదితమైతే అది కులామృతమవుతుంది. అలానే పూజాసమయంలో వామాచారంలో మత్స్య మాంస ముద్రలు కూడా నివేదనం చేయాలి.

మాంసములు,జలచర, భూచర, ఖేచరములని మూడు విధాలు చేపలు మొదలైనవి జలచరములు. గో, అజ, గజ, మహిషాదు లెనిమిదింటికి భూచరములైన మాంసాష్టకమని పేరు.

శ్లో ॥ గోజే భాశ్వ వరాహాణాం మాహిషం మృగ ఖడ్గయోః
ఏతన్మాంసాష్టకం ప్రోక్తం చండికా ప్రీతికారకం.

దేవీ పూజకోసం ఎవరిని చంపినా తప్పులేదట.

శ్లో ॥ దేవతార్థం ద్విజం గాంచ హత్వా పాపై ర్నలిప్యతే
మాంసం వినాతు పూజాయాం పాపస్యాచ్చ పదేపదే

గోవునుగాని ద్విజులనుగాని దేవీపూజకోసం చంపవచ్చు ననటం కంటె ఘోరం ఇంకేముంటుంది ? వీటిని మహాదారుణమైన పాపాలుగా ధర్మశాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

శ్లో ॥ బ్రహ్మహత్యా సురాపానం స్తేయంగుర్వంగనాగమః
మహాన్తిపాతకాన్యాహుః సంసర్గశ్చాపితైస్సహ.

బ్రహ్మహత్య కల్లుత్రాగుట, గురుపత్నీ గమనము, దొంగతనము మహాపాతకములు. అవి చేసిన వారితో సంసర్గము కూడా అట్టిదే.

ఇక మకారాలలో మత్స్యం నివేదన వస్తువు. దాంట్లోనూ చాలా రకాలున్నవి. తరువాతిది ముద్ర. శర్కరా మాంసాదులతో వండిన పిండివంటకు ముద్ర అంటారని చెప్పబడింది.

శ్లో ॥ వ్రైహేయంమండలాకారం చంద్రబింబ నిభంశుభం
చారుపద్మమనోహరిశర్క రాద్యైఃప్రపూరితం
పూజాకాలే దేవతాయా ముద్రైషాపరికీర్తితా

మద్య మత్స్య మాంస ముద్రలతోపాటు వివిధ వ్యంజన భక్ష్యములతో సహా అన్నమును నివేదన చేయాలి.

శ్లో ॥ నైవేద్యం షడ్రసోపేతం నానావిధ ఫలం తథా
నానావిధాని ద్రవ్యాణి దత్వా దేవ్యై ప్రయత్నతః
మద్యం నివేద్యమాంసంచ మత్స్యం ముద్రాం తతఃపరం
దత్వాదేవ్యై ప్రయత్నేన అన్నం బహువిధం తథా ...

ఈ నివేదన తర్వాత

"అజాది బలిదానేన చండికాం తోషయేత్ తతః"

మేక మొదలైన జంతువులను బలి యివ్వాలి. దీనితో పూజ పూర్తి అయినట్లు. తరువాత కౌళికులతో కలసి కులామృతపాన గోష్ఠి నిర్వహించాలి. చక్రార్చనమన్న పేరుతో స్త్రీ పురుషులను మండలాకారంగా కూర్చోపెట్టి అంతాకలిసి మద్యపానం చేయాలి. వామాచార సిద్ధాంతం ప్రకారం ఇందులో ఎటువంటి దోషమున్నదనీ మనసులో కూడా అనుకోరాదు. ఇదంతా ఒక పుణ్యకర్మగా భావించాలి.

శ్లో ॥ జ్ఞానతో భైరవీచక్రే జ్ఞానినాం నైవ దూషణం
గురుంస్మరన్ పిబన్మద్యం ఖాదన్మాంసం నదోషభాక్

భైరవీచక్రంలో ప్రవేశించిన తర్వాత ఏదీ దోషం కాదట !

దేవతా ప్రసాదమైన మద్యమాంసాదులు సేవించిన పిదప ఆ కులద్రవ్య ప్రభావంవల్ల భైరవావేశం కలుగుతుందిట !

శ్లో ॥ సేవితేచ కులద్రవ్యే కులతత్వార్థదర్శినః
జాయతే భైరవావేశః సర్వత్ర సమదర్శినం

ఈ భైరవావేశం ఎక్కిన తర్వాత స్త్రీ పురుషులంతా వావివరుసలతోగాని, వయస్సుతోగాని, ఇతర మర్యాదలతోగాని వివక్షలేక కామక్రీడలు చేయవచ్చునట. ఆ సమయంలో తన తల్లినైనాసరే ప్రక్కనున్న మిత్రుడు భోగించాలని కోరితే కౌళికుడు కాదనరాదట ! చూడండి.

శ్లో ॥ మాతరంవాపి గచ్ఛంతం కౌలికం ననివారయేత్
వారణాత్ త్రిపురారుష్టా తతో హానిస్తు జాయతే

ఎవరైనా అడ్డగిస్తే త్రిపురాదేవికి రోషం కలిగి హాని కలుగుతుందని కులగ్రంథాలు బెదిరిస్తున్నవి.

శ్లో ॥ భగినీం వా సుతాం భార్యాం యో దద్యాత్ కులయోగినే
మధుమత్తాయ వీరాయ పుణ్యం తచ్చనగణ్యతే.

ఎవడైతే తన సోదరినిగాని, కూతురునిగాని, భార్యను గాని మధుమత్తుడైన వీరునకు సమర్పిస్తాడో వాని పుణ్యం లెక్కించటానికి సాధ్యంకాదు.

శ్లో ॥ "కులంకులాయ యోదద్యాత్ సోపియోనౌ న జాయతే"

తన కులస్త్రీని కులయోగికి ఎవడిస్తాడో వానికి మళ్ళీ జన్మలేదని కౌళికుల విశ్వాసము.

కౌళికులు స్వేచ్ఛాకాములు. స్వస్త్రీ, పరస్త్రీ భేదముగాని, వావివరుసలుగాని వారికి లేవు. కామ విషయంలో పశువులకు వారికి ఎటువంటి తేడాలేదు. ఆధునాతన కాలంలో వ్యాపించిన స్వేచ్ఛాకామ సిద్ధాంతములన్నీ ఆనాడే వారికి ఒంటబట్టినవి. అయితే అధునాతనులు నాస్తికులు. వారికి పరలోకాలమీద విశ్వాసంలేదు. దేవునియొక్క స్వర్గనరకాల యొక్క ఉనికిని ఒప్పుకోరు. కౌలికులు దీనినంతా దేవతాసాధనలో భాగంగా చేస్తారు. రతిక్రీడా సమయంలో కూడా మంత్రజపం చేయాలి. మైథున క్రియను భైరవీ భైరవ క్రీడగా పరమ పవిత్రమైన యజ్ఞంగా భావించాలి. దానివల్ల దివ్యశక్తు లనేకం సాధించవచ్చునని వారు చెప్పారు. కనుక నాస్తికులకు కౌలికులకు భావనలో భేదం వుంది. ఇంకా కౌలికుల తాత్విక చింత చూడండి. ఎటువంటి అపమార్గాలు తొక్కిందో ! అద్వైతానికి వాళ్ళిచ్చే వ్యాఖ్యానాలు గమనించండి!

శ్లో ॥ అద్వైతానాంచ కుత్రాపి నిషేధోనై నవిద్యతే
మాతృగర్భస్థ బీజేన శిశురేవ నసంశయః
గర్భనిస్సార కాలేతు బాలకోహి దిగంబరః
జననీ జఠరాద్ యోనిరంధ్రద్వారాద్బహిర్భవన్
జననీయోని సంబంధః సుతఃశిశ్నాధి గచ్ఛతి
ఏవం విచార్యమాణేతు కోనస్యా ద్గురు తల్పగః
అత ఏవ యధా యస్య వాసనా కుత్సితాభవేత్
తదా దోషాయ భవతి నాన్యధాదూషణం క్వచిత్

అద్వైతులకెక్కడా నిషేధంలేదు. ఎందుకంటే పురుషుడు తల్లి యోనిరంధ్రమునించి దిగంబరుడై తన శిశ్నముతో పుట్టుట లేదా ? కనుక తల్లికి బిడ్డకు గల లైంగికసంబంధం చాలా సహజమట !

కుత్సితవాసనా మూలకమైన ఈ దోషాదోషా విచారణమే తప్పట! దోషం కాదన్న దృఢభావనంతో వ్యవహరించటమే కౌలికమతం.

ఇంకా ఏమంటారో చూడండి !

**శ్లో ॥ తస్మా దద్వైతరూపేణ సర్వయోనిం విచారయేత్**
**నిశ్చయం ముక్తిమాప్నోతి సహస్ర యోనిదర్శనాత్**
**అనాచారః సదాచారః కుకార్యం కార్యముత్తమం**
**అమేధ్యమపి మేధ్యం స్యా దద్వైతానాంచ నిశ్చితం**
**అపేయమపి పేయంస్యా దభోజ్యం భోజ్యమేవచ**
**అగమాపిచగమ్యాస్యా దద్వైతానాం సునిశ్చితం**

అద్వైతరూపంతో సర్వయోని విచారణ చేయాలి. ఆ విధంగా ఏనాడు సహస్రయోనిదర్శనం పూర్తి అవుతుందో అప్పుడు నిశ్చయంగా వానికి ముక్తి లభిస్తుంది. అనాచారమే సదాచారము. చెడుపనియే మంచిపని, అమేధ్యమే మేధ్యము, త్రాగరానిదే త్రాగదగినది. తినరానిదే తినదగినది. పోగూడని స్త్రీ పోదగినది లోకవిరుద్ధమైన సర్వకార్యములు కౌలికులకు సుబద్ధములు. వారికే నియమము, నిబంధన వర్తించదు - ఇది వారి ప్రధానమత ధోరణి.

ప్రసిద్ధ తపస్వియైన కావ్యకంఠగణపతిముని జీవితములో ఇటువంటి సహస్రయోని సందర్శన వ్రతుడొకడు తటస్థించినట్లు, వాడి దీక్షను నాయన భగ్నంచేసినట్లు వింటాము.

మన ధర్మశాస్త్రాలు ఇటువంటి దురాచారములను, మహాపాపాలుగా పరిగణించినవని ఇంతకు ముందే చెప్పాను. ఆ పాపాలెవడైనా చేస్తే వాటికి ప్రాయశ్చిత్తం కూడా చాలా దారుణంగా చెప్పబడింది. మనుస్మృతిలో గురుతల్ప గమనం చేసినవాడు ప్రాయశ్చిత్తం చేసుకోవాలనుకుంటే ఆ పాపాన్ని అందరికీ బిగ్గరగా చెపుతూ కాలిన ఇనుప స్త్రీ ప్రతిమను కౌగిలించుకోవాలనీ, లేదా తన శిశ్న, వృషణాలను త్రెంపుకొని తన దోసిలిలో ఉంచుకొని కిందపడి మరణించేదాకా - నైరృతి దిక్కువైపుకు నడవాలని మరణాంతకశిక్ష విధించబడింది. యాజ్ఞవల్క్య

స్మృతిలో కేవలం గురుపత్నీ గమనానికేగాక చెల్లెలు, అత్త, కూతురు మొదలగు వరుసలు గలవారితో సంగమించిన దానికిగూడా పై ప్రాయశ్చిత్తమే విధించబడింది. కనుక కౌలికుల పద్ధతులన్నీ సమాజ ధర్మవిరుద్ధాలు స్మృతి నిషిద్ధాలు.

# పాము మంత్రములు

పాము మంత్రం అనగానే అందరికీ చప్పున తోచేది ఎవరికైనా పాము కరిస్తే విషాన్ని నిర్విషంచేసి మనిషిని చావకుండా బ్రతికించే మంత్రం అని. నిజానికి ఆ శబ్దానికి చాలా అర్థాలున్నవి. పాముకు నోటిని కట్టివేసేది, మళ్ళీ బంధనాన్ని విడపించేది - కట్టు, విప్పు అని మంత్రాలున్నవి. పాము శరీరం మొత్తానికి అదేవిధంగా బంధన మోచన మంత్రాలు, శత్రువులమీద సంహారానికి ప్రయోగించే సర్పప్రయోగ మంత్రాలు - ఏవైనా కావచ్చు. ప్రసిద్ధమైన అర్థం మాత్రం విషహరణార్థంలోనే.

మన వాఙ్మయంలో ఈ విషయాలను గురించి చాలా ప్రస్తావన వచ్చింది. భారతంలో రురుడనే ఋషికుమారుడు ప్రేమించిన ప్రమద్వర అనే అమ్మాయిని పాము కాటువేసి చంపగా అతడు దేవతలను ప్రార్థించాడు.

**అపరిమితాజ్ఞ చేసియు మహాపురుషుల్ విషతత్వ సంహితా**
**నిపుణులు మంత్రతంత్రములు నేర్చి విధించియు దీనికిన్ విష**
**వ్యపగతమైన జీవమది వచ్చు నుపాయము సేయరొక్కొ నా**
**తపము జపంబు నధ్యయన దానఫలంబులు నిత్తు వారికిన్**

దీనినిబట్టి ఆనాడు ఆజ్ఞాసిద్ధులైన సర్పమాంత్రికులుండేవారని తెలుస్తుంది. పాండవుల మనుమడైన పరీక్షిత్తును శృంగిశాపంవల్ల తక్షకుడు కరవటానికి వస్తుంటే రాజును బ్రతికించటానికి కశ్యపుడనే మాంత్రికుడు బయలుదేరి వస్తుంటాడు. త్రోవలో తక్షకుడు, కశ్యపుడు సవాలు చేసుకొన్నారు. తక్షకుడు కరచి మసిచేసిన చెట్టును దానిమీది బాలునితో సహా మళ్ళీ బ్రతికించి వెనుకటిలాగా ఉండేట్లు చేశాడు కశ్యపుడు. ఆ రోజుల్లో పాము కరచి చనిపోయిన తరువాత కూడా బ్రతికించేవారని దీనినిబట్టి విశదమవుతుంది. జనమేజయుని సర్పయాగ వృత్తాంతం చదువుతుంటే ఆ కాలములో ఎంత భయంకరమైన మహాసర్పాలుండేవో తెలుస్తుంది.

ఆ యజ్ఞకుండంలో పడిన వారిలో సీతాసిత పీతారుణ వర్ణదేహులు, నవాసృగ్రక్తనేత్రులు, మహోన్నతులు, ఏక త్రిక పంచ సప్త నవ నానామస్తకులూ అయిన నాగరాజులున్నారు. ఆ జాతులన్నీ ఇప్పుడదృశ్యమై పోయినవేమో అనిపిస్తుంది. సర్పయాగాన్ని ఆపించి తమ జాతిని రక్షించినందుకు ఆస్తీకుడికి సర్పజాతి పెద్దలు వరమిచ్చారు. అతని పేరుచ్చరిస్తే సర్పభయం వుండదట.

శ్లో ॥ సర్పసర్పమహాసర్ప గచ్ఛసర్పమహావిష
జనమేజయస్యయజ్ఞాంతేఽ స్తీకవచనంస్మర.

ఓ మహాసర్పమా ! వెళ్ళిపో. జనమేజయుని యజ్ఞం చివర ఆస్తీకునికి ఇచ్చినమాట గుర్తుతెచ్చుకో. అంటే ఎంతటి పామైనా వెళ్ళిపోతుందని భారతము చెపుతుంది.

పాములవాళ్ళు ఒక కులంగా పాములనుపట్టి ఆడించటం విషహరణ విద్యలు తెలిసివుండటం పూర్వకాలం నుండి ఉన్నది. విశ్వనాథ సత్యనారాయణగారు వేయిపడగలు నవలలో కూచిపూడి భాగవతులు ప్రహ్లాదచరిత్ర వీధి భాగవతం ప్రదర్శించేపటప్పుడు హిరణ్యకశిపుని ఆస్థానంలో పాములవాడు తన విద్యను ప్రదర్శించే ఘట్టం ఒకటి వ్రాసి అందులో వాళ్ళ వేషాలు, పాములలో ఉండే జాతులు చెప్పించారు.

దంతపుదువ్వెన అనే నవలలో ఒక నాగమంత్రోపాసకుడు మొదటిదశలో పాము కరచినవాళ్ళు వస్తే బ్రతికించేవాడు. ఉపాసన తీవ్రమైన కొద్దీ సర్పకులాన్ని వశం చేసుకోగల శక్తిని సాధిస్తాడు. దాన్నిబట్టి నాగోపాసనా విశేషాలు కొన్ని గ్రహించవచ్చు.

పాల్‌బ్రంటన్ అనే పాశ్చాత్య సాధకుడు రమణమహర్షిని గూర్చి వ్రాసిన గ్రంధాలు ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా అనే గ్రంథము ప్రసిద్ధమైనదే. అతడు ఎ సెర్చ్ ఇన్ సీక్రెట్ ఈజిప్ట్ అని మరొక గ్రంథం రచించాడు. అందులో ఒక ఈజిప్టు దేశపు సర్పమాంత్రికుణ్ణి గురించి చాలా వివరంగా ప్రస్తావించాడు. అతడి ఫోటో కూడా ప్రచురించి సర్పముల మీద అతడు ఎంత అనుశాసనాన్ని కలిగివున్నది అద్భుతంగా వర్ణించాడు. ఏ పామైనా అతడు పిలిస్తే వచ్చేదిట! నోరు తెరిచి చెయ్యి నోట్లోపెట్టినా కరిచేది కాదట ! అతని దగ్గర పాల్‌బ్రంటన్ సర్పవిద్య నేర్చుకొన్నాడు. దాని శక్తివల్ల పాములను అతడు కంఠాభరణాలుగా

ధరించగలిగేవాడు. ఒక శిథిల భూగృహంలో కరవటానికి బుస్సుమని లేచిన మహాసర్పాన్ని కదలకుండా స్తంభింపజేయగలిగాడు. అధునాతన కాలంలో ఆ విద్యలు నిరూపించగలిగాడతడు.

ఇక్కడ ఒక చిన్నఅంశం గమనించాలి. సామాన్యంగా సముద్రంమీద, నదిమీద జీవించే వృత్తిగలవారు ఎప్పుడో ప్రమాదంలో అక్కడే మరణించటం వింటుంటాము. ఎందరో సర్పమాంత్రికులు పాముకాటువల్ల మరణించటం కూడా అటువంటిదే. కేవలం సర్పవిష నివారణ చేస్తూ వుండే మాంత్రికులకు ప్రమాదం ఎప్పుడూ రాదుగాని సజీవ సర్పాలతో చెలగాటాలాడే వ్యక్తికి ఉపద్రవం రావచ్చు. ఎందుకంటే పాములలో దేవతా లక్షణం గలవి, పిశాచ లక్షణం గలవి వుంటవి. అది అంతంతమాత్రపు మంత్రగాళ్ళకు కట్టుబడవు. పాల్‌బ్రంటన్ ఒకపెద్ద పామును కట్టుగట్టి మెడలో వేసుకుంటే ఏదో భయంకర తమోలోకంలోకి వెళుతున్నట్లు అనుభూతి కలిగిందని వ్రాశాడు. ఎప్పుడో ఒకప్పుడు తీవ్రశక్తిగల సర్పాలు మాంత్రికులను కాటువేయటం, వారు మరణించటం కూడా కద్దు. బ్రంటన్ గురువైన ఈజిప్షియన్ మాంత్రికుడు పాముకాటు చేతనే మరణించాడు. ఏదైనా విషజంతువులతో సయ్యాటలు శ్రేయస్కరం కాదు.

"గారుడమంత్రసిద్ధు దురగంబులతో వెస నాడినట్లు" అని కొందరు పాములతో ఆడుతూనే వుంటారు. ఈమధ్య వార్తలలోనే ఒక వ్యక్తి వందల పాముల మధ్య గాజు గదిలో సుమారు మూడురోజులు జీవించాడని చదివాము. ఇవన్నీ వైయక్తికంగా విచిత్ర లక్షణాలు.

చిరకాలం జీవించిన జాతిపాముల పడగలమీద మణులుదయిస్తవి. వాటికి విష నివారణశక్తి వుందని ప్రసిద్ధి. పాములను చంపి కొందరు వాటిని సేకరిస్తుంటారు. ఆ మణిని పాము కరచినచోట పెడితే అంటుకొని, శరీరంలోని విషాన్ని పీల్చి ఊడిపోతుంది. దాన్ని మళ్ళీ పాలలో వేస్తే ఆవిషాన్ని విడుదల చెయ్యటం ఆ పాలు రంగుమారటం చూడవచ్చు.

తెలుగుదేశంలో పాము మంత్రం అనగానే పాముల నరసయ్యగారి పేరు విననివారుండరు. ఆంగ్లేయుల పాలనా కాలంలో ఒక మహావిషసర్పం బ్రిటిష ఉన్నతాధికారి నొకడ్ని కరిస్తే మృత్యుముఖంలో ఉన్న అతడ్ని నరసయ్యగారు తన మంత్రశక్తితో కాపాడారు. కృతజ్ఞుడైన ఆ అధికారి ఈ మహనీయునివల్ల లోకానికి

ఉపకారం జరగాలన్న సదాశయంతో ఆయన నొక రైల్వేస్టేషన్ మాస్టరుగా నియమింపజేసి, పాము కరచిన వారెవరైనా రైలుస్టేషనుకు వెళ్ళి చెపితే చాలు, ఆయనకు ఫోనుచేసే ఏర్పాటు చేశాడు. ఆయన వృద్ధుడైన తర్వాత ఆయన అల్లుడు ఇప్పటికీ అదేస్థానంలో వుండి ఫోనుద్వారా మంత్రంవేసి ఎందరినో బ్రతికిస్తూనే వున్నాడు. వారి సంప్రదాయంలో శిష్యుల పరంపర మనరాష్ట్రంలో ఆ విద్యను ప్రకాశింపజేస్తూనే వుంది. వారిది గారుడ మంత్రమని వారి శిష్యులొకరు చెప్పగా విన్నాను.

సర్పమంత్రాలలో గారుడ, నాగ సంప్రదాయాలు ప్రసిద్ధమైనవి. ఏ దేవతా విద్యయైనా విషనివారణ చేయవచ్చు. కాని ఇవి రెండు ప్రత్యేకంగా దానికోసం ఉద్దేశించబడినవి. గారుడమంత్రంగాని, నాగమంత్రంగాని, మరి ఏ ఇతర విషనివారణ మంత్రంగాని జపించి సిద్ధస్థితిని పొందిన మహానుభావులు కొందరి పేర్లే మంత్రాలుగా చెల్లుబాటు కావటం కూడా వుంది. తెలుగుదేశంలో అటువంటి సిద్ధుల పేర్లే మంత్రాలైనవి - బాగానే ప్రచారంలో ఉన్నవి.

పాముమంత్రం పాము కరిచినప్పుడు బ్రతికించటానికి మాత్రమేకాక, సర్పి మొదలైన చర్మవ్యాధులకు, విషజ్వరాలకు, సిఫిలిస్‌కు పనిచేస్తుంది. మంత్రంవేసే పద్ధతికూడా చిత్రంగానే వుంటుంది. అది వారి వారి సంప్రదాయం, శక్తిమీద ఆధారపడి వుంటుంది. కొందరు మంత్రాన్ని స్మరించి బాధితునిలోకి స్పర్శద్వారా శక్తిపాతం చేస్తారు. మరికొందరు మంత్రతీర్థం ఇస్తారు. కొంతమంది వేపమండతో దిగదుడుస్తూ మంత్రిస్తారు. మరికొంతమంది తురాయి కడతారు. పాముల నరసయ్యగారు ఎవరినైనా పాము కరిచిన వార్తరాగానే పై గుడ్డచింపి ఒక ముడివేసేవారట. అందుకని గుడ్డపేలికలు బుజాన సిద్ధంగా వుంచేవారట. ఇంక కొందరు వారు కూర్చుని జపిస్తూవుంటే వారినుండి అనుజ్ఞ తీసుకొని మరోమనిషి బాధితుని చెవిలో 'ఫలానా వారి ఆజ్ఞ - నీ విషం నిర్విషమైంది లే' అని చెపుతుంటాడు. అలా కొన్నిసార్లు చెప్పగా కాసేపటికి పాముకాటు తిన్నవాడు లేచి కూర్చుంటాడు.

చాలామంది శాస్త్రజ్ఞులు చెప్పటం పాములన్నీ విషసర్పాలు కావనీ, కాటుపొందిన వారిలో ఎక్కువమంది భయంవల్ల మరణిస్తుంటారనీ, బ్రతికేవారు మంత్రంవల్ల కాక విషం లేకపోవటమో, కోరలలో అంతకుముందే ఏ జంతువునైనా కరచివుండటంవల్ల తక్కువ విషం వుండటమో కారణమని అంటుంటారు. ఆ మధ్య రాజస్థాన్ యూనివర్సిటీ ప్రొఫెసరొకరు మళయాళ దేశం వెళ్ళి అక్కడి

సర్పమాంత్రికులను పరీక్షించాడు. ఒక మేకను విషసర్పంచేత కరిపించగా ఆ మాంత్రికులు దాన్ని బ్రతికించలేకపోయారట. దానితో పాముమంత్రం అబద్ధమని అతడు ప్రకటించాడు.

కాని ఈ దేశం సిద్ధుల, యోగులదేశం. ప్రచారానికి, పరీక్షలకు తలయొగ్గని మహానుభావులెందరో ఉంటారు. శ్రద్ధతో అన్వేషిస్తే అటువంటివారు దొరకకపోరు. పాము మంత్రం లేదనీ, అసలు ఏ మంత్రమూ లేదని అనటం ఆ విద్యలను విద్యావేత్తలను పరిశీలించకుండా అనే తొందరపాటు మాట.

## సర్పశాపయోగము

లోకంలో సంతానంలేక బాధపడేవారు వైద్యపరీక్షలు, శస్త్రచికిత్సలు, మందులు, మాకులు పూర్తి అయిన తర్వాత కూడా పిల్లలు పుట్టకపోతే అప్పుడు జ్యోతిష్కుల దగ్గరికో, మాంత్రికుల దగ్గరకో వెళతారు. జ్యోతిష్కులయితే జాతకచక్రం గణించి గ్రహదోష మేదైనా ఉంటే దాన్ని నివృత్తి చేసుకునే శాంతిప్రక్రియ చెపుతారు. ఆ తరువాత కూడా సంతానం కలుగకపోతే మంచి క్షేత్రంలో నాగప్రతిష్ఠ చేయవలసిందిగా పురోహితులు సలహాయిస్తారు. మాంత్రికుల దగ్గరకు వెళితే వాళ్ళు సర్పగ్రహంవంటి ఏ భూతప్రేతములైనా పీడిస్తున్నవేమో తమ మంత్రశక్తివల్ల తెలుసుకొని దానికి తమ మార్గంలో నివారణచేస్తారు.

సంతానం కలగకపోవటానికి అనేక కారణాలుండవచ్చు. నిజమైన కారణాన్ని బాధితుని పూర్వజన్మలోని కర్మను తెలుసుకోవటం ద్వారా దార్శనిక సిద్ధుడైన యోగిమాత్రమే చెప్పగలుగుతాడు. ఆ కారణాలలో సర్పశాపం కూడా ఒకటి. దాన్ని పరిశీలిద్దాము.

ఈ అనంతసృష్టిలో సర్వజంతువులు ఆహార నిద్రాభయ మైధునములనే సామాన్యలక్షణం కలవి. తత్సంబంధమైన అనుభూత్యుద్రేకాలతో అవి ప్రవర్తిస్తూ ఉంటవి. వాని అనుభూతులన్నీ తత్కాల పర్యవసాయులు. వాటిని మనఃపేటికలో గుప్తం చేసుకొని అవసరమైనపుడు తత్స్మృతుల విక్రియలతో నియుక్తులై వర్తించటం జంతువులలో లేదు. విలక్షణజీవియైన మానవుడికి మాత్రమే ఆ శక్తి ఉంది. ఆలోచనాశక్తిగల మనస్సు మనుష్యు డొక్కడికే ఉంది. అనేక విషయాలను చిరకాలం గుర్తుపెట్టుకోగలశక్తి అతడికి ఉంది. నరుని స్మృతి మందిరంలో ఎన్ని సంవత్సరాల

అనుభవాలో నిలచి ఉంటవి. ఒక జన్మ మారినప్పుడు మాత్రం పూర్తి మరపు వస్తుంది. మరణించిన తర్వాత కూడా మళ్ళీ స్త్రీ గర్భకోశంలో ప్రవేశించేదాక తానెవరో స్మృతిలోనే ఉంటుంది. ఆ స్మృతి, జ్ఞాపకశక్తి మానవజన్మకు ప్రధానలక్షణం. మానవుల మధ్య పరస్పరం ఉండే సర్వానుబంధాలకు ఇదేమూలం. సృష్టిలో చరిత్రకు నిలువగల మహాకార్యములను చేయించేది ఈ స్మృతే. ఆ స్మృతులలో ఆలోచనలను గుర్తుంచుకోవటం ఒకటి, అనుభూతులను గుర్తుంచుకోవటం మరొకటి. కొన్ని జంతువులకు అనుభూతులను గుర్తుపెట్టుకొనే శక్తిఉంటుంది. ప్రేమ, కోపము మొదలైన అనుభూతులు సర్వప్రాణి సహజమని జంతువులకేకాక చెట్లకు కూడా సుఖదుఃఖాత్మకమైన అనుభవాలు పొందే లక్షణమున్నదని విజ్ఞానశాస్త్ర పరిశోధకవర్యుడైన జగదీశ్ చంద్రబోస్ నిరూపించాడు గదా ! అయితే ఆ అనుభూతులు వాటిలో అనుభూతులుగానే మిగిలిపోతవి. ఆలోచనలుగా పర్యవసించవు.

పిల్లి, కుక్క ఆవు, గుర్రము మనిషికి చాలా సన్నిహితమైనవి. వాటిలోనూ కుక్క గుర్రముల విశ్వాసానికి ప్రపంచమంతా అన్నిదేశాలలోనూ ఎన్నో కథలున్నవి. తమ యజమానులకు సేవచేయటంలో నిరుపమానమైనవి.

ఇకపోతే సర్పంలో ఒక విలక్షణమైన ప్రకృతి ఉంది. సర్పజాతిలో ఉత్తమమైన నాగుపాముకు తన కెవరైనా అపకారంచేస్తే ఆ వ్యక్తిని గుర్తు పెట్టుకొని పగబట్టి కాటువేసే తీవ్రలక్షణం ఉంది. ప్రాచీన వాఙ్మయంలో దానికి చక్షుశ్రవమనే పేరుంది. అంటే కన్నులే చెవులుగా కలది అని అర్థం. ఇటీవల శాస్త్రజ్ఞులు కన్నులకు వినేశక్తి లేదని పాములకు శరీరం అంతటా శ్రవణనాడులున్నవనీ కనిపెట్టారు. అలానే దానికి వాతాశనమనే పేరుకూడా ఉంది. అంటే గాలి ఆహారముగా కలది అని. అది ఆహారం లేకుండా చాలాకాలం ఉండటంచూచి ఆ పేరు వచ్చిఉంటుందనేగాని, అది చక్కగా కప్పలను, ఎలుకలను ఇత్యాది తింటుంది. ఏ కొండచిలువో అయితే పెద్దజంతువులనే భక్షిస్తుంది. మామూలు పాములు చిన్నవైనా, పెద్దవైనా ఏ మానవుడు తమకు అపకారం చేసినా అప్పుడు చిక్కితే కాటువేసి చంపుతవి. అంతేకాని తర్వాత ఆ మనిషి గుర్తుపెట్టుకొని వెంటాడటమనేది లేదు. ఒక్క నాగుపాము మాత్రం శత్రువును విడిచిపెట్టదు. అది ఒక మనిషి మీద పగబడితే ఆ పగ అవధి పన్నెండేళ్ళంటారు. అంటే అంతదాక ఆ మనిషి దొరక్కపోయినా మరచిపోదన్నమాట. అటువంటి తీవ్రక్రోధాన్ని

అది నిలవజేసుకొంటుంది.

అయితే పాము పగబట్టినదని తెలిస్తే, మనిషి ఊరుకోడు గదా ! జాగ్రత్తగా మనుషులను కాపలా పెట్టుకొని అది దగ్గరకు వచ్చినపుడు చంపించవచ్చు. లేదా మణిమంత్రౌషధుల సహాయంతో సర్పానికి అనభిగమ్యుడు, అప్రధృష్యుడూ కావచ్చు లేదా అతడు మరే ఇతర కారణంవల్లగానీ సహజంగానే ఆయువు తీరిగాని మరణించవచ్చు. ఇందులో ఏది జరిగినా పాముకు పగ తీరదు. తాను స్వయముగా కాటువేసి చంపితే తప్ప దాని కోపం శాంతించదు.

ఉత్తమజాతి సర్పం పగబట్టిన మరుక్షణం నించీ ఆహారం తీసుకోదు. పగ తీరకపోతే అలానే నిరశన దీక్షతో ప్రాణాలు విడుస్తుంది. మనుషుల్లో కూడా చూడండి. ఎవరి మీదనైనా కోపం వస్తే అది ఎక్కువకాలం ఉండాలంటే నిరాహారం కాకపోయినా చాలా కొద్దిఆహారాన్ని మాత్రమే తీసుకోవాలి. కడుపునిండా తిని కమ్మగా నిద్రపోయేవాడు దీర్ఘక్రోధి కాలేడు. కాశీఖండంలో వింధ్యపర్వతానికి అటువంటి దశ వస్తే శ్రీనాథుడు ఆస్థితిని అద్భుతంగా వర్ణించాడు.

**కంటికి నిద్ర వచ్చునె ? సుఖంబగునే రతికేళి? జిహ్వకున్**
**వంటక మించునే ? యితర వైభవముల్ పదివేలు మానసం**
**బంటునె మానుషంబుగల యట్టి మనుష్యున కెంతవానికిన్**
**కంటకుడైన శాత్రవు డొకండు తనంతటివాడు గల్గినన్.**

కంటకుడైన శత్రువు తనంతటి వాడుంటే మానుషమున్న వాడికి ఆహారం, రతి, నిద్రాదులు సుఖదాయకములు కావు. కనుక పగబట్టిన త్రాచు ఆవిధంగా తీవ్రప్రకృతితో ప్రవర్తిస్తుంది. ఆ ద్వేషంతో క్రోధంతో మరణించేసరికి అది సర్పగ్రహమవుతుంది. శరీరంతో ఉన్నప్పటి కంటే నూక్ష్మ దేహం ఏర్పడినప్పుడు మరింత శక్తిమంతంగా ప్రవర్తించగలుగుతారు జీవులు. **"పాము కదు ముదిసి పిమ్మట గామగు చందమున"** అని పెద్దన మనుచరిత్రలో ఒకచోట అన్నారు. అంటే పాము ముసలిదైతే గాము - గ్రహము అవుతుందట. ఇంక క్రోధద్వేషాలతో మరణిస్తే వేరే చెప్పవలసిన పనిలేదు.

ఆ సర్పగ్రహము ఇక తన శత్రువును వెంటాడుతుంది. పాంచభౌతిక శరీరంతో మనిషిని హింసించటానికి ఎంతో కష్టపడాలి. ఇప్పుడా బాధలేదు. ఇబ్బందిలేదు. సూక్ష్మశరీరంతో మనిషిని హింసించటానికి ప్రయత్నిస్తుంది. దాని

ఫలితంగా పాము కరిస్తే విషమెక్కి మనిషి ఏవిధంగా బాధపడతాడో నెమ్మదిగా ఆ లక్షణాలన్నీ వస్తవి. విషవ్యాధులతో బాధపడతాడు. సిఫిలిస్, చర్మవ్యాధులు, సర్పగ్రహ ప్రభావంవల్ల వచ్చే వ్యాధులు. ఇంక ప్రధానమైనదేమిటంటే ఆ గ్రహం నరునికి సంతానాన్ని పొందేశక్తిని నాశనం చేస్తుంది. పురుషుని వీర్యకణాలు సర్పాకారంలో కదులుతూ ఉంటాయని సూక్ష్మదర్శినిలో చూచినవారెరుగుదురు. ఆ వీర్యకణాలలోని జీవశక్తిని నశింపజేస్తుంది సర్పగ్రహం.

తత్ఫలితంగా పురుషుడెంత శ్రమించినా ఫలితం దక్కదు. స్త్రీయైనా అంతే, ఈ మనిషి మరణించినా మళ్ళీ ఎక్కడ పుడతాడో ఆ గ్రహం చూస్తూ ఉంటుంది గనుక తెలుసుకొని వెంటాడి అపకారం చేస్తుంది.

మరి ఆ దోషాన్ని పోగొట్టుకోవటం ఎలా ? అందుకే నాగప్రతిష్ఠ అనేది వచ్చింది. నాగరాజును ప్రతిష్ఠించి పూజించటముచేత ఆ దేవతామూర్తి ప్రసన్నుడై సర్పగ్రహ ప్రభావాన్ని తొలగించి వ్యాధులను నిర్మూలించి సంతానాన్ని ప్రసాదిస్తాడు. సామాన్యంగా నాగప్రతిష్ఠ చేసే పాముబొమ్మలు – శిలావిగ్రహాల క్రింద సుబ్రహ్మణ్య మంత్రాన్ని యంత్రంలో లిఖించి ప్రాణప్రతిష్ఠ చేసి పూజలు చేస్తారు. కుమారస్వామి మంత్రాలేకాక నాగాస్త్ర, నాగభైరవ, నాగబేతాళ విద్యలు మంత్రశాస్త్రంలో ఉన్నవి గాని మనప్రాంతంలో అంత ప్రసిద్ధిలో లేవు. అయితే తెలుగుసీమలో ఒకప్పుడు సర్పోపాసకులైన నాగజాతి వారు ఎక్కువగా నివసించారు గనుకనే నాగులవరం మొదలైన గ్రామాలు, నాగమ్మ, నాగరత్నం, నాగరాజు మొదలైన పేర్లు నాగభైరవ మొదలైన ఇంటి పేర్లు తరచుగా వెలసినవి.

ఈ సర్పగ్రహప్రభావాన్ని తప్పించుకోటానికి నాగప్రతిష్ఠ తప్ప వేరే మార్గం లేదా అనవచ్చు. ఎన్నో మార్గాలున్నవి. శక్తిమంతమైన ఏ దేవత నాశ్రయించినా పని నెరవేరుతుంది. అయితే సామాన్యంగా మనకొక ఆచారముంది. శనిగ్రహ దోషమైతే శనిశాంతి చేయిస్తాము. రాహుగ్రహ దోషమైతే ఆ గ్రహానికి శాంతి చేయిస్తాము. ఏ రాముణ్ణో, కృష్ణుణ్ణో, శివుణ్ణో ఆశ్రయించము. ఆ దేవతా మంత్రం నిరంతరం జపం చేస్తున్నాను. ఆ దేవుడు ఆ గ్రహదోషాలను తొలగించలేడా అని ఎవరైనా అడగవచ్చు. ఎందుకు చేయడు? చక్కగా చేస్తాడు. అయితే మంత్రశాస్త్రంలో కొంద రొక సంప్రదాయం పాటిస్తారు. జీవితాన్ని ఉద్ధరించి మోక్షాన్ని ప్రసాదించే మహావిద్యలకు రాజమంత్రములని, రాజ్ఞీమంత్రములని పేరు. ఆ మహాదేవతా మంత్రాలను గ్రహదోష నివారణాది అల్పప్రయోజనాలకు వినియోగించరాదని

పెద్దలంటారు. అందుచేత ఎక్కడికక్కడ దానికి సంబంధించిన శాంతి చేసుకోటమే ఉచితమార్గము.

# స్వప్న విద్యలు

మనుష్యులకు అవస్థలు మూడు జాగ్రత్, స్వప్న, సుషుప్తులు, జాగ్రదవస్థనించి సుషుప్తి అంటే నిద్రలోకి వెళ్లే ప్రతి వ్యక్తి స్వప్నమనే భూమిక దాటక తప్పదు. కొందరు మా కెప్పుడూ కలలు రావంటుంటారు. అది అసంభవం. మన ఊరుకు, గమ్యస్థానానికి మధ్య ఉండే ఊరులాంటిది స్వప్నదశ, ఆకాశంలో ఎగిరి వెళ్ళినా మధ్యలో ఉండే ఊరుదాటక తప్పదు. లేకుంటే అక్కడ ఎక్కువసేపు ఆగకుండా వెళ్ళవచ్చు. ఎక్స్‌ప్రెస్‌రైలులో వెళ్ళేవాడు చిన్నస్టేషనులో ఆగనట్లు ఒక్కోసారి పడుకొన్న వెంటనే గాఢనిద్రలోకి వెళ్ళవచ్చు. ఇది ఈనాడు సర్వశాస్త్రవేత్తలూ అంగీకరించిన అంశం. అసలు కలలు రావనేవాళ్ళు వాటిని మరచిపోయే లక్షణం కలవారని భావించవచ్చు.

ఈ కలలు చాలా రకాలు. మనిషి మనసులోని ఆలోచనలే కొన్నిసార్లు కలలో రూపం ధరించవచ్చు. శాస్త్రజ్ఞులు వాటిని అనేక రీతులుగా వివరించారు. ఫ్రాయిడ్ మొదలైన శాస్త్రజ్ఞులు సెక్స్‌పరమైన వివరణలెన్నో ఇచ్చారు. నేను వాటి జోలికిపోను, కలలకు దేవతలకూ ఉండే సంబంధాన్ని మాత్రం విశదీకరించటానికి ప్రయత్నిస్తాను.

సామాన్యంగా కలలు కల్లలే. కాని యాదృచ్ఛికంగా ఎప్పుడన్నా కల నిజం కావటం కద్దు. జూలియస్ సీజరు హత్య చేయబడే ముందురోజు రాత్రి అతని భార్యకు ప్రమాద సూచకమైన కల వచ్చింది. సీజర్ దాన్ని లెక్కచేయలేదనేది వేరే విషయం. ఇలా అక్కడక్కడ ప్రాచీనగాథల్లో సత్యమైన కలలు చదువుతాము. రామాయణంలో త్రిజట స్వప్న వృత్తాంతము ప్రసిద్ధమైనది. రావణుడు నాశనమవుతున్నట్లు, సీతారాములు విజయశ్రీ నందుకొని శుభములు పొందుతున్నట్లు ఆమెకు కల వచ్చింది. అట్లానే ఉషానిరుద్ధుల స్వప్న ప్రణయదృశ్యం ప్రబంధాలలో బాగా వర్ణించబడింది. కలలో కనిపించిన రాజకుమారికల కోసం వీరులు సాహసయాత్రలు చేయటం జానపదగాథల్లో తరచూ కనిపిస్తూ వుంటుంది.

ఆచార్య శంకరులు ఒకచోట **"దేవతాత్మకాః స్వప్నాః కేచిత్ సత్యార్థ గంధినో భవంతీతి మన్యంతే"** అన్నారు. దేవతాత్మకములైన కలలు నిజం కావటమనేది వున్నదని చిరకాలముగా వస్తున్న నమ్మకం. తంత్రశాస్త్రములలో మాత్రం ఈ స్వప్నాలకు ఎనలేని ప్రాముఖ్యం వున్నది.

మంత్రసాధన చేయదలచుకొన్న ఏ వ్యక్తియైనా ఆ మంత్రం తనకు సిద్ధిస్తుందో లేదో స్వప్న పరీక్షద్వారా తెలుసుకోవాలని మేరుతంత్రం ఆదేశిస్తున్నది. అప్పుడే దాన్ని పురశ్చరణ చేయటం మొదలుపెట్టాలి. అశుభసూచన వస్తే ఈ మంత్రం పడదులే అని విడిచిపెట్టాలి. విడిచిపెట్టటం అది ఒక తంతు. దానిసంగతి అటుంచి ఈ స్వప్నపరీక్ష చెయ్యటం ఎలా అంటే శివ విష్ణ్వాది దేవతలకు సంబంధించిన స్వప్నమంత్రాలున్నవి. వాటిని ముందు జపించాలి. శివభక్తులు.

శ్లో ॥ **నమోఽజాయ త్రిణేత్రాయ పింగళాయ మహాత్మనే**
**వామాయ విశ్వరూపాయ స్వప్నాధిపతయే నమః**
**స్వప్నే కథయమే నిత్యం సర్వకార్య మశేషతః**
**క్రియాసిద్ధిం విధాస్యామి త్వత్ప్రసాదా న్మహేశ్వర !**

అని స్తోత్రం చేసి, విష్ణుభక్తులైతే

శ్లో ॥ **నమస్సకల లోకాయ విష్ణవే ప్రభవిష్ణవే**
**విశ్వేశ విశ్వరూపాయ స్వప్నాధిపతయే నమః**

స్వప్న మానయ . . .

ఇత్యాది స్తోత్రంచేసి ఉపవసించి రాత్రిపూట భూశయనం చేయాలి. తెల్లవారుజామున వచ్చిన కలను పరీక్షించుకోవాలి. స్వప్నాధి దేవత కలలో కనిపించి ఏమి చెపితే దాన్ని అనుసరించాలి. ఏమీ చెప్పదనుకోండి. వచ్చిన కలను పరిశీలించుకోవాలి. సిద్ధుడు, గురువు, దేవత, గంగానది, సూర్యుడు, శివలింగము, రథము, దీపము, ప్రాసాదము, కమలము, వృషభము, ఏనుగు, సముద్రము, పండ్లచెట్లు, సింహాసనము, విమానము, చంద్రుడు, రత్నాభరణములు, పూర్ణకుంభము మొదలైనవి శుభదృశ్యాలు. తెల్లనిపూలు, తెల్లని గుడ్డలు ధరించిన సౌందర్యవతి కౌగిలించుకొన్నట్లు కల రావటం చాలా శుభలక్షణం. రక్త, అరుణ, నీల, పీత వర్ణాలంకార స్త్రీలు దగ్గరికి వస్తే చాలా ప్రమాదం. నూనె పూసుకున్నట్లు, జుట్టు విరబోసుకొన్నట్లు కలవస్తే అశుభం.

అంధుడు, కుబ్జుడు, బధిరుడు, మలినాంబరుడు, దుర్వచనుడూ కనిపిస్తే దోషం, అశోకము, కరవీరము, పలాశము కనిపించటం మంచిదికాదు. గాడిదను గాని, దున్నపోతునుగాని, ఒంటెనుగాని ఎక్కినట్లు, దక్షిణాభిముఖుడై పోతున్నట్లు కలవస్తే మూడునెలల్లో ఆయువు తీరినట్లు లెక్క. వికృతాకారులైన నల్లని సాయుధులు బాధిస్తున్నట్లు. రాళ్ళతో కొడుతున్నట్లు కలగంటేవాడు మృత్యువశుడని అర్థం.

ఇటువంటివన్నీ గమనించి తనకు శుభసూచకమైన మంత్రాన్ని స్వీకరించాలి సాధకుడు. జపదీక్షా సమయంలో అప్పుడప్పుడు దేవతాదర్శనం కావటం జరుగుతూ వుంటుంది. ఒక ప్రధాన విషయం గమనించవలసింది ఏమిటంటే కలలు లక్షరకాలు రావచ్చు. వాటికి ఫలితమేమీ లేకపోవచ్చు. కాని దేవతలు వాళ్ళ అనుగ్రహం లేక మానవుని కలలోకి ఊరకవచ్చి కనిపించటం వుండదు. కలలో ఏదైనా దేవత కనిపిస్తే దానికేదో ఒక విశిష్టమైన అర్థం వుండి తీరుతుంది.

మంత్రోపాసకులు ధ్యానములో దేవతలను నిలుపుకొని దివ్యదృష్టిని అభివృద్ధి పరచుకొని త్రికాల విషయాలు తెలుసుకునే, దశ రావటానికి ఎంతో తపస్సు చేయాలి. అంతకంటే సులభంగా స్వప్న విద్యవల్ల భూతభవిష్య ద్వర్తమానాది విశేషాలు తెలుసుకోవచ్చు. తంత్రగ్రంధాలలో వాటిని గూర్చి ఎంతో గొప్పగా చెప్పబడింది.

మంత్ర మహోదధిలో స్వప్నేశ్వరి అనే ఒక దేవత గూర్చి ప్రస్తావించబడింది. ఉపమన్యుడు దానిని దర్శించిన ఋషి. ఆ మంత్రం లక్షసార్లు జపంచేసి బిల్వపత్రాలతో హోమం దశాంశం చేయాలి. ఆ తర్వాత ఏ విషయాన్ని గురించైనా తెలుసుకోవాలనుకొన్నప్పుడు రాత్రివేళ పదివేలు జపంచేసి ఉపవాస నియమంతో భూశయనం చేస్తే వరాభయ పద్మయుగ హస్త, సితాంబర, శరచ్చంద్ర సమాన కాంతిగల స్వప్నేశ్వరి దర్శనమిచ్చి భక్తుని సందేహాన్ని తీరుస్తుంది.

యోగినీ తంత్రంలో స్వప్నావతివంటి విద్యలు, యక్షిణీతంత్రలో స్వప్న చండి వంటివి చెప్పబడినవి. మంత్ర మహార్ణవంలో ఒక విచిత్రమైన విద్యవుంది. కాలి అధిదేవతగాగల మంత్రమిది. ఆ స్వప్నదేవత మామూలుగా శుభాశుభములు చెప్పటంతో ఊరుకోదు. ఏమనిషికైనా సరే కలలో ఏరూపంతో కనిపించమంటే ఆ రూపంతో కనిపించి, ఏమి చెప్పి రమ్మంటే అది చెప్పి వస్తుంది. అది ఒక విచిత్ర ప్రయోగవిద్య అన్నమాట. ఉదాహరణకు ఒక అధికారో, ధనవంతుడో వున్నాడనుకోండి. వానివల్ల ఒక పనికావాలి. ఈ మంత్రవిద్యా సాధకుడు అతడి

మీద ఈ స్వప్న ప్రయోగం చేస్తాడు. అది వెళ్ళి ఆ వ్యక్తి కలలో వాడి ఇష్టదేవతలాగా కనిపించి ఫలానావ్యక్తికి ఫలానా పనిచెయ్యి అని ఆదేశిస్తుంది. వాడు తన ఇష్టదేవత చెప్పింది కాబోలనుకొని చేస్తాడు.

సుప్రసిద్ధమైన స్వప్నవిద్యలలో స్వప్న వారాహి చాలా ప్రముఖమైనది. ఇది ప్రధానంగా వశీకరణ దేవత.

**"ఉచ్యతే స్వప్న వారాహీ జనతా వశకారిణీ"** అని మంత్రరత్నాకరం ఆ విద్యను గొప్ప వశ్యతంత్రంగా అభివర్ణిస్తుంది. కృష్ణపక్షపు అష్టమినాడు గాని, చతుర్దశినాడుగాని చతుష్పథమునుండి, నది రెండు ఒడ్డులనుండి, కుమ్మరి ఆవమునుండి మట్టి తెచ్చి వుమ్మెత్తరసంతో కలిపి బొమ్మ చెయ్యాలి. ఎవరి మీద ప్రయోగంచేయాలో వాడిపేరుతో ఆ బొమ్మకు ప్రాణప్రతిష్ఠ చెయ్యాలి. చనిపోయిన తర్వాత శవంమీద కప్పిన గుడ్డముక్కను సంపాదించి దానిమీద శవాన్నికాల్చిన బొగ్గుతో స్వప్నవారాహీ ప్రయోగ యంత్రాన్ని వుంచి రాత్రివేళ ఒంటరిగా జపంచేయాలి. అప్పుడు రాజైనా, వాడి తాతైనా వశంకాక తప్పదని ప్రాజ్ఞుల వచనం. భవిష్యత్తు తెలుసుకోవాలనుకొన్నప్పుడు మంత్రజపం చేసి ఒంటరిగా, ఇతరులు లేనిచోట శయనిస్తే స్వప్నవారాహి వచ్చి సత్యం చెపుతుంది.

ఇటువంటివి ప్రత్యేకంగా స్వప్నదేవతలు, వాటి విశేషాలు. సామాన్యంగా సాధకులు తాము ఉపాసించే దేవతలనే కొన్ని అక్షరాలను మంత్రంలో కలుపుకోవటం ద్వారా, కొన్ని ప్రత్యేక వస్తువులతో హోమం చేయటం ద్వారా కలలో కనిపించి శుభాశుభములను చెప్పేలా చేసుకోవచ్చు.

# శ్మశాన సాధనలు

లౌకికంగా గాని అలౌకికంగా గాని ఏదైనా సాధనచేసి ఒక విశేషాన్ని నిరూపించాలంటే శాస్త్రజ్ఞుడికి పరిశోధనాగారం (లేబొరేటరీ) కావాలి. అక్కడ దానికి కావలసిన పరికరాలుండాలి. అప్పుడు నిపుణుడైన శాస్త్రవేత్త తాను తలపెట్టిన ప్రయోగాన్ని విజయవంతం చేయగలుగుతాడు, సాత్వికుడు, శౌచప్రధానుడూ అయిన దక్షిణాచార మార్గ సాధకునికి దేవాలయాలు, సిద్ధక్షేత్రాలు, ఋష్యాశ్రమాలు, మహనీయుల సన్నిధానాలు సిద్ధికి అనుకూలమైన స్థానాలు. వామాచార మార్గసాధకునికి కావలసినవి వేరు.

శ్లో ॥ శూన్యాగారే నదీతీరే పర్వతే నిర్జనేతథా
బిల్వమూలే శ్మశానేవా తత్సమీపే వనస్థలే.

ఎవరూ నివసించని యిండ్లు, పాడుబడిన కొంపలు, నిర్జనములైన నదీతీరాలు, పర్వతసీమలు, బిల్వవృక్షము మొదలు, శ్మశానము, దానికి దగ్గర వనములు, అనువైన ప్రదేశాలు, ఇవేకాక అశ్వత్థ, విభీతక, వటాదివృక్షములు కూడా పనికివస్తవి.

ఆయా మార్గాలలో సాధనచేసి సిద్ధులై గతించిన వ్యక్తుల సమాధులుకూడ ఎంతో ఉపయోగిస్తవి. వామాచారంలో శ్మశానం అత్యుత్తమ సిద్ధిప్రదాయకమైన స్థానము. దాన్ని మించినది లేదు. **"శ్మశానేతు పురశ్చర్యా కథితా భువి దుర్లభా"** శ్మశానంలో పురశ్చర్య చేయటం చాలా దుర్లభం. ఆ అవకాశమే దొరికితే ఇంక అంతకంటే కావలసింది లేదని తాంత్రికుల విశ్వాసము, అనుభవము.

ఈ తీవ్రసాధనల విశేషాలు వ్రాయటం కౌలశాస్త్ర విశేషాలు పరిశోధన దృష్టితో తెలియజేయటం కోసమే కాని వీటిని చదివి ప్రయోగాలకు దిగటం ప్రశస్తము కాదని సూచిస్తూ ఆ వివరాలు కొన్ని అందిస్తున్నాను. శ్మశానములో కౌల సాధకునికి కావలసిన ఉపకరణాలన్నీ లభిస్తవి. ఆసనాదులకు పూజలకు అనేక విధములైన శవములు కావలసి ఉంటుంది. అర్ఘ్యపాద్యాదులకు, తీర్థప్రసాదాలకు, దీపారోహణకు కపాలములు కావాలి. జపమాలికలు అస్థికలు కావాలి. ఇవన్నీ ఇతర ప్రదేశాలలో దొరకటం కష్టం కనుక కౌలిక పురశ్చర్యకు శ్మశానము తప్పనిసరి. ఇంక మరీ కుదరకపోతే ఆ వస్తువులన్నీ ఒక ఏకాంత రహస్య ప్రదేశంలో చేర్చి శ్మశాన సమానముగా తయారుచెయ్యాలి.

శ్లో ॥ భౌమవారే తమిస్రాయాం యామే యాతేచ సాధకః
కృష్ణపక్షే విశేషణ సాధయేచ్చసమాహితం

రాత్రి ఒక జాము గడిచిన తరువాత మంగళవారము నాడు శ్మశానములోనికి వెళ్ళవలెను. శుక్లపక్షముకంటె కృష్ణపక్షము అందులోను అష్టమి నుండి చతుర్దశి వరకు విశేషసిద్ధి దాయకమైన సమయములు, అక్కడికి వెళ్ళేటప్పుడు మాంసముతో కూడిన అన్నమును కాని, రక్తాన్నమును కాని, ఇతర నైవైద్యములతో పాటు తీసికొనివెళ్ళాలి. స్వయంగా జంతు హింస చెయ్యనివాడు కూడ వీటిని సాధించి దగ్గరుంచుకోవాలి. జంతువులను చంపటానికి అభ్యంతరం లేనివాడు

మేకనుగాని, మహిషమునుగాని ఆయా తంత్రములలో చెప్పబడిన జంతువునుగాని తీసికెళ్ళి ఏదైనా ఒక చితియొక్క పశ్చిమభాగమున కూర్చుండాలి.

**శ్లో ॥ చితాయాః పశ్చిమేభాగే ఉపవిశ్య స్థిరః శుచిః**
**తదాపిచ బలిం దద్యాత్ మహిషంఛా గమేవవా**
**రుధిరం జల సైంధవ శర్కరా మధు సంయుతం**
**నివేద్యరుధిరంవీరః శిరోదద్యాత్ సదీపకం**
**ఛాగ మహిష మేషాణాం చతుర్దిక్షు శవాన్‌క్షిపేత్.**

కౌళావళీ నిర్ణయంలో ఇలా చెప్పబడింది. చితికి పడమట కూర్చొని తాను తెచ్చిన జంతువును స్వయంగా నరికి బలియిచ్చి ఆ నెత్తురును అచట వెదజల్లి శిరస్సును నివేదనం చెయ్యాలి. ఆ తలమీద దీపం వెలిగించటం ఒక ఆచారం. ఆ విధంగా జంతువులను మేక, గొర్రె మొదలైన వాటిని ఖండించి ఆ శవములను నాలుగువైపులా పడవెయ్యాలి. మహాకాళ ప్రణీతమైన కర్పూరాంబా స్తోత్రములో ఈ బలిని గూర్చి మరికొన్ని విషయాలు కూడ చెప్పబడింది.

**శ్లో ॥ సలో మాస్థిస్వైరం పలలమపి మార్జారమసితే**
**పరం చోష్ట్రం మేషం నరమహిషయో శ్ఛాగమపివా**
**బలిం తే పూజాయామపి వితరతాం గోత్రవసతాం**
**సతాం సిద్ధి స్సర్వా ప్రతిపదమపూర్వా ప్రభవతి.**

మేక, గొర్రె, దున్న కాక ఒంటె, పిల్లి, మనిషి మొదలైన వాటిని కూడా బలులుగా ఇవ్వటం ఇటువంటి తంత్రవిధానాలలో గోచరిస్తుంది.

అప్పుడప్పుడు మనం కార్యసిద్ధి కోసం నరబలి యిచ్చినట్లు, వాళ్ళను రక్షకభటులు పట్టుకున్నట్లు పత్రికలలో చదువుతూ ఉంటాం. జంతుబలి, నరబలి ప్రభుత్వముచేత నిషేధింపబడింది. ధర్మశాస్త్రముల ప్రకారం కూడా అవి మహాపాపాలు, అందులో నరబలి ఘోరపాతకం. అయితే ఈ సాధకులంతా ఆయా బలులు ఇవ్వటంవల్ల అద్భుతసిద్ధులు లభిస్తవన్న నమ్మకంతోనే ఆ పని చేస్తూంటారు. వార్తలలో వచ్చినంతవరకు, వారి సాధనలు నిష్ఫలమై వారు జైలు పాలైన సందర్భాలే పత్రికల కెక్కుతూ వుంటవి.

ఇక్కడ బలియొక్క అంతరార్థం తెలుసుకోవటం కొంత అవసరం. సాధకులు కేవలము జపంచేతనే మంత్రంలో జీవశక్తి పుట్టించలేనప్పుడు జీవశక్తి కలిగిన

పదార్థాలను ఛేదించటం ద్వారా మంత్రప్రేరణతో ప్రకృతిలోని ఆ ప్రాణశక్తిని తన మంత్రమున కావహింపజేసి దానిద్వారా అధికశక్తిని సంపాదిస్తారు. మామూలుగా చేసే పూజలలో కొబ్బరికాయలో అటువంటి శక్తివున్నది. మంత్రాన్ని ఉచ్చరిస్తూ దేవతను స్మరిస్తూ దానిని పగులగొట్టితే దానిలోని జీవశక్తి మంత్రమునకు సంక్రమించి దానిద్వారా సాధకునకు శీఘ్రఫలితాన్నిస్తుంది. నారికేళం కంటే గుమ్మడికాయ ఎక్కువ జీవశక్తి కలిగింది. కూష్మాండబలిచేత జంతుబలి యిచ్చినంత లేదా అంతకంటే ఎక్కువఫలితం పొందవచ్చునని చండీతంత్రం చెబుతుంది. దక్షిణాచారంలో దీనిని మించిన బలిద్రవ్యం మరొకటిలేదు. పసుపు లేక కుంకుమ కలిపిన అన్నం రక్తాన్నమునకు బదులుగా శౌచమార్గంలో వాడతారు. తీవ్రమైన బలులు యిచ్చేవారు ముందు మంత్రపురశ్చరణ బాగాచేసి వుండాలి. తమ మంత్రములోని వశీకరణ శక్తిచేత బలివస్తువులోని జీవము ఆకర్షింపబడాలి. అప్పుడే ఆ బలి పూర్ణసిద్ధిని యిస్తుంది. దేవతాప్రీతి లభిస్తుంది.

బలియిచ్చిన తరువాత కులసాధకుడు తన ఆసనానికి, జపసాధనానికి ఒక శవాన్ని తెచ్చుకోవాలిట. ఆ శవస్వరూపం యిలా చెప్పబడింది.

**శ్లో ॥ యష్టివిద్ధం శూలవిద్ధం ఖడ్గవిద్ధం వయోమృతం**
**వజ్రవిద్ధం సర్పవిద్ధం చండాలం వాతి భూతకం**
**తరుణం సుందరం శూరం రణే నష్టం సముజ్జ్వలమ్**
**గృహీత్వా మూలమంత్రేణ పూజాస్థానే సమానయేత్**

కఱ్ఱ, కత్తి, శూలము, పాము మొదలైన వానిచే మరణించిన తరుణుడగు సుందరుని శవము మేలు. దానిని మూలమంత్రము నుచ్చరించుచు పూజాస్థానమునుకు తీసికొని రావలెను. ఏడెనిమిది నెలల గర్భవతి కడుపులోని పిండముగాని, నెలలు నిండిన లేక రెండు లేక ఐదు సంవత్సరాల వయస్సుగల బాలుని శవముగాని మేల్తరము. అది సర్వసిద్ధి ఫలప్రదమని వామాచార గ్రంథములు ఘోషించుచున్నవి.

శవమునకు ధూపమువేసి, గంధముపూసి, ఉపచారములు చేసి సుగంధ ద్రవ్యములతో కూడిన తాంబూలమును దాని నోటిలో నుంచి అధోముఖముగా దానిని స్థాపించి దిగంబరుడై దానిపై కూర్చుండి జపించవలయును. మారేడుచెట్టు క్రింద ఈ పనిచేసినచో మరింత ప్రశస్తమని చెప్పబడినది. జపానంతరము **"శవాదికం జలేక్షిప్త్వా గృహంగచ్ఛేత్ యథాసుఖం"** అని చెప్పబడుటచే శవమును

నీటిలో పడవేసి పోవలెను. మరియొకచోట చితాభస్మధారియై జుట్టు విరబోసుకొని కపాల ఖడ్గములు ధరించి వివసనుడై జపింపవలెనని చెప్పబడింది.

శ్లో ॥ నిశాయాం మృతహట్టేచ ఉన్మత్తానంద భైరవః
దిగ్వాసా విమలీ భస్మభూషణో ముక్తకేశకః
కపాలీ ఖడ్గహస్తశ్చ జపే న్మాతృకయో సుధీః

ఈ విధంగా కూర్చొని చేసే జపమూ, పూజా భయంకరమైనవని వేరే చెప్పాల్సిన పనిలేదు. ఇక్కడ చేసే పూజ ప్రతిదీ ఒక ప్రత్యేకమైన లక్షణం కలిగిందే. రక్తమాంసాదులతోపాటు అర్చనకై సాధకుడు తన వీర్యాన్ని కూడా ఉపయోగించాలని కాళీతంత్రం చెపుతున్నది.

శ్లో ॥ శ్మశానస్థ స్స్వస్థో గళితచికురో దిక్పటధర
స్సహస్రం త్వర్కాణాం నిజగలితవీర్యేణ కుసుమమ్
జపం స్త్వాం ప్రత్యేకం మనుమపి తవధ్యాన నిరతో
మహాకాళి స్వైరం స భవతి ధరిత్రీ పరిబృఢః

తెల్లజిల్లేడు పూలను, అప్పుడే తీసిన తన శుక్లముతో అద్దుచు మంత్రోచ్చారణ సహితముగా వేయిసార్లు మహాకాళిని పూజించినవాడు మహారాజగునని దాని భావము. కాళి, తార, ఛిన్నమస్త, భైరవి, కర్ణపిశాచి, బేతాళుడు, భైరవుడు మొదలైన దేవతల ఉపాసనలు శ్మశానము నందు సిద్ధిస్తవి. శ్మశానానికే రుద్రభూమి అని మరొక పేరుకూడా ఉన్నది. లయకారకుడైన రుద్రుడాప్రదేశమున కధిష్ఠానదేవత. కనుక రుద్రమంత్రం అక్కడ సిద్ధించే వాటిలో ప్రధానమైనది. విక్రమార్కుడు సాధించిన భేతాళసిద్ధి శ్మశానంలోనే అన్న సంగతి గుర్తుంచుకోవాలి. కధాసరిత్సాగరంలో భేతాళ సాధనయొక్క గొప్పతనం ఎంతో అద్భుతంగా వర్ణించబడింది. సామాన్యంగా ఆరునెలలు నిరాఘాటంగా సాధనచేస్తే భేతాళ లూకి ఖడ్గ ఫేత్కారిణ్యాది సిద్ధులను పొందవచ్చునని తంత్రగ్రంధాలు చెబుతున్నాయి. లూకీవిద్య అంటే కంటికి కనిపించకుండా అదృశ్యుడుకావటం. ఖడ్గవిద్యను గురించికూడా ఆశ్చర్యకరమైన శ్మశాన ప్రక్రియ చెప్పబడింది.

శ్లో ॥ అధవక్ష్యే ఖడ్గసిద్ధిం సాధకానాం హితాయవై
అష్టలోహం సమాదాయ పంచాశదంగుళం మతం
కృత్వా తత్ర మూలమంత్రం లిఖిత్వా ప్రజపేన్మనుం

తత్సహస్రం తతో హుత్వా మహాశవ కలేబరే
ఖనిత్వాజీవ వృక్షాగ్రే బద్ధ్వాశుష్కంతు కారయేత్
కులాష్టమ్యా మర్ధరాత్రే చితామధ్యే సమాహితః
ప్రీతిపూర్వం సమామంత్ర్య హువే త్ప్రిత్రృవనేతతః
పాదాది మూర్ధపర్యన్తం హోమాన్తే బలిమాహరేత్
తతఏవం సమామంత్ర్య యముద్దిశ్య క్షిపేన్నరః
ఛిత్వాఛిత్వా పునశ్ఛిత్వా గతో ప్యాకృష్యతేపునః

అష్టలోహాలతో 50 అంగుళముల పొడవు కత్తిని చేయించి దానిమీద ఖడ్గమంత్రంరాసి జపంచేసి ఒకవెయ్యి హోమం చెయ్యాలి. తరువాత ఆ కత్తిని ఒక ప్రేత కళేబరంలో పెట్టి ఆ కళేబరాన్ని ఒక చెట్టుకొమ్మకు కట్టి అది ఎండిపొయ్యేదాకా అక్కడేవుంచాలి. కృష్ణాష్టమినాటి అర్ధరాత్రి శ్మశానంలో చితాగ్నిలో ఆ శవాన్ని కాలినుండి తలదాకా వివిధావయవాలు మంత్ర సహితంగా హోమంచెయ్యాలి. బలి సమర్పించి ఆ ఖడ్గాన్ని స్వీకరిస్తే అదిఎవరిని చంపిరమ్మంటే వారిని చంపి వస్తూ వుంటుందట . . .

అలానే పాదుకాసిద్ధి అనే ఒక ప్రక్రియకూడా దూరదేశగమనం కోసం చెప్పబడింది. దానివల్ల ఎంత దూరమైనా రెప్పపాటుకాలంలో వెళ్ళవచ్చునట!

శ్లో ॥ బిల్వవృక్షోద్భవం కాష్ఠం శ్మశానేసాధకోత్తమః
భౌమవారే మధ్యరాత్రే గత్వా కులయుగాన్వితః
ఖనిత్వాకాష్ఠం లక్షంవై జపే న్మహిషమర్దినీం
కాష్ఠముద్ధృత్యతేనైవ దండం పాదుకచిహ్నితం
కృత్వా దుర్గాష్టమీరాత్రే శ్మశానే నిక్షిపేత్తదా
తస్యోపరి శవంకృత్వా నిజదేవీం ప్రపూజ్యచ
శవాసనగతో వీరో జపే దష్టసహస్రకం
తతో మాతృబలిం దద్యాత్ కాష్ఠమామంత్రయేత్తతః
తత్పాదస్పర్శమాత్రేణ సయాతి శతయోజనం
ఏకమామంత్ర్యపాదుకాం దద్యాత్ పాదతలే తతః
యత్రేచ్ఛావర్తతేతస్య తత్రగచ్ఛేద్యథాసుఖం

మారేడుచెక్క తెచ్చి మంగళవారం అర్ధరాత్రి శ్మశానంలో పాతి సాధకుడు

మహిషమర్దినీ మంత్రం లక్షజపంచేయాలి. తర్వాత ఆ కాష్ఠాన్ని తీసి దానిపై పాదుకచిహ్నం చెయ్యాలి. దుర్గాష్టమిరాత్రి దాన్ని శ్మశానంలో పూడ్చి, దానిపై శవం వుంచి దేవీపూజ చేసి శవాసనగతుడై ఎనిమిదివేలు జపం చెయ్యాలి. పిదప బలి సమర్పించి ఆ పాదుక ఎక్కిఎక్కడికి తీసుకెళ్ళమంటే అక్కడకు క్షణకాలంలో తీసుకెళుతుందనీ,సాధకుడు స్వేచ్ఛాసంచారియై ఆనందించగలడనీ తంత్రశాస్త్ర ప్రవచనం.

మనుచరిత్రలో సిద్ధుడు పాదలేప ప్రభావముచేత నాలుగుదిక్కులూ చుట్టి వచ్చాడు. ఈ పాదుక అటువంటి పద్ధతులలో ఒకటి.

ఈ పాదుకా, ఖడ్గాది సిద్ధులలో గమనించవలసిన మూలసూత్రం ఒకటి వుంది. దానికి ఉపయోగించబడిన శవమునకు సంబంధించిన ప్రేతాత్మ సాధకుని మంత్రశక్తిచేత ఖడ్గమును, పాదుకను ఆవేశించి ఆయా పనులు చేస్తుందనేది గ్రహించాలి.

ఫేత్కారిణి మొదలైనవి కూడా ఇటువంటి శవసిద్ధులే. శ్మశాన సాధనలే. శ్మశానంలో సాధన చేయటానికి వీలుకాని స్థితి ఏర్పడినపుడు శవాన్ని రహస్యంగా ఇంటికి తెచ్చుకొని పూడ్చిపెట్టి దానిపై కూర్చొని జపపూజాదులు చేయవలసినదిగా కులశాస్త్రములు నిర్దేశిస్తున్నవి.

శ్లో ॥ **శవమానీయతద్వారి తత్రైవపరిఖన్యచ . . .**
**కుజేవాశనివారేవా నరముండం సమాహితః**
**పంచగవ్యేన మిలితం చందనాద్యై ర్విలేపితం**
**నిక్షిప్యభూమౌహస్తార్ధమానతః కాననాంతరే.**

మంగళవారంగాని శనివారంగాని నరశిరస్సు తెచ్చి చందనాదులతో అలంకరించి జేనెడు లోతుగా నేలలో పూడ్చి దానిపై కూర్చుండి జపం చేయవచ్చునట ! అదీ కుదరనప్పుడు త్రికపాల, పంచకపాలముల నుపయోగించమని యోగినీతంత్రం సూచిస్తున్నది. శవాలు దొరకటం కష్టం. దొరికినా బయటపడితే ప్రమాదం. కనుక కపాలాసనమయితే రహస్యగోపనం సులభం. అన్నీ మనుష్యకపాలాలే అయినా ఫరవాలేదు. లేదా ఒకటి నరకపాలమూ, మిగతావి నిర్దిష్ట జంతుకపాలాలు ఉపయోగించవచ్చు. సుప్రసిద్ధ సిద్ధపురుషులైన రామప్రసాద్, రామకృష్ణపరమహంస కపాలాసనాల మీద జపించి సిద్ధులు సాధించినట్లు వారి

జీవితచరిత్రలనుబట్టి తెలుస్తున్నది.

పుర్రెలవలెనే ఎముకలతో చేసిన పూసలను మాలికగా గ్రుచ్చి జపానికి వినియోగించటంవల్ల మంత్రసిద్ధి వేగముగా లభించే అవకాశము ఉంది. ఎవరి ఎవరి ఎముకలను సాధనకు ఉపయోగిస్తారో వారి గుణములు ఆ అస్థులకు సంక్రమించి ఆయా గుణాలను శక్తులుగా సాధకులకు ప్రసాదిస్తుంటవి. పవిత్రమైన రామకృష్ణపరమహంస అస్థికలను కడిగిన జలం తీర్థంగా ఉపయోగించి అనివార్య బాధలను వివేకానందస్వామి నివారించుకొనినట్లు మనం చదివాము. ఎముకలను వివిధ ప్రయోగాలకు అభిమంత్రించి ఉపయోగించటం మాంత్రికులకు సర్వసామాన్యమైన అంశం.

ఎముకలవలెనే శవము కాల్చిన బూడిద కూడ అనేక సాధనలకు పనికివస్తుందని తంత్రగ్రంథాలు నొక్కివక్కాణిస్తున్నవి. చితాభస్మధారియైనవాడు అష్టసిద్ధులను సునాయాసంగా సాధించవచ్చునట. చితాభస్మంతో రక్తాదులు కలిపి బొమ్మలు తయారుచేసి ప్రాణప్రతిష్ఠచేసి పూజచేయటం ప్రయోగవిధానాలలో చాలా ప్రాచుర్యం చెందింది.

అభిమంత్రించిన శవపు బూడిదను ఇండ్లపై చల్లి వివిధమైన ప్రయోగాలు చేయటం క్షుద్రమాంత్రికులకు సాధారణమైన పని.

శ్మశానవస్తువులనన్నింటినీ ప్రేతశక్తులు ఆవహించిఉంటవి. వాటి స్పర్శ చాలా ప్రమాదకరం. కనుకనే మన ప్రాచీనులు శవాన్ని తాకినా, చూచినా, శ్మశానానికి వెళ్ళి వచ్చినా సచేల స్నానం చేసి దేవదర్శనం చేసుకొని, దోషపరిహారం పొంది, అశుచిస్పర్శ వదిలించుకొని ఇంటిలో ప్రవేశిస్తారు.

మరి వామాచారపరులకు శ్మశానమే సర్వసిద్ధి సంధాయకమైన క్షేత్రం. అయితే ఆ సాధనలు చేసేవారు సాహసులు, ధీరులు, నిశ్చలులు, స్థిరచిత్తులు అయివుండాలి. కాకపోతే ఉన్మత్తులై ప్రాణాలు పోగొట్టుకొనే ప్రమాదం క్షణక్షణమూ వుంటుంది.

# శవములు - సమాధులు

శ్మశాన శవసాధనలను గూర్చి ముందు కొంత ప్రస్తావింపబడింది. శవములను జాగ్రత్తగా నిలువచేసుకొని రాత్రివేళ వానియందు భేతాళుని ఆవహింపజేసి అతనిచేత కావలసిన పనులు చేయించుకోవటం ప్రాచీన గాథల్లో చాలాచోట్ల కనిపిస్తుంది. శవాన్ని ఎక్కి దూరప్రదేశాలకు ప్రయాణం చేయటం కూడా అక్కడక్కడ వర్ణించబడింది. మంత్రసాధనచేత వశుడైన భేతాళుడు మనుష్య శవాన్ని ఆవేశించి మహాకార్యములు చేసిపెట్టటం అసహజమైన సంగతికాదు.

శవాలను పసరులు పూసి తైలములు పూసి నిలువ ఉంచే విద్య రామాయణ కాలంనించే మనకు తెలిసినట్లు కనిపిస్తుంది. భరతుడు వచ్చినదాకా దశరధుని శవాన్ని తైలద్రోణిలో వుంచి శిధిలం కాకుండా జాగ్రత్తపరచిన విషయము రామాయణంలో వుంది సరే ! ఇక ఈజిప్టు దేశంలోని మమ్మీలు జగత్ప్రసిద్ధమైనవి. చచ్చిన మనుష్యుల శరీరాలను కుంచింపజేసి తైలములుపూసి వేల సంవత్సరాలు నిలువచేయటం చాలా ఆశ్చర్యకరమైన ప్రక్రియ. **"రహస్య ఈజిప్టులో అన్వేషణ"** అనే గ్రంథంలో ఈ విశేషాలు ప్రస్తావిస్తూ పాల్‌బ్రంటన్ మహాశయుడు ఆ శవాలను పిశాచశక్తులు ఆవహించివున్నవని, వీటికి స్థానభ్రంశం కలిగిస్తే సహించవనీ, దేశదేశాలకు ఆ మమ్మీలను పంపటంవల్ల ప్రపంచంలో భూతప్రేత ప్రేరితమైన కల్లోలాలు విజృంభించగలవని ఒక సిద్ధుని హెచ్చరికను వినిపించాడు.

సాధారణంగా ఎవరి శరీరంమీద వారికి ప్రేమ వుంటుంది. మరణవేళ శరీరాన్ని విడిచిపెట్టటానికి జీవుడు చాలా వేదన చెందుతాడు. తప్పనిసరి పరిస్థితులలో దేహాన్ని విడిచిపెట్టినా దానిమీది మమకారం పోదు. ఆ మమకారం నశించి జీవుడూర్ధ్వగతులకు పోవాలనే సదుద్దేశంతో భారతీయులు దహన సంస్కారం చేయటానికి ప్రాధాన్యం ఇస్తారు. అగ్ని సంస్కారం అయిపోయిన తర్వాత చితాభస్మాన్ని, ఎముకలను పవిత్రనదులలో కలపటంతో ఈ లోకం మీది అనుబంధం నశించి జీవుడు తన కర్మానుభవానికి ఇతర లోకాలకు వెళ్ళిపోతాడు.

శరీరం ఇక్కడే వుంటే జీవుడు దాన్ని పట్టుకొని వేళ్ళాడుతూ వుంటాడు. అంటే ప్రేతత్వ విముక్తి జరగదన్నమాట. ఆ శరీరాన్ని స్వాధీనం చేసుకొని ఏ మాంత్రికుడో తన తాంత్రిక సాధనల శక్తితో ఈ శవానికి సంబంధించిన జీవుడ్ని

వశం చేసుకొని తన సేవకునిగా ఉపయోగించుకొంటాడు. అందుచేత జీవుని విముక్తికి దహనసంస్కార మంతటి మంచి ఆచారం మరొకటిలేదు.

సన్యాసులు, మహనీయులు మరణించినప్పుడు వారు ఈ శరీర భావనకు అతీతమైన ముక్తస్థితిని జీవించి వుండగానే పొంది వుంటారు గనుక ఈ పాంచభౌతిక బంధాలు వారినంటవు. వారి శరీరాలు పవిత్రమైనవి కాబట్టి వానిని దేవతా విగ్రహాలతో సమానంగా భావించి పూడ్చి, సమాధి కట్టి, నిత్యపూజలు చేస్తారు. సన్యాసులైతే వాటిపై నర్మద బాణం పెట్టుతారు. రమణమహర్షి తన తల్లి అవసానదశకు రాగా ఆమె కర్మబంధాలను తన యోగశక్తిచే హరించి మరణానంతరం ఆమె అవశేషాల మీద శివలింగాన్ని స్థాపించి దానికి మాతృభూతేశ్వరుడని నామకరణం చేశాడు. భక్తుల కది ఆరాధ్యస్థలమైంది. అటువంటి వ్యక్తులు దేవత్వాన్ని పొందారని అర్థంచేసుకోవాలి. తరువాతికాలంలో రమణమహర్షి సమాధి కూడా అదేవిధంగా ప్రసిద్ధిచెందింది. దాని సన్నిధిలో ఎందరో భక్తులు దివ్యానుభవాలు పొందినట్లు నిరూపణలున్నవి. ప్రసిద్ధ పాత్రికేయుడు కీ.శే. కె.సభా మొదట నాస్తికుడై గుడిపాటి వెంకటాచలంగారి సలహాతో మహర్షి సమాధి దగ్గర కాసేపు కూర్చొని తనలో వచ్చిన అనుకోని మార్పుకు భ్రాంతుడై, అక్కడినుంచి వెళ్ళిపోయి తరువాత, తన భార్యను మహర్షి ఆవేశించటమూ, ఆమె రోగంనుంచి విముక్తురాలై జీవించటమూ మొదలైన విశేషాలతో ఒక వ్యాసం ప్రచురించారు. ఎందరో బాబాల,యోగుల,సన్యాసుల సమాధులు ఆర్తులకాపదలు తొలగిస్తూ, ఇష్టకామ్యాలను ప్రసాదిస్తూ వుండటం జగద్విదితం.

మంత్రాలయంలోని రాఘవేంద్రస్వామి సమాధి ప్రపంచ విఖ్యాతమైనది. వేల లక్షల భక్తులు అక్కడికివెళ్ళి ఉపయోగాన్ని పొందుతూ మానసికోన్నతిని కూడా పొందుతూఉండటం విశేషం.

ఆ సమాధుల దగ్గర,గోరీల దగ్గర అనేకరాత్రులు ఉపవసించి, శయనించి, ధ్యానించి ఆయా సిద్ధపురుషుల అనుగ్రహాన్ని భక్తులు పొందుతూ వుంటారు. ఆ విధంగా మహాత్ముల సమాధులు ప్రజలకు ప్రయోజనకరంగా భాసిస్తున్నవి. ఇంతకూ ఇక్కడ గమనించాల్సిన విషయమేమిటంటే శరీరావశేషాల నాశ్రయించి ఆయా జీవులుంటారని. వారు సిద్ధులైతే ఆశ్రితులకు ఉపకారాలు చేస్తారు. లేక సామాన్యులైతే ఏమీ చేయరు, దైవత్వము, సిద్ధత్వము పొందినవారి సంగతి వదిలేసి ఇతరుల

సంగతి తీసుకుంటే ఆవిధంగా తమ శవాలనో, వాటిలో మిగిలిన ఎముకలనో పట్టుకొని వుండటం జీవుడికి మంచిదికాదు. సుఖకరమైన స్థితికాదు. దేహంలేని స్థితికి బాధపడుతూ, ఏ దేహమైనా ప్రవేశించటానికి దొరుకుతుందేమో అనే ఆశతో అంతరిక్షంలో తిరుగుతూ క్షుత్పిపాసలచేత కామ క్రోధ మోహముల చేత పీడించబడుతూ వుండే ఆదశ మానవులు కోరుకోదగినదికాదు. కాని తప్పనిసరి పరిస్థితిలో ఆవిధంగా మృతజీవులు బాధపడుతూ వుంటారు.

శవంలోనించి జీవుడు బయటికి వెళ్ళిపోయినా అవశేషాలైన ఎముకలు, కాలగా మిగిలిన బూడిద, పూడ్చబడితే మాంస రక్తభాగాలు జీవుని గుణాలను కొన్నింటిని పుణికి పుచ్చుకొన్నట్లే శవాన్ని అంటుకొని ఒక అదృశ్యకాంతివలయం వుంటుంది. మానవునిలోని సత్వ రజ స్తమో గుణాలకు చిహ్నామై అతడి వ్యక్తిత్వాన్ని తెలిపే ఈ తేజోవలయం శరీరాన్ని ఆవరించి ఉంటుంది. దీని ప్రభావము వల్లనే మనుష్యులకు పరస్పరం ఆకర్షణ వికర్షణాదులు కలుగుతూ వుంటవి. ఆకర్షణశక్తి అధికంగా గలవారి తేజోవలయములో అరుణవర్ణం అధికంగా వుంటుంది. అలానే స్త్రీలు రజస్వల అయినప్పుడు ఆ వలయంలో రక్తవర్ణం ఎక్కువగా వుంటుంది. సత్వగుణాంచితులకు ఆ స్త్రీలదర్శన స్పర్శనాదులవల్ల నిర్మలమయిన వారి కాంతివలయాల మీద ఈ రక్తవర్ణ స్పర్శ ప్రభావం చూపించటం చేత కొంత అశుచిత్వం అంటుకొంటుంది. సాత్వికదేవతలను పాసించే శౌచవ్రతులందుకే రజస్వలా దర్శన స్పర్శలను పరిహరించటం. అదేవిధంగా అనేక హేతువులచేత రజస్తమో గుణముల ఆధిక్యంగల వారి సన్నిధి సాత్వికులమీద తమశక్తిని ప్రకటిస్తుంది. అందుకే వెనుకటిరోజుల్లో సత్వనిర్మలులైన వారు తమ శౌచం నిలుపుకొని ఉత్తమదైవీ లక్షణాలు పెంపొందించుకోటానికి అష్టకష్టాలు పడుతూనైనా మడియని, స్నానములనీ తాము బాధపడుతూ ఇతరులను కూడా కొంత ఇబ్బంది పెడుతూ ఉండేవారు. ఇప్పుడా ఆచారాలు చాలావరకు పోయినవి. వాటి అంతరార్థాలు గమనించేవారూ తక్కువైపోయినారు, విమర్శించేవారు, అవహేళనచేసేవారే మిగిలారు.

లండన్‌లో స్థిరపడిన టిబెట్ దేశీయుడైన డాక్టర్ ట్యూస్‌డే లోబ్‌సాంగ్ రాంపా రచించిన గ్రంథాలు ఆధ్యాత్మిక సాధకులకు సుపరిచితాలు. ఆంగ్లభాషలో అవి లక్షల ప్రతులు అమ్ముడుపోయినవి. అతడొక గ్రంథంలో ఈ శవాల తేజోవలయాలను గురించి చెప్పాడు. రాత్రివేళ శ్మశానాలలోకి వెళితే పలుచని

నీలపుకాంతిపుంజాలు సమాధులలోంచి లేచిపోతూ వుండటం చూడవచ్చుననీ, మనిషి మరణించిన తర్వాత రెండుమూడు రోజుల్లో ఇవి శరీరాన్ని విడిచిపెట్టిపోతవనీ అతడు వ్రాశాడు.

శవసాధనలో ఈ అంశానికెంతో ప్రాధాన్యం వుంది. ఒకవేళ శవానికి చెందిన జీవుడు సాధకునికి అందకుండా వెళ్ళిపోయినా ఈ తేజోవలయాన్ని మాంత్రికుడు తన మంత్రోచ్చారణ శక్తిచేత వశంచేసుకొని తన తేజోవలయముతో కలిపివేసుకోవచ్చు. దీనివల్ల మంత్రసాధకునకు అధికతరమైన తామసతేజస్సు లభిస్తుంది. ఇది భూత, ప్రేత, మానవ వశీకరణానికి ఎంతగానోఉపకరిస్తుంది. శవంమీద కూర్చుని జపం చేయటంవల్ల వచ్చే ప్రయోజనాలలో ఇది ఒకటి.

సంస్కృతంలో నైషధీయచరితము రచించిన శ్రీ హర్షమహాకవి ఈవిధంగా సాధన చేసినవాడేనని చెపుతారు. అతని తండ్రి శ్రీహీరుడు వాదంలో ఒకపండితుని చేతిలో ఓడిపోయి అతని పాదుకలను అర్చించవలసిన దుర్గతిపట్టి ఆ అవమానంతో మరణించాడట. అప్పటికి శ్రీహర్షుడు బాలుడు. అతని తల్లి, తన భర్తకు కలిగిన పరాభవానికి ప్రతీకారం తన కుమారునివల్ల తీర్చేలాచేయాలని, దానికి శవచింతామణి సాధన మొకటే శరణ్యమని ఆమె విశ్వసించి తన బిడ్డకు ఆ మంత్రం ఉపదేశించి అతడ్ని తనమీద కూర్చోపెట్టుకొని కండ్లు మూసుకొని జపం చేయమన్నదట. శ్రీహర్షు డలానే జపిస్తున్నాడు. ఆమె ఒక కత్తితో పొడుచుకొని చనిపోయిందట. అది తెలియని బాలుడు శవమైన తన తల్లిపై కూర్చుండి జపించిన ఫలితంగా శవచింతామణి మంత్రాధి దేవత ప్రత్యక్షమై అతనికి వాక్సిద్ధిని ప్రసాదించిందనీ దాని ఫలితంగా అతడు తండ్రి పరాభవానికి ప్రతిక్రియ చేశాడనీ కథ. ఈ కథలోని సత్యాసత్యాలెలా వున్నా ఆ విధమైన మంత్రసాధనల మహత్వాన్ని గుర్తించటానికి ఉపయోగపడతవి.

శవచింతామణి సాధనవలెనే కాళీతంత్రంలో కూడ అద్భుతసాధనలు చెప్పబడినవి. అసలు మహాకాళీరూపాన్ని శవంపై రతిక్రీడ సలుపుతున్న మూర్తిగా ఎలా వర్ణించారో చూడండి.

శ్లో ॥ గతాసూనాం బాహుప్రకరకృత కాంచీపరిలస
న్నితంబాం దిగ్వస్త్రాం త్రిభువనవిధాత్రీం త్రిణయనాం
శ్మశానస్థే తల్పే శవహృది మహాకాళసురత
ప్రసక్తాం త్వాం ధ్యాయన్ జపతి జడచేతా అపికవిః

మృతుల చేతులదండ మొలనూలుగా, దిగంబరియైన త్రిలోచని - కాళి - శ్మశానమందు శవహృదయముపై తన ప్రభువైన మహాకాలునితో రతిక్రీడ చేస్తున్న దృశ్యాన్ని భావిస్తూ జపించేవాడు ఎంత జడుడైనా కవి కాగలడట!

తారా, సుముఖీ, భైరవీత్యాది మంత్ర సాధనలలో శవముల కనితరమైన ప్రాధాన్యముంది. ఇటువంటి ప్రక్రియలను చేయటానికి ఈ రోజుల్లో పూనుకోవటం చట్టవిరుద్ధం కనుక నేరంక్రిందకు వస్తుంది. కాబట్టి శాస్త్రపరిశోధన దృష్టితో ఇటువంటి సాధనలను ప్రాచీనులు చేసేవారు అని మాత్రం తెలుసుకొని ఊరుకోటం ఉచితం.

# ఆవేశాలు - పూనకాలు

మానవాతీత జీవులను గురించిన పరిశోధనలో కృషి చేసేవాడికి ఇన్ని అన్ని అనరాని విచిత్రాలు తెలుస్తూవుంటవి. కొంత అనుభవంమీద అవన్నీ సహజంగానే కనిపిస్తుంటవి. ఏదీ ఆశ్చర్యంగా అనిపించదు. మనదేశంలో చాలాచోట్ల కనిపించే వింతలలో ఈ ఆవేశాలు, పూనకాలు ప్రత్యేకంగా గమనించదగినవి. వీటిని గురించి మన వాఙ్మయంలో తెలుసుకో దగిన విశేషాలు ఎన్నో ఉన్నవి.

యోగులు, తపస్వులు తమ ఇష్టదేవతలను తమలోకి ప్రవేశించ వలసిందిగా కోరటం మొదటినుంచిఉంది ధ్యానవశమున దేవతలు అనుగ్రహించి సాధకునిలోప్రవేశించటం సిద్ధిలో ముఖ్యమైన దశ. కావ్యకంఠగణపతిముని గణపతిస్తోత్రంలో ఏమన్నారో చూడండి!

**శ్లో॥ హస్తి ముఖ ! యాచే గాఢరసభక్త్యా**
**ఆవిశ విభో ! మాం దివ్యనిజశక్త్యా**

గజాననా! నిన్ను గాఢభక్తితో ప్రార్థిస్తున్నాను. నీ దివ్యశక్తితో నన్నావేశించు ప్రభూ! ఆ విధంగానే ఇంద్రాణిని స్తుతిస్తూ ఆమె తేజోలహరి తనలో ప్రవేశించాలని చేసిన అభ్యర్థన అటువంటిదే.

**శ్లో॥ నిర్జిత శోకా ధూతతమా సంస్కృతచిత్తా శుద్ధతమా**
**వాసవశక్తేః వ్యోమజుషః కాచనవీచి ర్మాం విశతు**

శోకమును పోగొట్టి, చీకటిని పారద్రోలి, చిత్తసంస్కారాన్నిస్తూ, పరిశుద్ధమైన వాసవశక్తి యొక్క ఒకానొక తరంగము ఆకాశము నుండి ఉదయించి నాలో ప్రవేశించునుగాక!

**శ్లో॥ ఉద్ధతకీలం మూల మిదం భిన్నకపాలం శీర్షమిదం**
**ఉజ్ఝితమోహం చిత్తమిదం వాసవశక్తి ర్మాం విశతు**

మూలాధారమున అగ్ని లేస్తున్నది. శిరస్సున కపాలభేదనము జరిగినది. చిత్తమున మోహము వదలినది. జగదీశ్వరియైన ఇంద్రాణి నాలో ప్రవేశించునుగాక!

ఆదికాలము నుండి మహర్షులు చేసిన సాధనలోని రహస్యమిదే.

మహాయోగియైన అరవిందులు, దివ్యయోగినియైన శ్రీమాత మానవునిలోనికి దివ్యావతరణమునకై చేసిన ప్రయత్నమిట్టిదే. భవ్యదివ్యావేశమునకై ప్రయత్నించినవారే మహనీయులంతా!

కవిబ్రహ్మయైన తిక్కన వ్యాసభగవానుని గూర్చి వర్ణిస్తూ విద్వత్సం స్తవనీయ భవ్యకవితావేశుడుగా పలికాడు. వాల్మీకి ముఖమున లౌకిక కవిత మొదటిసారిగా ఉదయించినప్పుడు బ్రహ్మ అతనితో సరస్వతి అతనివాక్కున ప్రవేశించటం వల్లనే ఛందోమయవాక్కు ఆ మహర్షికి వచ్చిందని చెప్పినాడు.

పాతంజల మహాభాష్యంలోని పస్పశాహ్నికంలో శబ్దరూపుడైన రుద్రుడు మనుష్యుల నేవిధంగా ఆవేశించి ఉంటాడో చెప్పబడింది.

**శ్లో॥ చత్వారిశృంగా త్రయో అస్యపాదా ద్వేశీర్షే సప్తహస్తాసో అస్య**
**త్రిధాబద్ధోవృషభోరోరవీతి మహాదేవో మర్త్యా ఆవివేశ.**

నాలుగుకొమ్ములు, మూడుపాదములు, రెండుతలలు, ఏడుచేతులు కలిగి, మూడుచోట్ల కట్టబడి అరుస్తూవుండే వృషభస్వరూపుడైన మహాదేవుడు మర్త్యుల నావేశించివుంటాడు.

ఇదొక సాంకేతికమైన శ్లోకం. దీనికి వ్యాకరణశాస్త్ర పరమైన అర్థం వుంది. అది ఇక్కడ అవసరం లేదు గనుక చెప్పటం లేదు. దేవతలు మనుషుల నావేశిస్తూంటారనటానికి ఇదికూడ ఒక ఉదాహరణగా ఇచ్చాను.

భారతంలో కుమారస్వామి పుట్టినప్పుడు బ్రహ్మ సకలమునిగణ సమేతుడై వచ్చి అతణ్ణి అభినందించి పార్వతీపరమేశ్వరులను అతని తల్లిదండ్రులుగా పరిచయం

చేస్తూ ఇలా అన్నాడు.

"అగ్ని దేవునియందును, తదీయ భార్యయందును తారు నిజయోగ బలంబునంజేసి ఆవేశించి ఆ దంపతులు లోక హితార్థంబుగా నిన్నుం గనిరి".

శివపార్వతులు కూడా ఇతరులలో ఆవేశించటమున్నదని దీన్ని బట్టి గ్రహించవచ్చు.

హరివంశంలో ఒకకథ ఉంది. నందవ్రజంలో ఒకసారి ఉత్పాతం బయలుదేరింది. గో గోపకులు రోగగ్రస్తులై బాధపడుతున్నారు. ఎన్ని మందులిచ్చినా వ్యాధులు తగ్గటంలేదు. చివరకు నందుడు బ్రాహ్మణులను ప్రార్థించితే వాళ్ళు యజ్ఞం చేయించారు. అది సర్వభయహారియైన రుద్రుని గూర్చి. యజ్ఞప్రియుడైన మహాదేవుడు సంతుష్టుడైనాడు. ఆయన ఆజ్ఞచే ఒక ప్రమథుడు వచ్చి అక్కడి బ్రాహ్మణులలో ఒకనిని ఆవేశించి భయహేతువు, దాని నివారణోపాయము చెప్పి వెళ్ళాడు.

ఇక్కడ ఒక రహస్యం ఉంది. మహాదేవతలు సామాన్యంగా స్వయంగా తామే వచ్చి తీరవలసినంత అవసరం ఉంటే తప్పరారు. తమ పరివారంలో ఎవరో ఒకరిని పంపి పనిచేయిస్తుంటారు. ఆర్తులైన భక్తులు రకరకాల పనులకై ప్రార్థించినప్పుడు, పనులు జరిగినా సరాసరి తమ ఇష్టదేవతే దిగివచ్చి చేసిందని భావిస్తుంటారు. ఎంతో దివ్యదర్శన శక్తి వుంటేగాని ఆ పని నిజంగా ఎవరు చేసిందీ కనుక్కోటం సాధ్యంకాదు.

దివ్యక్షేత్రాలలో చాలచోట్ల భూతప్రేతాది ఆపన్నివారణము. ఇష్టకామ్యసిద్ధి జరగటం ఎరుగుదుము, ఎక్కువ సందర్భాలలో అసలు దేవత చేసే పనులకంటే ఆ క్షేత్రాన్ని ఆశ్రయించిన దేవతా భక్తులు, అశరీరులైన సిద్ధులు చేసే పనులే ఎక్కువ. ఆ దేవతా మహిమను ప్రచారం చేయ్యాలనే కాంక్షతో ఆ క్షేత్రదేవత పేర వారే ఎన్నో మహిమలు ప్రదర్శించి భక్తులకు సహాయపడుతూ, ఆ దేవత కీర్తిని వ్యాపింప జేస్తూ వుంటారు.

ప్రపంచంలో కొన్నిచోట్ల మనుషులను దేవతలావేశించటం కద్దు. ఆవేశం వచ్చినపుడు ఆ దేవతల అలంకారాలే వీరికి కూడా భాసించటం జరుగుతుంది. ఉదాహరణకు ఒక వ్యక్తిని వేంకటేశ్వరస్వామి ఆవేశిస్తే ఆ కాసేపు ఆ వ్యక్తి ముఖాన ఊర్ధ్వత్రిపుండ్రాలు రావటం, సుగంధపరిమళాలు వ్యాపించటం, లడ్డుగారె మొదలైన

ప్రసాదాలు చేతులలోకి రావటం జరుగ వచ్చు. ఆ స్థితిలో ఆ వ్యక్తి భూతభవిష్యద్వర్తమాన ఫలితాలు చెప్పగలగవచ్చు. ఏమైనా చేయగలగవచ్చు.

అయితే ఒక సందేహం సహజంగా కలుగుతూ వుంటుంది. సర్వ లోకాధిపతి, లోకాతీతుడు, సృష్టి స్థితి లయకారకుడూ అయిన జగన్నాధుడికి వేరే పనేమీ లేదా! దయ్యం పట్టినట్లు మనుషులను పట్టుకొని తన మహిమలను తానే చూపించుకొని ప్రచారం చేసుకుంటూ వుండటం ఇదేమి పని అనిపించవచ్చు. ఆ మాట నిజమే భక్తులను ఆవేశింపకూడదని, వాళ్ళ తృప్తి కొరకేదైనా చేయకూడదని లేదు గాని చాలసార్లు అసలు దేవతలకంటే, ఆ దేవతల భక్తులైన అశరీర యోగసిద్ధులు, పూర్తిగా కామ క్రోధాదుల కతీతులు కానివారు, కీర్తికాంక్షులు,ఉపకారకాములు ఆ దేవతల పేర చేసే మహిమ ప్రదర్శనలే అధిక భాగం.

అశరీరులైనంత మాత్రాన అందరూ దేవతలు కాలేరు. దేవతా భక్తులలో కూడా కొద్దిపాటిశక్తులను పొంది, ఆ సిద్ధులతో విర్రవీగే వారే ఎక్కువమంది. వారికి తెలిసింది తక్కువ బుకాయింపెక్కువ, అందుకే కొన్నిచోట్ల ఆవేశపూరితులై, దేవుడు పూనాడనో, అమ్మవారు పూనిందనో చెప్పే సందర్భాలలో వారు చెప్పిన భవిష్యత్ఫలితాలు కొన్ని తప్పిపోవటం, దాంతో వారియందు నమ్మకం పోవటం జరుగుతూ వుంటుంది. దానికి వేరే పెద్ద కారణమేమీ లేదు. వేంకటేశ్వరస్వామి పేరనో, ఆంజనేయుని పేరనో, దుర్గపేరనో వచ్చిన అశరీరజీవి కున్న శక్తి అల్పమైనదని మాత్రమే గుర్తించాలి.

ఇటీవల ఒక విశేషం, ఒక కుర్రవాణ్ణి శంకరాచార్యులవారు ఆవేశించారనీ, దాంతో అతగాడు వేదాంత విషయాలు వందలకొద్దీ పేజీలు వ్రాశాడనీ, అదొక మహాగ్రంథమయిందని విన్నాను. అతని తల్లిదండ్రులు కూడా తమ వంశం తరించిందనీ, తమ బిడ్డ మహానుభావుడనీ నమ్మి పెద్దల నాహ్వానించి చూపిస్తూ వున్నారు. సుప్రసిద్ధుడైన ఒక వృద్ధపండితుడూ, నేనూ వెళ్ళిచూచాము. ఆ బాలుణ్ణీ అతడు వ్రాసిన గ్రంథాలను జాగ్రత్తగా పరిశీలించాము. తీరా చదివితే వ్రాసింది వేదాంతమేగాని అందులో అడుగడుగునా సంస్కృతభాషాదోషాలు, శాస్త్రదోషాలు ఎన్నోవున్నవి. "ఏమిరా! యిది ! శంకరాచార్యులవారు ఇన్నివందల సంవత్సరాల మీద సంస్కృతాన్ని, వేదాంతాన్ని చాలా భాగం మరచిపోయినట్లున్నారు. పాపం ! తప్పులు వ్రాశారు. అని చమత్కారంగా మాలో మేము నవ్వుకొన్నాము.

తరువాత దివ్యదర్శన మార్గంలో విచారిస్తే ఆ కుర్రవాణ్ణి ఆవేశించి వున్నది శంకరాచార్యులు కానేకాదు. శంకర భాష్యాలను, అద్వైత వేదాంతాన్ని కొద్దిగా చదువుకొని, దాంట్లో పెద్దపాండిత్యంలేక, విశ్వాసం మాత్రం కలిగిన ఒక సామాన్యుడు మరణించిన తర్వాత శంకరమతాన్ని ప్రచారం చెయ్యాలనే తీవ్రకాంక్షతో ఆ పిల్లవాణ్ణి పట్టుకొన్నాడు. జగద్గురువులైన ఆచార్య శంకరులకు అపచారం చేస్తున్నానని గ్రహించక ఆయన పేరుకు కళంకం తెస్తున్నాడా కుహనా శంకరుడు. "అయ్యా ! మీ అబ్బాయిని శంకరాచార్యుల వారావేశించటంలేదు. చచ్చిన అద్వైతి ఒకడు దయ్యమై పట్టుకొని తన రచనా కండూతి తీర్చుకుంటున్నాడు" అని అతని తండ్రితో చెపుదామనుకొన్నాము గాని చూస్తే వాళ్ళు దాన్ని ఒప్పుకొనేటట్లులేరు. తమబిడ్డ అవతారపురుషుడైనాడని గొప్పలు చెప్పుకుంటున్న వాళ్ళ ధోరణి చూస్తే మా చేదు మాటలు వాళ్ళకి రుచించేలా కనిపించలేదు. అవతారాలు, ఆవేశాలు ఇలా ఇలా ఉంటవి అని మాత్రం చెప్పి నొప్పించక, తా నొవ్వక అన్న పద్ధతిలో బయటికి వచ్చి ఆ బాలుని స్థితికి జాలిపడ్డాము.

దేవతావేశంచేత మానవులకు దివ్యశక్తులు లభిస్తవి. పురాణకాలంలో పరశురాముని యందు వైష్ణవతేజ మావేశించి సర్వక్షత్రియ సంహారము చేయించిందని దశరథ రామునిచే అది నిగృహీతమైన తర్వాత భార్గవుడు వట్టి ఋషిగా మిగిలిపోయినాడని తజ్ఞుల అభిప్రాయం. అలానే కొందరి యందు కొంతకాలం దైవశక్తి ఆవహించి కొన్ని మహాకార్యములు చేయించటమూ కద్దు. అయితే ఈ ఆవేశంలో చాలా రకాలున్నవి. జీవుని పూర్ణంగా ఆవేశించి అతడి జీవితాన్ని ఆక్రమించి అతడు తానే సర్వమూ నిర్వహిస్తున్నానని, అంతా తన ఇచ్ఛప్రకారమే జరుగుతున్నదని భావింపజేయటం ఒక పద్ధతి. వైష్ణవశక్తి ఆవేశించిన భార్గవరాముడు ఆ విధంగానే రాజకులధ్వంసం చేశాడు. జమదగ్ని సంహారం తర్వాత తల్లి రేణుకను తీసుకెళ్తూ దత్తాత్రేయాశ్రమం చేరినప్పుడు దత్తు డతనికి రేణుకాదేవి జగన్మాత అని చెపుతాడు. పరశురాముడు తన తల్లి దేవత యేమి టనుకొంటాడు. కాని ఆమె తన చేత ఛిన్నమస్తయైన సమయంలో పవిత్రురాలైన ఆమెలోనికి జగదీశ్వరి ప్రవేశించిందని, ఆ క్షణం నించి ఆమె లోకమాత అయిందని అతనికి తెలియదన్న సంగతిని దత్తాత్రేయుడు పద్మపురాణంలో చెప్పాడు. అటులే భగవద్గీతలో కూడ కాలశక్తి ఆవేశించి కౌరవసైన్య సంహారం చేయబోతున్న అర్జునుడికి ఆ విషయ మేమీ తెలియదు. అతనికీ తనకూ చాలాపూర్వజన్మలు గతించినవని అవి అర్జునునికి

తెలియవనీ,తనకు తెలుసుననీ కృష్ణుడు పలుకుతాడు.

శ్లో ॥ బహూనిమే వ్యతీతాని జన్మాని తవచార్జున
తా న్యహం వేదసర్వాణి నత్వంవేత్థ పరంతప.

మరొకవిధం- తాత్కాలికముగా ఏదేవతో ఒకమనుష్యుడ్ని ఆవేశిస్తుంది. కొన్ని నిముషాలో, గంటలో వుంటుంది. ఆ సమయంలో ఆ వ్యక్తిమనస్సు పనిచెయ్యదు. ఏమి జరుగుతున్నదో తెలియదు. తదావేశభరితుడైన ఆ మానవుడు శుభాశుభములు పలకటం, కొన్ని మహిమలు ప్రకటించటం జరుగుతుంది. ఈ విధమైన ఆవేశాలను పూనకాలంటారు. ఎక్కువగా గ్రామదేవతల కొలువుల్లో పోలేరమ్మ, అంకాళమ్మ, నూకాలమ్మ మొదలైన దేవతలు భక్తుల నావేశించి ఏవో పలకటం, మహిమలు ప్రదర్శించటం చాలాచోట్ల జరుగుతూనే వుంది.

ఎప్పుడో అరుదుగా శ్రీరంగనాయిక మహాలక్ష్మి వంటి మహాదేవతలు కూడా మనుషుల నావేశించటం వుంటుంది. తంజావూరు ప్రభువు విజయరాఘవనాయకుడు రోజూ లక్షమందికి అన్నదానంచేసే నిత్యవ్రతం పెట్టుకొన్నాడు. వారు భుజించనిదే ఆయనా ఆరగించేవాడుకాదు. అతని దానదీక్షను పరీక్షించటానికి శ్రీరంగేశ్వరి యాభైరోజులు ఎడతెరిపిలేని వానలు కురిపించింది. అతడు చలించలేదు. పచ్చికట్టెలు మండక పాచకులు అవస్థపడుతుంటే చివరకు జగదీశ్వరికి కరుణకలిగి ఆమే స్వయంగా మానవాకారంతో వెళ్ళి వంటచేసి భక్తుడైన మహారాజును ఉపవాసంనించి రక్షించింది. అప్పుడామె ముక్కెర బూదిపొయ్యిలో జారిపడింది. శ్రీరంగపట్టణం అమ్మవారిగుడిలో ముక్కెర మాయమయింది. పూజారికి వచ్చిన దొంగతనపు అపవాదు తప్పించటానికి మహాలక్ష్మి ఒక గొల్లభామ నావేశించి సత్యం పలికింది. చరిత్ర ప్రసిద్ధమైన యిటువంటి గాథలక్కడక్కడ వినిపిస్తూనే వున్నవి.

దేవగణములు మనుష్యుల నావేశించినట్లే సిద్ధశక్తులు గల యోగులు ఇతర మనుష్యుల నావేశించటం కూడా వుంది. భారతంలో ఇటువంటి గాథ దానిని చూడవచ్చు. ఇంద్రుడొక మహర్షిపత్నిని కామించాడు. ఆమె కూడా కొంత తదనుకూల లక్షణాలు ప్రదర్శించింది. మహర్షి ఆశ్రమంలో లేనప్పుడు వజ్రధరుడు వచ్చాడు. ఆమె అతని కామానికి లొంగిపోయేదేమో ! కాని ఆశ్రమంలో ఆ మహర్షి శిష్యుడొకడున్నాడు. వాడు మహాయోగి. పరదారాసక్తుడైన ఇంద్రున

కాత డొక పాఠం చెప్పాలనుకొన్నాడు. తనయోగ శక్తిచేత గురుపత్నినావేశించి, ఆమె పలికినట్లే పలుకుతూ శక్రుణ్ణి చీవాట్లు పెట్టాడు. ఇంద్రుడు సిగ్గుపడి వెళ్ళిపోయాడు.

ఇటువంటి వాటిలో గమనించవలసిన ప్రధానమైన అంశం ఆ పూనకం అయిపోయి ఆవేశించిన దేవతో, పిశాచమో,యోగియో వెళ్ళిపోయిన తర్వాత ఆవిష్టునికి సహజస్థితి వస్తుంది. ఆవేశస్థితిలో ఏమి జరిగిందో అతనికి తెలియదు. అతని మనస్సు అప్పుడు పనిచేయక స్తబ్ధమై వుంటుంది.

కాని ఎక్కువభాగం ఆవేశాలు మనిషిని తెలీకుండానే నడుపుతుంటవి. బుద్ధిస్థితిలో నడుపుతూ మనిషిని తానే సొంత ఆలోచనతో నడుస్తున్నానని అనిపించటమే దివ్యశక్తుల ప్రత్యేకత, భగవద్గీతలో శ్రీకృష్ణుడర్జునునితో మాయాశక్తిచే భూతజాలమును తానెట్లు నడుపునో చెప్పియున్నాడు.

**శ్లో ॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి**
**భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా**

కొంతమంది లోకంలో అధర్మమార్గంలో నడుస్తూ "ఎందుకయ్యా మీరు న్యాయంగా ప్రవర్తించరని" అంటే "నాలో వుండి నన్ను నడిపే పరమేశ్వరుడలా బుద్ధి పుట్టిస్తున్నాడు. నాకు ధర్మమేదో అధర్మమేదో తెలుసు. కాని ధర్మమార్గంలో ప్రవర్తించలేకున్నాను" అని సమాధానంచెప్పే దుర్యోధనుని వంటి వారూ మనకు కనిపిస్తారు.

**శ్లో ॥ జానామిధర్మం నచ మేప్రవృత్తిః జానామ్యధర్మం నచమే నివృత్తిః**
**కేనాపిదేవేన హృదిస్థితేన యధా నియుక్తోస్మి తథా కరోమి.**

నిజానికి మానవులను నడిపే ఈ దైవం కర్మఫల రూపమైనది. ఈశ్వరుడు కర్మకతీతుడు. ఎప్పుడో భక్తులు ప్రార్థించి ప్రార్థించి తీవ్రతపస్సు చేస్తే ఆయా జీవుల కర్మ విషయములో జోక్యం చేసుకుంటాడే తప్ప మామూలుగా కర్మకు బద్ధుడై చూస్తుంటాడు. కనుక దుర్యోధనుడి సమాధానం సరియైనదికాదు.

ఇంతకూ కర్మరూపమైన ప్రబోధనం వేరు. ఈ ఆవేశాలు పూనకాలు వేరు. వీటిలో వుండే విభేదాలు తరువాత పరిశీలిద్దాము.

# సూక్ష్మశరీరము – 1

కంటికి కనిపించే పాంచభౌతికశరీరంకాక ప్రతి మనిషికి కంటికి కనిపించని మరొకశరీరం వున్నదని యోగులేనాడో గుర్తించారు. దానినే సూక్ష్మశరీరమంటారు. ఆంగ్లంలో (Astral or Subtle body) అని పిలుస్తారు. స్థూలశరీరానికి, సూక్ష్మశరీరానికి అవినాభావమైన ఒక సంబంధం నిరంతరమూ వెలసివుంటుంది. రెంటికి మధ్య ఒక అదృశ్యరజత సూత్ర బంధం వంటిది వుంటుంది.

కర్మవశాన మానవు డనుభవించవలసిన మంచిగానీ చెడుగాని, ముందు సూక్ష్మశరీరంమీదకు వస్తేనేగాని తరువాత భౌతికశరీరం మీదకురావు. సూక్ష్మశరీరాలను దర్శించగల దివ్యదృష్టి సాధించినవ్యక్తి మనుష్యుల కేయే మంచి చెడులు అద్యతన భావిలోజరగనున్నవో చెప్పగలుగుతాడు. అంతేకాక భూతప్రేతములేవైనా ఆవహించి వుంటే ఆ విషయమూ దానిమీద స్పష్టంగా కనిపిస్తుంది. అంతేకాదు సిద్ధుడైన యోగి స్థూలశరీరంతో దాని అధికారియైన మనిషి మనస్సుతో సంబంధం లేకుండా, అతనికి తెలియకుండా అతనికి సంబంధించిన ప్రాచీన, అర్వాచీన అద్యతన జీవితవిశేషాలను సూక్ష్మశరీరాన్ని ప్రశ్నించి తెలుసుకోవచ్చు. రామకృష్ణ పరమహంస నరేంద్రుని ఆ విధంగానే ప్రశ్నించి అతడెక్కడనించి వచ్చిందీ, ఎందుకు వచ్చింది, ఎన్నాళ్ళకు ఏవిధంగా జీవిత గమనాన్ని నిర్ణయించుకొన్నదీ తెలుసుకోగలిగాడు. స్థూలశరీరాన్ని ఆశ్రయించివున్న మనస్సు అబద్ధం చెబుతుందిగాని సూక్ష్మశరీరాశ్రితమైన మనస్సు అబద్ధం చెప్పటముండదు. అందువల్లనే మరణానంతరం సూక్ష్మశరీరముతో మాత్రమే వుండవలసిన పరిస్థితి వచ్చినపుడు పాపపుణ్యానుభవదాయకములైన వేటినీ పరలోకనాథుని ముందు దాచుకోలేడు.

మనిషికి ఏ కర్మానుభవం వచ్చినా అది ముందు సూక్ష్మంమీద రూపుదాల్చితే గాని స్థూలానికి దిగదన్నాము గదా ! ముఖ్యంగా మరణం విషయంలో దీన్నిగురించి భగవద్గీత సూచించింది.

**మయైవేతేనిహతాః పూర్వమేవ**
**నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్ !**

కృష్ణుడర్జుననితో భీష్మద్రోణాది ప్రతిపక్ష యోధులను గురించి చెబుతూ వీరంతా ఇదివరకే నాచేత చంపబడ్డారు. నీవు నిమిత్త మాత్రుడవు కావలసినదని అన్నాడు. నీకు శక్తి నిస్తాననో, నీకు అస్త్రాలు చెపుతాననో, నీ బాణాలచేత చంపిస్తాననో అనక ఇదివరకే వీళ్ళను చంపేశాను. నీవు కేవలం నిమిత్తమాత్రంగా బాణాలు వేయటమే అని పలకటంలో ఈ రహస్యం ఇమిడి వుంది. లోకక్షయకృత్ప్రవృత్తుడైన కృష్ణుడు సూక్ష్మలోకంలో వాళ్ళ శరీరాలను ఖండించాడు. అది స్థూలశరీరం మీద ప్రతిఫలించే సమయం వచ్చేసరికి ఎవరేమి చేసినా చేయకపోయినా వాళ్ళు నేలకూలక తప్పదు.

మాంత్రికులు ప్రయోగాలు చేసేటప్పుడు చంపదలచుకొన్న మనిషి బొమ్మను చేసి ప్రాణప్రతిష్ఠ చేస్తారు. ఆ ప్రాణాకర్షణ మంత్రశక్తివల్ల బొమ్మలోకి సూక్ష్మశరీరం ఆకర్షించబడి బంధింపబడుతుంది. బొమ్మకు ముల్లో, సూదో ఎక్కడ గుచ్చితే అసలు మనిషికి అక్కడ బాధకలుగుతుంది. ఏ అవయవాన్నైనా బొమ్మకు విరిచి వేస్తే మనిషి శరీరంలో ఆభాగం చచ్చుపడిపోతుంది. గుండెలో గ్రుచ్చటమో,తల నరకటమో బొమ్మకు చేస్తే మనిషి మరణిస్తాడు. ప్రయోగాలలోని రహస్యమిది.

కాశీమజిలీ కథల్లో మాంత్రికుడి లేక రాక్షసుడి ప్రాణాలు ఏడుసముద్రాల అవతల చిలుకలో వున్నవని వర్ణిస్తారు. అవి తంత్రశాస్త్ర దృష్టితో అసంబద్ధములు, అసంభావ్యములు కావు. మంత్రశక్తితో అటువంటివి వుంటే వుండవచ్చు. మంత్రసిద్ధులు తమ సూక్ష్మశరీరాలను ఆవిధంగా రక్షించుకొనే ఏర్పాట్లు చేసుకోవచ్చు.

స్థూలసూక్ష్మశరీరాలకుండే అనుబంధాన్ని కూడా జాగ్రత్తగా గమనించాలి. స్థూలశరీరం ద్వారా జరిగే కర్మలసారం సూక్ష్మానికి వెళుతుంది. అక్కడినించి అనుభవించవలసిన కర్మలుదిగుతూ వుంటవి. ఈ రాకపోకలతో నిరంతర సంబంధం నిలచి వుంటుంది. మరో విశేషమేమిటంటే సూక్ష్మశరీరానికి దానిదైన ఒకప్రత్యేక వ్యక్తిత్వం వున్నట్లుగా ప్రవర్తిస్తుంది. సూక్ష్మశరీరపు మనస్సులలో స్థూలానికి గుర్తుండని పూర్వజన్మ విశేషాలు,అప్పటి మనుషులతోటి అనుబంధాలు ఎన్నో గుర్తుంటవి. అందుచేత పూర్వపు వాళ్ళెవరైనా కనిపిస్తే మాట్లాడుతూ వుంటవి. కొన్నిసార్లు ఆ లోకాలలోని కొత్తవాళ్ళతో పరిచయాలు చేసుకుంటూ వుంటవి. ఇవేవీ స్థూలశరీరంలోని మనస్సుకు తెలియదు. స్వప్నావస్థలో మాత్రం కొన్ని వింతలు విశేషాలు కనిపిస్తూ వుంటవి. కలల్లోకొన్ని పర్యాయాలు కొత్తవ్యక్తులతో

ప్రసంగించటం, వాళ్ళలో కొందరి వరకు తెలిసిన వారిలాగా వుండటం ఈ సూక్ష్మదేహపు పూర్వబంధాల పలకరింపుల వల్ల కావచ్చు. ఈ సూక్ష్మశరీరాల స్వతంత్ర వర్తనం కొందరు మహనీయుల జీవితాలలో అద్భుతంగా కనిపిస్తుంది.

ఒకసారి కావ్యకంఠవాసిష్ఠ గణపతి ముని దక్షిణదేశంలోని ఒక దేవాలయంలో తపస్సు చేస్తున్నాడు. మధ్యాహ్నం దాటుతున్నది. ఉపవాసక్లేశంచేత చాలా అలసటతో వున్నస్థితిలో గురువైన రమణమహర్షి వస్తే బాగుండుననిపించింది. ఇంతలో హఠాత్తుగా మహర్షి వచ్చారు. తన ప్రక్కనే కూర్చొని గుండెమీద చేయివేసి నిమిరి శక్తి ప్రసారంచేసి మాయమైనారు. కొద్దిక్షణాలలో జరిగిన అపూర్వఘట్టమిది. దీన్నిగురించి రమణులు కూడా వివరించారు. ఒకరోజు ఉన్నట్లుండి సూక్ష్మశరీరంతో కావ్యకంఠుని దగ్గరకు వెళ్ళి ఏమో చేసినటులుగా అనుభూతి కలిగిందని అన్నారు.

అవతార మూర్తులుగా ప్రసిద్ధికెక్కిన కొందరు భక్తులకు దర్శనమివ్వటంలోని రహస్యమిదే. వారికి తెలియకుండానే వారి సూక్ష్మదేహం భక్తులకు దర్శనానుభూతులను ప్రసాదించవచ్చు. అందువల్లనే కొన్నిచోట్ల భక్తులు తమ ఆరాధ్యులతో మీరు మాకు ఫలానారోజు కనిపించి ఈ ఉపకారం చేశారనో, ఇలా రక్షించారనో అంటుంటే ఆ పూజ్యవ్యక్తి తల పంకించి చిరునవ్వునవ్వి ఊరుకోవటమో, కొన్నిసార్లు నాకేం తెలియదనటమో జరుగుతూ వుంటే చూచేవారికి అర్థంకాక వాళ్ళు తమ మహత్వాన్ని చెప్పుకోవటం ఇష్టంలేక ఊరికే కాదంటున్నారు గాని వాళ్ళు తెలిసి చేసిన మహత్వమే,భక్తానుగ్రహమే అని భావించే స్థితి వుంది.

గణపతి ముని శిష్యులు కూడా కొన్నిసార్లు గురుమూర్తి తమ నావహించినటులు అనుభూతులు పొంది మునిగారితో చెప్పగా అవి తన సూక్ష్మశరీరముయొక్క విలాసములని గుర్తించి చెప్పటం జరిగింది. ఈవిధంగా మహాసాధకులు, సిద్ధులు అయిన వారి సూక్ష్మశరీరాలకు మామూలువారి సూక్ష్మాలకు లేని విశిష్టలక్షణాలు చాలా వుంటవి. రామకృష్ణపరమహంస జీవితంలో కూడ ఈ సూక్ష్మశరీర విలాసం వున్నట్లు ఆయన జీవితచరిత్రలో గమనించవచ్చు. ఒకప్పుడు ఆయన ధ్యానంలో ఉండగా ఆయనలోనుండి ఒక సన్యాసి బయటకు వచ్చి ఎదురుగా కూర్చొని మాట్లాడేవాడట. ఈయన ప్రశ్నలడగటము ఆయనసమాధానాలు చెప్పటము కొంతసేపు జరిగిన తరువాత ఆ సన్యాసి మళ్ళీలోపలికి ప్రవేశించి మాయమయ్యేవాడట. ఇలా కొంతకాలం గడచిన తరువాత రోజూ తన ఎదురుగా కూర్చుండే సన్యాసి తానే అయినట్లు

తెలుసుకోగలిగాడు. అంటే అది ఆయన సూక్ష్మశరీరమన్నమాట.

పుదుచ్చేరిలోని అరవిందాశ్రమ శ్రీమాత జీవితంలో దీనికి సంబంధించిన కొన్ని విశేషాలు పరిశీలించవచ్చు. చిన్నవయస్సులోనే ఆమె చేసిన సాధనల ఫలితంగా భౌతికజీవితంలో నుంచి ఇచ్ఛాపూర్వకంగా వెలువడి సూక్ష్మశరీరంతో ప్రయాణం చెయ్యగలిగేదట. ఒకసారి సముద్రంలో ఓడమీద ప్రయాణం చేస్తుండగా తుఫాను వచ్చింది. కల్లోలమై పోయి ఓడ మునిగిపోతుందా అన్నస్థితి వచ్చింది. అది అంతరిక్షంలో దుష్టశక్తులయొక్క క్రీడగా ఆమె తెలుసుకోగలిగింది. ప్రక్కనే ఆమెకు యోగవిద్యా రహస్యాలు నేర్పిన గ్రీక్ గురువుకూడా ఉన్నాడు. అతని సలహాతో ఆమె భౌతిక శరీరంనుండి వెలువడి సూక్ష్మశరీరంతో ఆకాశంలోకి ప్రయాణంచేసింది. అక్కడ మానవాతీత జీవులు కొంతమంది తమ ఇచ్ఛాశక్తిచేత ఈ ఓడను కావాలని ప్రమాదం కలగటంకోసం పెనుతుఫాను సృష్టించినట్లుగా చూచి వాళ్ళ దగ్గరకు వెళ్ళి వాళ్ళతో మాట్లాడి బ్రతిమిలాడి వాళ్ళను ఒప్పించి తుఫాను ఉపసంహరించేటట్లుగా చేసింది. ఆ తరువాత నెమ్మదిగా దిగివచ్చి తన శరీరంలోకి మామూలుగా ప్రవేశించింది. దానితో కొద్దిక్షణాలకే వాతావరణం ప్రశాంతంగా మారిపోయి ఓడప్రయాణం మామూలుగా సాగింది.

సూక్ష్మదేహాన్ని వశం చేసుకుంటే ఇలాంటివెన్నో చెయ్యవచ్చు.

# సూక్ష్మశరీరం - 2

తెలుగుదేశంలో గుంటూరు మండలంలో చాలా సంవత్సరాల క్రింద తుంగదుర్తి బుచ్చయ్యగారని ఒక మహానుభావుడుండేవాడు. ఆయన యోగశక్తుల గురించి చాలాకథలు ప్రచారంలో ఉండేవి. ఆయన ప్రొద్దున్నే లేచి కాశీ, గయా, ప్రయాగాది మహాక్షేత్రాలలో స్నానసంధ్యాదులు చేసుకొని వచ్చేవాడట. ఆ ప్రాంతీయులు ఆయన స్వగ్రామంలో వుండగానే తీర్థయాత్రలకు వెళ్ళటం, బుచ్చయ్యగారిని ఆయా తీర్థాలలో చూడటం, యాత్రలు ముగించుకొని ఇంటికి వచ్చిన తరువాత ఆయన ఆరోజు ఊళ్ళోనే వున్నాడని తెలుసుకొని ఆశ్చర్యపోయినారట. అంటే యోగశక్తివల్ల బుచ్చయ్యగారు ఆయా క్షేత్రాలకు తన సూక్ష్మశరీరంతో ప్రయాణంచేసే వాడన్నమాట. అయితే ఈ కథలోని విశేషమల్లా ఆయన శరీరంతో ఆయా ప్రదేశాలలో ఇతరులకు కనబడటమే. తపస్సంపన్నుడైన

యోగసిద్ధుడు గనుక ఆయన కది సాధ్యమైంది.

అటువంటిదే పరమహంస యోగానంద రచించిన ఒకయోగి స్వీయచరిత్ర అన్నదాంట్లో చూడవచ్చు. అందులో ఒకయోగి ఒకచోట శిష్యులతో మాట్లాడుతూనే మరొకచోట అదేశరీరంతో కనిపిస్తాడు. అలానే యోగానందకు ఆయన గురువైన యుక్తేశ్వర్ శరీరాన్ని విడచిపెట్టి పరలోక గతుడైన తరువాత కొంతకాలానికి కనిపించి మాట్లాడతాడు. కుతూహలం కొద్ది యోగానంద గురువు అనుమతితో ఆయనను స్పర్శించాడుకూడా. సిద్ధశక్తులచేత దర్శన స్పర్శన భాషణానుకూలమైన శరీరాన్ని నిర్మించుకోవటం సాధ్యమేనని గురువు శిష్యునితో చెప్పాడు.

స్థూలశరీరం నుంచి ఇచ్ఛాపూర్వకంగా సూక్ష్మశరీరాన్ని విడగొట్టి కావలసినంతసేపు బయట సంచారంచేసి మళ్ళీ భౌతికశరీరంలో ప్రవేశించటాన్ని గురించిన సాధన పద్ధతులను ప్రసిద్ధ లామా డాక్టర్ లోబ్‌సాంగ్ రాంపా తన గ్రంధాలలో అభివర్ణించాడు. ప్రతిరోజు శరీరంలో నుంచి బయటకు పోతున్నట్లుగా తీవ్రంగా సంకల్పించి సాధనచేస్తే కొన్నాళ్ళకు సూక్ష్మశరీరంతో మనిషి భౌతిక శరీరంలోనుండి బయటకి పోగలడని అతని సిద్ధాంతము. బయటికిపోయిన తరువాత ఎన్నివందల మైళ్ళైనా ప్రయాణం చెయ్యగలగటం అక్కడి విశేషాలు చూచి రాగలగటం ఆ సాధనలలో అంశాలు. అంతేకాక సూక్ష్మలోకాలలో ఉండే ఇతర జీవులు, వారి విశేషాలుకూడా అతడు స్పష్టంగా వర్ణించాడు. యోగసాధనచేత ఇచ్ఛాశక్తితో బైటకు వెళ్ళగలిగిన సూక్ష్మశరీరం ఎక్కువ శక్తిమంతంగా వుంటుంది. మనిషి నిద్రపోయేటప్పుడు తిరిగే సూక్ష్మశరీరాలు ఒకవిధమైన సన్నని మత్తులో వుంటవని అతడంటాడు. సూక్ష్మలోకములో ప్రవేశించిన తరువాత అనేకవిధములైన వింతలు, విడ్డూరాలు గోచరించవచ్చు. భయపెట్టే వికృత శరీరాలు కన్పించవచ్చు. ధైర్యంతో వుంటే అవి ఏమీ చేయలేవు. భయపడితే మాత్రం చాలా దుష్ఫలితాలు కలుగుతవి.

నిద్రలో వున్నప్పుడు ఒక్కోసారి సూక్ష్మశరీరం కొన్నివందల వేలమైళ్ళు ప్రయాణం చేయవచ్చు. దూరంగా వున్నప్పుడు భౌతికకాయాన్ని ఎవరైనా నిద్రనుండి లేపితే చిక్కులు రావచ్చు. సామాన్యంగా ఎంత దూరాన వున్నా రెండు శరీరాలకు వున్న సూత్రసంబంధం చేత స్థూలశరీరాన్ని ఎవరైనా కదిపితే వెంటనే సూక్ష్మానికి వార్త చేరి పరిగెత్తుకుంటూ వస్తుంది. ఒకప్పుడు ఎప్పుడైనా కొంచెం ఆలస్యం కావచ్చు. అలా అయినప్పుడు మనిషిలేచి కూర్చున్నా భ్రాంతునివలె జడునివలె

వుంటాడు. అందువల్లనే ఎవరినీ నిద్రపోతున్నప్పుడు హఠాత్తుగా లేపకూడదు. మరొక అంశం కూడా ఉంది. పగలు నిద్రపోతే, పగటివేళ సూర్యకాంతి ముందు సూక్ష్మశరీరాలు కాంతిహీనంగా వుండి, ఒకోసారి దూరంగా సంచరిస్తూ తమ స్థూలాన్ని గుర్తుబట్టి వెంటనే దగ్గరకు రాలేకపోవచ్చు. కనుక పగలు నిద్రపోవటం అంత మంచిదికాదు. అయితే యీ ప్రమాదాలన్నీ కోటికొకటి ఎప్పుడో తటస్థించేవి. మామూలుగా జరిగేవికావు.

సమ్మోహన విద్యాప్రవీణుడు ఒక వ్యక్తిని హిప్నటైజు చేసి అతని మనస్సును ఆజ్ఞాపించి సుదూర ప్రదేశాలలో ఏం జరుగుతున్నది చెప్పమంటే వశీకృతుడు చెప్పగలుగుతున్నాడు. ఎక్కడోవున్న పుస్తకంలో ఫలానా పేజీ చదవమంటే చదవగలుగుతున్నాడు ఈ ప్రయాణంచేసేది చూసేది సూక్ష్మశరీరమే. ఇది ఎంత దూరమైనా అవలీలగా ప్రయాణం చేయగలదు. ఏమైనా చూచి, వచ్చి చెప్పగలదు.

స్థూలశరీరం ఇక్కడ వుండగానే సూక్ష్మశరీరం స్థూలంతో సంబంధంలేని వ్యక్తులను కలవటం, మాటలాడటం, అనుబంధా లేర్పరచుకోవటం చేయగలిగినప్పుడు సూక్ష్మశరీరముతో తపస్సెందుకు చేయరాదు? దేవతల, సిద్ధుల అనుగ్రహం వుంటే అది కూడా సాధ్యమే. అంటే స్థూలశరీరం లోకంలో ప్రవర్తిస్తూ తన పనులు తాను చేసుకుంటూవుంటే సూక్ష్మశరీరం ఏ సిద్ధక్షేత్రంలోనో వుండి తపస్సుచేసి దేవతానుగ్రహాన్ని పొందవచ్చునన్నమాట. అయితే ఆ విధమయిన తపస్సు చేయటం కూడా సిద్ధానుగ్రహం వుంటేనే సాధ్యమవుతుంది.

సూక్ష్మశరీరాన్ని వశంచేసుకోవటానికి ప్రాచీనగ్రంథాలలో ఛాయాపురుషోపాసన చెప్పబడింది. సాధకుడు ప్రతిరోజూ తన నీడ తనతో సరిగా సమాన ప్రమాణంలో వున్నప్పుడు ఆకాశంవైపు చూడాలి. అదిరోజుకు రెండుసార్లు సాధ్యమవుతుంది. అలా చూస్తూవుంటే ఆకాశంలో సుదీర్ఘమైన ఛాయారూపం కనిపిస్తుంది. దాన్నిరోజూ చూస్తూవుంటే ఆ ఆకారపు పరిమాణము. ప్రమాణము తగ్గి కొన్నాళ్ళకు చిన్నదిగా అవుతుంది. అది సాధకుని శరీరమే. దానిమీద కలిగే మార్పులనుబట్టి ఇహలోకంలో మనకు వచ్చే మంచిచెడులు తెలుసుకోవచ్చు. తీవ్రమైన సాధనవల్ల ఆ మూర్తి మనకంటి ముందు నిలచే స్థితి, ధ్యానంలో మనతో మాట్లాడేదశ తెచ్చుకోవచ్చు. ఆ విధంగా ఛాయారూప వశీకరణంవల్ల ఎన్నో అద్భుతాలను సాధకుడు సాధించగలుగుతాడు.

సూక్ష్మశరీరం సామాన్యంగా తళతళ మెరుస్తూ ఉంటుంది. కొద్దిపాటి రంగులతేడా వుండవచ్చు. మనిషియొక్క గుణగణాలను బట్టి ఆ మూర్తియొక్క వర్ణం ఉంటుంది. సాత్వికుని సూక్ష్మం నిర్మలంగా ధవళంగా ప్రకాశిస్తూ వుంటుంది. రాజసలక్షణాలు గల వాని సూక్ష్మం ఎరుపువన్నెతో అలరుతూ వుంటుంది. అజ్ఞాన తమస్సు ఆవరించిన మూర్ఖునిది నల్లని వన్నెమీరి ఉంటుంది. సామాన్యంగా ఎక్కువమంది మిశ్రగుణాలు కలిగి వుంటారు గనుక రకరకాల రంగులు ఛాయలు సూక్ష్మదేహంమీద వుంటవి. సూక్ష్మదేహం చూడగలిగిన యోగి ఏవ్యక్తి యెటువంటివాడో వేరే విచారణ లేకుండా తెలుసుకోగలడు. మనుష్యుల గుణకర్మానుగుణంగా సూక్ష్మదేహాలు వివిధ వర్ణసమ్మేళనంతో అలరుతూ వుంటవి. **"చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః"** అన్న గీతావాక్యానికి అర్థం ఈదృష్టితో తీసుకుంటే ఉచితమూ, సత్యమూ అయిన భావం బోధపడుతుంది. లోకంలో వర్ణవ్యవస్థ వుండవచ్చు. పోవచ్చు. సమాజానికి ఇవాళ అవసరంలేదు గనుక జీర్ణమై శీర్ణమైన ఆ వ్యవస్థను తొలగించుకోవచ్చు. కాని గుణకర్మ విభాగంచేత సహజంగా ఉండే సూక్ష్మలోక వర్ణవ్యవస్థను తొలగించటం ఎవరివల్లాకాదు.

నిరంతరం తపస్సుచేత మానవుడు తన సూక్ష్మానికి కావలసిన, కోరిన ఆకార శక్తులను సంతరింపజేసుకోవచ్చు. ఎప్పుడూ విష్ణు భావనచేస్తే కొన్నాళ్ళకతని సూక్ష్మానికి అసితాంభోధర నీలవర్ణమూ, చతుర్బాహువులు పీతాంబరము, కమలాక్షులు మొదలైన లక్షణాలు వచ్చేస్తవి. మరణానంతరం అతడు విష్ణులోక పారిషదుడవుతాడు. ఏ దేవతైనా అంతే, ఉపాస్యదేవత రూపగుణాలు ఉపాసకునికి వస్తవి. 'నా శివశ్శివమర్చతి' మొదలైన వాక్యాలలోని అర్థమిదే. శివుడు కానివాడు శివుని అర్చింపడు అంటే – అద్వైతస్థితి ఉపాసకునకు సిద్ధించాలని సిద్ధాంతము.

కాశీఖండంలో ఈశానలోక విశేషాలు వర్ణిస్తూ కవిసార్వభౌముడు శివభక్తులకు మరణానంతరము ఈ లోకానికి వెళ్ళినప్పుడు వచ్చే ఆకారాన్ని అద్భుతరమణీయంగా రూపొందించి పలికాడు. ఈ లోక వాసులంతా ఈశ్వరాకారులై వుంటారట. ప్రతివాడు త్రినేత్రుడే. ప్రతివాడు గజచర్మాంబరుడే. ప్రతివాడూ చంద్రకళాధరుడే. కన్నుల కరువుతీరే కమనీయమైన ఆ దృశ్యాన్ని శ్రీనాథుని కవితలో చూడండి.

సీ. **ఫాలభాగముల నంబకము లందరికిని**
**అవతంసశశిరేఖలందరికిని**

డమరు ఖట్వాంగ ఖేటకము లందరికిని
హస్తి చర్మపటంబు లందరికిని
శ్యామకంఠ ప్రదేశమ్ము లందరికిని
నాపవాహ్యవృషంబు లందరికిని
పవమాన భుక్కలాపంబు లందరికిని
నాపాండు దేహంబు లందరికిని

గీ. అందరికి నగ్నితాపతప్తారకూట
పాటలచ్ఛాయఘనజటాబంధనములు
తేరికొన జూడు మీశాను దిక్కునందు
బ్రాహ్మణోత్తమ ! రుద్రునిపారిషదుల

సూక్ష్మశరీరముల విశేషాలు, విలాసాలు చాలా చిత్రవిచిత్రంగా వుంటవి. తపస్సాధకులు తమయోగాభ్యాసంచేత వాటిని వశంచేసుకొని తమ ఇచ్ఛాశక్తిననుసరించి రూపొందింప జేసుకొని ప్రవర్తించేలా చేసుకోవచ్చు.

# ప్రేతలోక విశేషాలు - 1

శరీరం ధరించిన ప్రతిజీవి తప్పించుకోలేనిది మరణం. సృష్టిలో కొంచెం ముందుగానో వెనుకగానో తమదేహాలు విడిచిపెట్టి లోకాంతర గతుడు కావలసిందే. సామాన్యమనుష్యుల దగ్గరనుంచి అసామాన్యులైన వ్యక్తులదాకా యీ స్థితి తప్పించుకోగల వారెవరూలేరు. కాకుంటే కొందరు అల్పాయుష్కులు కావచ్చు. కొందరు దీర్ఘాయుష్కులు కావచ్చు. జీవులకు మరణమనేది అత్యంత బాధాకరమైన స్థితి. మరణించిన తరువాత స్థితి ఏమిటి ? అనేదాన్ని గురించి అన్ని మతాలు, అందరు యోగులు ఆలోచించారు. ఎవరికి తోచిన జవాబులు వారు చెప్పుకొని సంతృప్తి చెందారు.

జంతువుల సంగతి తీసుకుంటే మనుష్యులకు వాటికి తేడా ఉంది. చనిపోయిన తరువాత మనుష్యులకు ప్రేతత్వం పొందటం, యమలోకానికి పోవటం వంటి దశలుంటాయి. యమలోకానికి మనుష్యులు మాత్రమే వెళతారు. క్రిమికీటక పశుపక్ష్యాదులు వెళ్ళవు. ప్రేతత్వమో, పిశాచత్వమో పొందటం మనుష్యులకే కాని

యితర జంతువులకు లేదు. చచ్చినవెంటనే అవి మరొక గర్భంలో ప్రవేశించి జన్మలెత్తుతాయి. స్కాందంలో మహేశ్వర ఖండంలో ఈ విషయం స్పష్టంగా చెప్పబడింది.

**శ్లో ॥ మనుష్యా ఏవగచ్ఛంతి యమలోకం నచాపరే**
**మరణానంతరం తేషాం జంతూనాం యోని పూరణం**
**తథాహి ప్రేతమనుజాః శ్రూయంతే నాన్యజంతవః**

పుణ్యాత్ములైన వ్యక్తులు అనాయాసంగా మరణిస్తారు. కుంతీదేవి తన మేనల్లుడైన శ్రీకృష్ణుణ్ణి **"అనాయాసేన మరణం వినాదైన్యేన జీవనం"** వరాలుగా అడిగిందట. మరణబాధ లేకుండా ప్రేతత్వం పొందకుండా సూర్యమండలాన్ని ఛేదించుకొని యోగసిద్ధుడైన పరివ్రాజకుడు, యుద్ధరంగంలో వీరమరణం పొందినవాడు పోతారని పూర్వగ్రంధాలలో చెప్పబడింది.

**శ్లో ॥ ద్వావిమౌపురుషౌలోకే సూర్యమండల భేదినౌ**
**పరివ్రాడ్ యోగయుక్తశ్చ రణేచాభిముఖేహతః**

సామాన్యంగా అంతో యింతో పుణ్యం చేసినవాళ్ళు కూడా పదిరోజుల ప్రేతత్వాన్ని తప్పించుకోవటం కష్టం. ఆ తరువాత పుణ్యఫలితంగా ఊర్ధ్వలోకాలకు వెడితే వెళ్ళవచ్చు. ఇక పాపాత్ముల సంగతి చెప్పవలసిన పనిలేదు. గరుడ పురాణంలోని ప్రేతఖండంలో పాపులగు ప్రాణుల గతులు చెప్పబడినవి. మరణం దగ్గరబడ్డ మనుష్యునికి ఒక క్షణం యుగంలాగా బాధాభరితంగా వుంటుంది.

**శ్లో ॥ శతవృశ్చిక దష్టస్య యాపీడాసానుభూయతే**
**ఫేనముద్గిరతే సోథ ముఖం లాలాకులమ్ భవేత్**
**అథోద్వారేణ గచ్ఛంతి పాపినాం ప్రాణవాయువః**

నూరుతేళ్ళు కుట్టిన బాధ అనుభవిస్తూ, నురుగులు గ్రక్కుచూ, ముఖం చొంగతో తడుస్తుంటే తన దేహాన్ని చూస్తూనే బయటికి లాగబడతాడు. ఆ తరువాత వచ్చేది యాతనాదేహం. అంగుష్ఠ ప్రయాణంగల ఈ జీవుణ్ణి యమభటులు పట్టుకొని తమోమయమైన భయంకర మార్గాన రెండు మూడు ముహూర్తాలలో యమపురికి తీసుకువెడతారు. అక్కడ యమభటులు పాపికి ఘోరమైన నరకయాతనలను చూపించి యమునిముందు నిలబెడతారు. ఒక ముహూర్తంలో భూమిలోని తనశరీరం దగ్గరకు తిరిగి చేర్చబడతాడు. యమపాశబద్ధుడై ఆకలి దప్పులతో

పీడింపబడి ఏడుస్తూ వుంటాడు. ఇక్కడ గమనించవలసిన అంశం ఏమిటంటే ఒక్కో మతంలో ఒక్కో విధంగా నరకాన్ని గురించి, అక్కడికి తీసికెళ్ళే భటులను గురించి వర్ణించబడింది. ఆయా మతస్థులు మరణించినప్పుడు వాళ్ళ పూర్వసంస్కారానికి అనుగుణమైన వేషభాషలతో యమదూతలు కనిపిస్తూ వుంటారు. అందుకే కొన్నిసార్లు ఇంచుమించు మరణించి అతికష్టంమీద బ్రతికినవాళ్ళు యమలోకపు వింతలు చెబుతుంటే ఆశ్చర్యంగా వుంటుంది. ఆ యమభటులుకూడా సర్వజ్ఞత్వము, దేవజ్ఞత్వము కలవాళ్ళుకారు. అల్పశక్తులుగల చిన్నఉద్యోగులు. గనుక అప్పుడప్పుడు పొరపాట్లు జరగడం కూడా కద్దు. ఒక్కోపర్యాయం ఒక వ్యక్తి మరణించినటులై- అందరూ చనిపోయినాడని ఏడుపులు, పెడబొబ్బలు బయలుదేరిన తరువాత కాసేపటికి బ్రతకటము, ప్రక్కవీధిలో అదే పేరుగల వ్యక్తి మరణించటము ప్రపంచంలో అరుదుగానైనా జరిగిన సంఘటనలు.

చనిపోయిన తర్వాత – జీవుడు శరీరంలోనించి బయటికి వచ్చిన తర్వాత కొన్నిసార్లు యమదూతలకు, దేవదూతలకు పేచీలు వచ్చిన సంఘటనలు పురాణాలలో కనిపిస్తూ వుంటవి. ఎంత పాపాత్ముడైనా ఏ దివ్యక్షేత్ర మరణం వంటిదో పొందినప్పుడు వాడికోసం రెండువర్గాలవారు వాదించుకోవటం. సహజంగా దేవదూతలు ఎక్కువశక్తిగలవారు కనుక యమదూతల నొప్పించి జీవిని తీసుకెళ్ళటం జరుగుతుంది. బ్రహ్మాండ పురాణంలోని లలితోపాఖ్యానంలో ఒక కథ వుంది. ద్విజవర్మ అనే కిరాతుడు ఒక అడవిలో వుండేవాడు. ఆ ప్రాంతంలో వజ్రుడనే దొంగ తను దొంగిలించిన ధనాన్ని భూమిలో పాతిపెడుతూ ఉండగా కిరాతుడు దాన్ని అపహరించాడు. ఎందరు ధనవంతుల యిండ్లలోనో దొంగిలించబడిన ధనమిది. కిరాతు డాధనంతో అడవిని బాగుచేయించి, అగ్రహారములు కట్టించి, చెరువు త్రవ్వించి, శివ విష్ణు దేవాలయములు కట్టించి పుణ్యకార్యా లెన్నో చేశాడు. ఆ ద్విజవర్మ చనిపోయిన తర్వాత దేవదూతలు, యమదూతలు వచ్చి ఆ జీవుని తీసుకెళ్ళటానికి పోట్లాడుకొన్నారు. అప్పుడు నారదుడు వచ్చి వాళ్ళను సమాధానపరచి తీర్పు చెప్పాడు. దొంగిలించబడిన ఆ ధనమెవరిదో వారంతా చనిపోయేదాకా కిరాతుడు వాయుభూతుడై ప్రేతరూపుడై అంతరిక్షంలో వుంటాడని తరువాత పుణ్యానుభవానికి వెళతాడని దేవర్షి చెప్పినమీదట వాళ్ళంతా వెళ్ళిపోయినారు.

జీవులీవిధంగా కొంతకాలంపాటు స్వర్గానికీ, నరకానికీ వెళ్ళకుండా, అంతరిక్షంలో ప్రేతలై తిరుగుతూ వుండవచ్చు. ఆ విధంగా తిరిగే ప్రేతాత్మలే

మాంత్రికుల ఆవాహనకు దొరికేది. ఇతర లోకాలకు వెళ్ళినవాళ్ళు మాంత్రికులకు దొరకరు. ఆకాశంలో తిరిగే ఈ ప్రేతములకు తమ క్రిందవున్న భూలోక వాసులను చూడగలశక్తి మాత్రమే వుంటుంది తప్ప పైన మరికొన్ని లోకాలున్నవనీ, వాటిలో అధికశక్తి సంపన్నులైన దేవగణాలుంటవనీ తెలియదు. మనుషుల కేవిధంగా ఇతరలోక జీవులను చూచే శక్తిలేదో ప్రేతములకు కూడా తమ పై భూమికలలో వుండే వాళ్ళను చూచేశక్తి ఉండదు.

కనుక ప్రేతముల నావాహనంచేసి దేవతలున్నారా ? సిద్ధులున్నారా? అని అడిగితే వాళ్ళకు తెలియదు కాబట్టి – తెలియదనో, లేరనో సమాధానం వస్తుంది. అజ్ఞానులు ఆ మాటలనే నమ్ముతారు. ఈ లోకం ఎంత చిత్రమైనదంటే కొందరు దేవుని అస్తిత్వాన్ని నమ్ముతారు. దయ్యాలను, భూతాలను నమ్మరు. మరికొందరు వీటిని విశ్వసిస్తారు, సర్వశక్తిమంతుడైన పరమేశ్వరుని నమ్మరు.

మృతిచెందిన తర్వాత అంగుష్ఠమాత్రదేహుడైన జీవుడు తన శరీరాన్ని తాను చూస్తూ చుట్టూచేరి అందరూ దుఃఖిస్తూవుంటే తానూ దుఃఖిస్తూ వుంటాడు. అతనికి పిశాచత్వం రాకుండా వుండటంకోసం సంతానం కర్మచేయాలి. పదిరోజులపాటు చేసే పిండోదక దానాలవల్ల ఇంకో శరీరం పుట్టి జీవుడు దాంట్లో ప్రవేశిస్తాడని గరుడపురాణం పలుకుతుంది.

శ్లో ॥ అహోరాత్రైశ్చ నవభిః ప్రేతఃపింద మవాప్నుయాత్
జంతుః నిష్పన్న దేహశ్చ దశమే బలమాప్నుయాత్
దగ్ధేదేహే పునర్దేహః పిండైరుత్పద్యతే ఖగ హస్తమాత్రః

పదిరోజుల కర్మపూర్తి అయ్యేసరికి హస్తమాత్ర ప్రమాణం గలిగిన దేహంతో పదకొండవ, పన్నెండవరోజు తీవ్రమైన ఆకలి దప్పికలతో పిండదానాదులు తింటూ పదమూడవరోజు యమకింకరుల పాశములచేత కట్టబడి – హాహాకారం చేస్తూ ఒక సంవత్సరంపాటు ప్రయాణంచేసి యమలోకం – నరకం చేరుకొంటాడు. ఆ పిదప తన కర్మననుసరించి పుణ్యపాపఫలితమైన సుఖదుఃఖాల ననుభవించి మళ్ళీ భూలోకం చేరి జన్మయెత్తుతాడు.

మంత్రపూతమైన కర్మచేయబడని వాళ్ళగతి ఏమిటి ? వాళ్ళకి సద్గతులు రావా ? అన్ని మతాలలో ఇటువంటి కర్మకాండ లేదు గదా? వాళ్ళ పరిస్థితియేమిటి ?

# ప్రేతలోక విశేషాలు - 2

లోకంలో దరిద్రుడైన వ్యక్తికి ధనవంతుడైన మిత్రుడో, దాతో సహాయం చెయ్యవచ్చు. తాను స్వయంగా సంపాదించినది కాకపోయినా స్నేహ దానముల ద్వారా వచ్చిన ధనాన్ని దరిద్రుడనుభవించగలడు. స్వయంగా పుణ్యం చేసుకున్న వాడికి పుణ్యలోకములు, సద్గతులు ఎలాగూ లభిస్తవి. శ్రాద్ధకర్మ అనేది పైన చెప్పిన సహాయంవంటిది. తమను కని పోషించినందుకు కృతజ్ఞతగా పుత్రులు తమ తల్లిదండ్రులకు శ్రాద్ధకర్మ చేస్తే దానిఫలితంవల్ల ప్రేతత్వవిముక్తి కలిగి పుణ్యాత్ములకు మరింత సుఖము, పాపాత్ములకు పాపవిమోచనము కలిగి మంచి స్థితికిపోతారు. తపోనిష్ఠులైన మహర్షులు కనిపెట్టిన అద్భుతమైన ఉపకారపద్ధతి ఇది. ఈ మార్గాన్ని అనుసరించి పెద్దల ఋణాన్ని పిన్నలు తీర్చుకోగల్గుతారు.

**శ్లో ॥ భవంతి ప్రేత రూపాస్తే పిండదాన వివర్జితాః**
**ఆకల్పం నిర్జనారణ్యే భ్రమంతి బహుదుఃఖితాః**
**నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి**
**అభుక్త్వాయాతనాం జంతుః మానుష్యం లభతేనహి**

కర్మకాండ లేనివారు దానము, శ్రాద్ధము, జలతర్పణము లభింపక ప్రేతరూపమును పొంది నిర్జనారణ్యమునందు బహుదుఃఖితులై కల్పాంతము తిరుగుచుందురు. చేసిన కర్మ అనుభవింపక కోట్ల కల్పములు గడిచినను తీరదు. ఏ ప్రాణికైనను కర్మ అనుభవించకుండా యాతనాదేహము పోదు. మనుష్యదేహము రాదు.

ప్రేతత్వ ప్రారంభదశలో జీవుడు స్వప్నావస్థవంటి ఒక స్థితిలో వుంటాడు. తాను శరీరాన్ని విడిచిపెట్టాను, చనిపోయినాను అన్న సంగతి అర్థం చేసుకోవటానికి కొంతకాలం పడుతుంది. తాను ఏ స్థితిలో, ఏ కారణంవల్ల మరణించాడో ఆ బాధ, భయము, దుఃఖము వదలవు. ఒక తమోమయమైన వ్యగ్రదశలో కొంతకాలం గడుపుతాడు. సాధారణంగా తాము జీవించి వుండగా ఏ విశ్వాసాలతో వుండేవారో వాటి కనుగుణమైన స్థితే మొదట వస్తుంది. అంటే ఒక నాస్తికుడు మరణిస్తే మరణానంతరం అతని సిద్ధాంతం ప్రకారం ఏమీలేదు గనుక దాని కనుగుణంగా అతడు ఏమీలేని స్థాణు స్థితిలో కొంతకాలం వుంటాడు. అయితే ఎల్లకాలమూ

అలా వుండదు. ప్రకృతి సహజమైన పరిణామం చెంది కొద్దికాలాన్కి మరణానంతరం తాను జీవించి వుండటాన్ని అతడు గ్రహించగలుగుతాడు. అయితే ఆ స్థితిలో కూడ దేవునిమీద విశ్వాసము కలుగకపోవచ్చు. ఎందుకంటే ప్రేతాత్మ ఎన్నడూ దేవదర్శనం చెయ్యలేదు. సామాన్యంగా మొదటి పదిరోజులు గడిచేసరికి తమోదశ దాటి తనచుట్టూ వుండే పరిస్థితిని అర్థం చేసుకునే స్థితి వస్తుంది. మనుష్యులను, పాంచ భౌతికమైన ప్రకృతిని తాను చూడగలుగుతాడు. తన లాగా గాలిలో తిరిగే ప్రేతజీవులను చూడగలడు. వాటితో మాట్లాడగలడు. అంతవరకే, ఆ పైన వుండే జీవులను గురించి అతడి కేమీ తెలీదు.

ఇక్కడకూడా మత విశ్వాసాల శక్తి ప్రబలంగానే పనిచేస్తుంది. తీర్పు రోజు కోసం వేచి వుండటం వంటి మానసికస్థితిలో కొంతకాలం వుంటాడు. హిందువులకు ఇతర లోకాలు, పునర్జన్మ మొదలైన వాటియందున్న నమ్మకాలచేత పరిణామం కొంచెం వేగంగా వస్తుంది. దీనికికారణం శక్తిమంతమైన మనస్సే తప్ప మరొకటి కాదు. ఈ దశలో నుండి పరోపకార పరాయణులు, సుకృతాత్ములు అయిన వ్యక్తులు సుదూరంగా ఊర్ధ్వలోకాలకు వెళ్లిపోయి అక్కడ దివ్యసుఖా లనుభవించి మళ్లీ క్రిందికి దిగివస్తారు. మిగతా వారు ప్రేతత్వం వదలక తమ పూర్వస్మృతుల కల్లోలపు సుడిగుండాలలో పడి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యవశులై తీవ్రస్వభావులై సంచరిస్తూ వుంటారు. ఆకలి దప్పికలు, విపరీత వాంఛలు నియత శక్తిగలిగిన మానవశరీరం దాటి వాయుశరీరంలో వుండటంచేత వందలరెట్లు ఎక్కువకాగా తమ మనస్సు సృష్టించుకున్న బాధా, భయ, భూమికల నుండి, ఇంద్రియ వికారాల నుండి బయటపడలేక మానసిక చిత్రవధను అనుభవిస్తూ వుంటారు. ఈ దశలో కలిగే భయంకర అనుభూతులన్నీ వైయక్తికములు, కర్మఫలితములు. ఈ దశల్లో వుండలేక తిరుగుతూ మానవశరీరం దొరికితే బాగుండుకదా అని తపన చెందుతూ వుంటారు. తన కోరికలు తీరటానికి పాంచభౌతిక శరీరం కావాలి. అందువల్ల ఎవరి శరీరంలోనైనా ప్రవేశం దొరుకుతుందేమోనని తీవ్రప్రయత్నం చేస్తుంటారు. బ్రతికివుండగా తమకు అపకారం చేసిన వాళ్ళకు ప్రత్యపకారం చెయ్యటానికి కామవాంఛలు తీర్చుకోటానికి క్షుత్పిపాసలు పోగొట్టుకోటానికి మనుష్యులను పట్టుకొని పీడిస్తూ వుంటారు. ఆ అవకాశం అందరికీ దొరకదు.

మరికొంతమంది యీ భూమికదాటి సుదూరంగా వున్న నరకలోకానికి

వెడతారు. భూమినుండి అది 86 వేల యోజనముల దూరమున్నట్లుగా పురాణములలో చెప్పబడింది. భూమిని ఆవరించి భువర్లోక, సువర్లోక,మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములున్నవి. ఈ నరకలోకం భువర్లోకంలోని అడుగుభాగం. భూమికి దక్షిణంగా వుంటుంది. ఆ పక్కనే నైఋతి దిక్కున కేవలం ప్రేతాలయం ఉంటుంది. నరకంలోకి ప్రవేశించిన జీవులు తాము ఏ పాపములైతే చేశారో ఆ పాపముల కనుగుణమైన శిక్షలుపొందుతూ వుంటారు. ఆ వివరాలన్నీ పురాణాలలో చాలా భయంకరంగా వర్ణించబడింది. ఉదాహరణకు ఇటీవల పత్రికలలో కట్నమివ్వలేదనో, ఇతర విధాలైన ధనం కోసమో స్త్రీలను బలవంతంగా హింసించి, తగులబెట్టి చంపడం వింటున్నాము. ఆ పనిచేసిన వారు మరణానంతరం కొన్ని వందల సంవత్సరాలపాటు ఆ హింసాదహన బాధను అనుభవిస్తూ వుంటారు. ఐతే ఒక సందేహం కలుగవచ్చు. సంవత్సరాల తరబడి తగులబడటం ఏమిటి అని. మానవశరీరం ఒకపరిమితి దాటితే బాధను భరించలేదు. స్మృతి తప్పటమో, మరణించుటో జరుగుతుంది. కాని ప్రేతాత్మ బాధలననుభవించే యాతనాదేహం చావులేనిది. ఎంత బాధనైనా అనుభవించి తీరాల్సిందే తప్ప స్మృతి తప్పటమో,చావటమో అన్న స్థితి ఉదయించదు. పాపానుభవం పూర్తయినదాకా ఆ యాతనను అనుభవించక తప్పదు.

ఇనుపముక్కల కాకులు, తప్తతైలకటాహాలు, ఇంగలమున కాగిన మంగలములు పాపులకు సుసత్కారాలు. రౌరవము, మహారౌరవము, కాలసూత్రము, కుంభీపాకము, అంధతమిస్రము, సంహారము మొదలైనవి నరక విభేదాలు. యమధర్మరాజు దండధరుడై, దంష్ట్రాకరాళ వదనుడై క్రోధరక్తాంత లోచనుడై దుష్టులనిలా శాసిస్తాడట.

సీ. **పాదంబు లిరుకేలబట్టి గుంజుండు జ**
**ర్జరితంబుగా వీని జట్టుఊత**
**మెడవట్టి గోర్గాండి మెతికి పుచ్చుడు వీని**
**గ్రుడ్ల రక్తములు చెక్కుల స్రవింప**
**గడికండలుగ వీని కంఠంబుగ్రేయుండు**
**గరసానబట్టిన ఖడ్గధార**
**పలుత్రాళ్ల బంధించి తలక్రిందుగా వ్రేల**
**గట్టుడు వీని వృక్షంబు కొమ్మ**

గీ. అంపమున వీని కంఠంబుద్రెంపివిడుడు
మదమతాపుల వీని మర్మముల నొంపు
డెల్లగా నగ్నిగ్రాచిన యినుపయిసుక
గులికి పోయుడు వీని ముక్కునను చెవుల.

గీ. పరకళత్రంబు కుచకుంభ పాళియందు
నఖము దివిచిన పాపాత్ము నఖమునందు
నెల్లగా నగ్నిగ్రాగిన యినుపసూదు
లుగ్ర దృష్టిని జొన్పు డత్యాగ్రహమున (కాశీ ఖండము. 3.అ.)

ఈ బాధలన్నీ అనుభవించిన తరువాత పుణ్యమేమైనా కొంత వుంటే జీవుడు భువర్లోకపు పైభాగానికి వెడతాడు. ఈ బాధలనుభవించే దశలేనివాడు ఈ నరకభూమికకు రాకుండానే సరాసరి పైకివెడతాడు. ఈ భూమికలో లలిత కళాత్మకమైన అనుభూతులెక్కువగా వుంటవి. సంగీతమూ, నాట్యమూ, విద్యాధరులు, గంధర్వులు, అప్సరసలు విందులూ, వినోదాలు, విహారాలు - అంతా ఆనందమయమైన లోకము. తాను చేసుకున్న సుకృతం పూర్తయిన దాకా జీవు డీలోకంలో వుంటాడు.

చాలాకొంచెం పుణ్యం చేసినవాళ్ళు భువర్లోకంలో కొంచెంక్రింద పిశాచలోకంలో నివసిస్తారు. వీరి శరీరాలు ప్రేతశరీరాలుకావుగాని సౌందర్యవంతమైన దివ్యశరీరాలు కూడా కావు. జుంజురు వెంట్రుకలతో, బండి కందెనచాయ కాయములతో, గచ్చకాయలవంటి కనుగ్రుడ్లతో, గాడిద గొంతులవంటి వికృత కంఠస్వరములతో ఉంటూ కర్మానురూపమైన ఫలితములను అనుభవిస్తారు.

అత్యుత్తమమైన పుణ్యకార్యాలు చేసినవారు మహాతపస్సు చేసినవారు భువర్లోకందాటి పైకి వెళ్ళిపోతారు.

# గ్రహాలు - రకాలు

ఇంతకుముందే గ్రహాలలో వుండే దేవాసుర యక్ష రక్షో భూత ప్రేతాది విభాగాలు చెప్పబడినవి. అవి ఏ సమయాలలో పట్టుతవో చూడండి.

శ్లో ॥ దైవగ్రహాఃపౌర్ణమాస్యాం అసురాస్సంధ్య యోరపి
గంధర్వాః ప్రాయశోఽష్టమ్యాం యక్షాశ్చప్రతిపద్యథ
కృష్ణపక్షే చ పితరః పంచమ్యా మపిచోరగాః
రాక్షసానిశి పైశాచాః చతుర్దశ్యాం విశంతిచ

దేవగ్రహాలు పూర్ణిమినాడు, అసురగ్రహాలు సంధ్యా సమయంలోను, గంధర్వగ్రహాలు సాధారణంగా అష్టమితిథినాడు, యక్షగ్రహాలు పాడ్యమినాడు, అమావాస్యనాడు పితృగ్రహాలు, నాగగ్రహాలు పంచమినాడు, రాక్షసగ్రహాలు రాత్రివేళ, పిశాచాలు చతుర్దశినాడు ప్రవేశిస్తవి. ఈ గ్రహాలు యోగప్రభావం కలిగినవి కావటంచేత మనుష్యదేహాలలో ఉన్నవాటిని చూడటం సాధ్యంకాదు. తమ తమ గుణ ప్రభావాలచేత అవి మానవశరీరాన్ని పాడు చెయ్యకుండానే అదృశ్యమూర్తులై ప్రవేశిస్తాయి. అద్దంలో ప్రతిబింబాలుగా సూర్యకాంతమణిలోకి సూర్యకిరణంలాగా అవి ప్రవేశించటంవల్ల శరీరాలకు ఇబ్బంది వుండదు. సరికదా ఆయా గ్రహముల ప్రభావాలు, యోగశక్తులు ఈ మానవ శరీరాల ద్వారా ప్రకటితమవుతూ వుంటవి. అవి వదలిపోయినా దేహం యథాస్థితిలో వుంటుంది. ఉదాహరణకు వైష్ణవతేజస్సు తనలో ప్రవేశించటంచేత 21మార్లు క్షత్రియసంహారం చేసిన పరశురాముడు దశరధరాముని వలన తన తేజస్సు గ్రహించబడిన తరువాత వట్టి భార్గవఋషిగానే మిగిలిపోయినాడు. అయితే హింసాకాముకములైన గ్రహాలు ప్రవేశించినప్పుడు మాత్రం శరీరాలు దెబ్బతింటవి.

లోకంలో అధికంగా ప్రేతావేశములే ఎక్కువ. వాళ్ళలోకూడా రకరకాల మనస్తత్వాలు కలవాళ్ళుంటారు. వారివారి అవసరాలుబట్టి ఆవేశించిన మనుష్యులచేత పనులు చేయించుకుంటూ వుంటారు. ఇటీవల ఒక వుద్యోగికి మరణించిన ఒక ఉపాసకుడు దయ్యమై పట్టినాడు. కర్మపరిపాకమై అతని ప్రేతత్వము పోయి ఉత్తమగతులకు వెళ్ళాలంటే దేవతాపూజ రోజూ చెయ్యటం అవసరము అని అతడి కనిపించింది. అందుచేత తాను బట్టిన మనిషిని నిరంతరం దేవతార్చన చెయ్యమని,

సహస్రనామ పారాయణం చెయ్యమని, జపం చెయ్యమని చెవుల్లో పోరుతూ ఉండేవాడు. అలా చెయ్యకపోతే వెంటనే ఏదో బాధ కలిగేది. ఆ బాధ భరించలేక పట్టినవాడి ఆజ్ఞప్రకారం అర్ధరాత్రులనక, అపరాత్రులనక తలమీద స్నానంచేసి కఠోరనియమాలతో పూజలు జపాలు చేసేవాడు. ఈ విధంగా కొన్ని సంవత్సరాలు గడిచిన తరువాత ఆ ప్రేతజీవుడు ఈ శరీరాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. ఈ మనిషికి సహజస్థితి వచ్చింది. అంతకుముందు అతనికి ఉన్న అలవాట్లే మిగిలిన్ని.

అలానే ఒక కళాశాలలో ఒక ఉద్యోగిని వయసు ముదురుతున్నా తల్లిదండ్రులెంత బ్రతిమిలాడుతున్నా పెండ్లి చేసుకోనని నిరాకరించింది. వైరాగ్యం పండిన యోగినియా కాదు. భక్తురాలా కాదు. కనీసం జ్ఞానతృష్ణ కలిగినది కూడా కాదు. సంగతేమో తెలుసుకుందామని ఒక దార్శనికుడు తన యోగదృష్టితో పరిశీలించాడు. ఆమె సూక్ష్మశరీరాన్ని పూర్తిగా ఆక్రమించుకొని మరొక జీవుడున్నాడు. వాడుపూర్వం బ్రతికివున్న రోజుల్లో వాళ్ళింటికి వచ్చే ఒక పెద్దమనిషి ఆమెను తన మనస్సులో తీవ్రంగా వాంఛించాడు. వయస్సుయొక్క తారతమ్యాన్నిబట్టి అవస్థాభేదాన్ని బట్టి తన కామవాంఛను ఎప్పుడూ ఆమె దగ్గర వ్యక్తంచేయలేదు. కాలవశాన మరణించి ప్రేతమై తీరనికోరికతో ఆమె చుట్టూ తిరిగాడు. ఏ దుర్బల క్షణంలోనో ఆమెలో ప్రవేశం దొరికింది. నిత్యము నిశావేళ ఆమెను స్వప్నభూమికల్లో వాడు రమిస్తూ వున్నాడు. ఈ కన్య ఏమికన్య ? లోకం దృష్టిలో కన్య కాని స్ఖలిస్తూ వున్నది. రోజురోజుకు శరీరం బలహీనమవుతున్నది. ఎంతతిన్నా ఎంత సుఖంగా ఉందామని ప్రయత్నించినా ఏదో అసంతృప్తి ఆవహించి వుంటున్నది. ఆ కాముక ప్రేతజీవుడు ఈమెను రోజూ అనుభవిస్తూ వున్నాడు. తననెవడో బలవంతంగా నిత్యమూ భోగిస్తున్నాడని ఆ అమ్మాయికి తెలియదు. అప్పుడప్పుడు వయస్సహజంగా ఏవో అటువంటి కలలు వస్తున్నయిలే అని అనుకునేది. కొన్ని కలలు కలలవేళ అనుభూతినిస్తవి కాని తర్వాత గుర్తుండవు. ఆ కాముకుడామె మనస్సును ఆమెకు తెలియకుండా శాసించాడు. ఆమె తోడివారిలాగే పెండ్లాడి కుటుంబజీవితం గడపాలని కోరిక గలదే. కాని సమయం వచ్చేసరికి తెలియని ప్రేరణచేత వద్దని తిరస్కరించేది. ఇలా ఎందరి జీవితాలలో దుష్టప్రేత శక్తుల ప్రభావంచేత పాడవుతూ వుంటవి. కొందరి జీవితాలలో వివాహానంతరం ఈ కామపిశాచాలు పట్టుకుంటవి - భార్యాభర్తలమధ్య అనుబంధాన్ని చెడగొడతవి. ఒక్కొక్కసారి వివాహబంధమే విచ్ఛేదనం చేస్తవి. ఇది ఇందువల్ల జరిగింది అని

వారికి తెలియక ప్రతిక్రియ చేసుకోక ఆయా దుష్ఫలితాలను అనుభవిస్తూ వుంటారు.

తీవ్రమైన కోరికలచేత తపించి అవి తీరక మరణించిన వారు ప్రేతత్వాన్ని పొంది ఆకాంక్ష తీవ్రతచేత అవి తీరటానికికావలసిన కొన్ని అల్పశక్తులను పొంది వాయుదేహాలతో సంచారంచేస్తూ మనుష్యశరీరాలలో ఆవేశించి తమ కోరికలు తీర్చుకుంటూ వుంటారు. బలవంతంగా ఆత్మహత్య చేసుకున్నవాళ్ళకు కూడా ఇదే గతి.

ఈ మధ్యకొద్ది రోజులక్రింద ఒక జిల్లా కేంద్రములోని సంస్కృత కళాశాల స్థాపకులొకరు కాశీలో, గంగలో మునిగి ఆత్మహత్య చేసుకుంటానని రాసిపెట్టి పోయినాడు. మహత్తరమైన క్షేత్రం కనుక కాశ్యాంతు మరణాన్ ముక్తిః అని పురాణోక్తి ఉండటంవల్ల, అందులోను సర్వపాపాలను హరించే గంగలో మరణిస్తే నిస్సందేహంగా ముక్తి వస్తుందన్న విశ్వాసంతో కాబోలును అతగాడు తెలుగుదేశంనుండి చావటంకోసం అంతదూరం వెళ్లాడు. కాని పురాణాల ప్రకారం కాశీలో సహజంగా మరణిస్తేనే ముక్తికాని ఆత్మహత్య చేసుకుంటేకాదు. ప్రపంచం మొత్తంమీద ఆత్మహత్య చేసుకుంటే పాపం లేకపోవటమేకాక వచ్చేజన్మలో అన్నికోరికలు తీరేటువంటి ప్రదేశం ఒక్క త్రివేణీసంగమం మాత్రమే. ప్రయాగ మాధవుడు పరమ కరుణామయుడై తన దగ్గర ఏకోరిక కోరి మరణిస్తే ఆ కోరిక తీరుస్తాదని ప్రాచీన గాథలు చెబుతున్నవి. అనంతామాత్యుడు భోజరాజీయంలో ఈవిశేషాన్ని బహురమణీయంగా వర్ణించాడు. ఒకసారి గంగా, యమునా, సరస్వతి నదుల సంగమ స్థానానికి నలుగురు కన్యలు వచ్చారు. ఒక అమ్మాయి తనకు లోకోత్తర సౌందర్యవంతుడైన ఒకయువకుడు వచ్చే జన్మలో తన భర్తకావాలని కోరుతూ నీటిలోకి దూకి మరణించింది. ఇంకో బాలిక తనకు శౌర్యధైర్య సాహసాది సద్గుణోపేతుడు మరుజన్మలో పతి కావాలని కోరుతూ నీటిలో దూకింది. ఇంకొక కన్య భూమండలాన్ని ఏకచ్ఛత్రాధిపతిగా పరిపాలించే మహారాజు రాబోయే జన్మలో భర్తగా కావాలని కోరుతూ దూకేసింది. నాలుగవకన్య సంగీత సాహిత్య శిల్ప చిత్రలేఖన నృత్యకళా నిపుణుడు సుకుమారుడు తన భర్తకావాలని కోరుతూ నీటిలో దూకింది. ఇదంతా చూస్తున్న ఒక పేదయువకుడు రాబోయే జన్మలో ఈ నలుగురు తన భార్యలు కావాలని ప్రయాగ మాధవుణ్ణి ప్రార్థిస్తూ సంగమంలో దూకేశాడు. ఆ యువకుడే విక్రమార్కుడైనాడని సర్వకళాకోవిదుడై శౌర్యసాహసోపేతుడై చక్రవర్తియై ప్రకాశించాడని కథ. ఒకప్పుడు వీరశైవులు ఉగ్రభక్తితో శివుణ్ని స్మరిస్తూ

కొండశిఖరము నుంచి కిందికిదూకి మరణించేవారు. అగ్నిలో దూకి ఆత్మాహుతి చేసుకునేవారు. తమ చేతులతో కత్తిపట్టుకొని తల తరుగుకుని శివార్పణ చేసేవారు. ఇటువంటి భయంకర కృత్యాలవల్ల కైలాసవాసం సిద్ధిస్తుందని వారి నమ్మకము. శివుడనుగ్రహించి ప్రథమగణంలో తమను చేర్చుకొంటాడని విశ్వాసము.

ప్రాయశ్చిత్తం కింద కుమారిలభట్టు తుషాగ్ని ప్రవేశంచేసినట్లుంది. ఇలా ప్రాయోపవేశాదుల చేత మరణించి ప్రేతత్వాన్ని తప్పించుకోటానికి, దివ్యత్వాన్నందుకోటానికి వెనకటి కాలంలో రకరకాల ప్రయత్నాలు చేసేవారు.

మామూలుగా ఆత్మహత్య చేసుకొన్న వాళ్ళది బలవన్మరణం. ఈవిధంగానే, ప్రమాదాలలో మరణించినవాళ్ళు కూడా బలత్కార మృతివల్ల ప్రేతలై తిరుగుతూ వుంటారు. రోడ్డు, రైలుప్రమాదాలు జరిగేచోట్ల కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే సామాన్యంగా ఒకసారి ప్రమాదాలు జరిగినచోటనే మళ్ళీప్రమాదాలు జరుగుతూ వుండటం తరచుగా కనిపిస్తుంది. అక్కడ లోగడ చచ్చినవారు తమలోకి ఇతరులను చేర్చుకోవటంకోసం కావాలని ప్రమాదాలు సృష్టిస్తుంటారు. డ్రైవర్ల మనస్సులను వికలం చేయటంద్వారా ఘోరసంఘటనలు కలిగిస్తుంటారు. వంతెనలు, రావిచెట్లు, కాలువలు, గ్రామదేవతలు గుళ్ళు, పాడుబడిన యిండ్లు, పూజా పురస్కారాలు లేని ఆలయాలు,శ్మశానాలు - వీటి పక్కగా పోయేటప్పుడు వాహనాలవాళ్ళు చాలా జాగ్రత్తగా ఉండటం అవసరం.

# దయ్యం పట్టిన మనుషులు

సుశ్రుతంలో గ్రహముల విభేదాలు చక్కగా చెప్పబడినవి. అసంఖ్యాకములైన గ్రహాలలోని ఎనిమిది రకాలు వివరించబడినవి.

శ్లో ॥ అసంఖ్యే యాగ్రహగణాః గ్రహాధిపతయస్తుయే
వ్యజ్యంతే వివిధాకారాః భిద్యతే తే తథాష్టథా

వివిధమైన ఆకారాలతో విహరించే గ్రహములు ఎనిమిది రకాలు.

శ్లో॥ దేవాస్తథా శత్రుగణాశ్చ తేషాం గంధర్వ యక్షా పితరో భుజంగాః
రక్షాంసియా శ్చాపి పిశాచజాతిః ఏషోష్టకో దేవగణో గ్రహాఖ్యః

ఈ దేవ దైత్యాది గ్రహాల లక్షణాలు మహాభారతం అరణ్యపర్వంలో, శైవాగమంలో, సుశ్రుతంలో విశదీకరించబడినవి. ఏగ్రహం పట్టుకుంటే మనిషి ఎలా ఉంటాడనేది దానినిబట్టి నిర్ణయించవచ్చు.

శ్లో ॥ సంతుష్ట శ్శుచి రపి చేష్టగంధమాల్యః
నిస్తంద్రీ హ్యవితథ సంస్కృతప్రభాషీ
తేజస్వీ స్థిరనయనో వరప్రదాతా
బ్రహ్మణ్యోయం భవతి నరస్సదేవజుష్టః

ఎప్పుడూ సంతోషంతో శుచిగా ఉంటూ, గంధములందు, పూలయందు ఇష్టం కలిగి, నిద్రలేకుండా, సంస్కృతం మాట్లాడుతూ, వ్యర్థవాక్కు కాకుండా, మంచి తేజస్సు కలిగి, నిశ్చలనేత్రుడై, వరములనిస్తూ, బ్రాహ్మణుడై అలరారే మనుష్యుడు దేవగ్రహము పట్టుకొన్నవాడు.

శ్లో ॥ శుభగంధస్సు తేజస్వీ శుచిరుత్పలలోచనః
స్రగ్భూషణే ష్వపేక్షాచ స్తౌతి దేవాంశ్చసంతతం
దేవగ్రహగృహీతస్య చిహ్నాతం శంభునోదితం

కలువకన్నులతో స్రగ్భూషణాలంకృతుడై, దేవతా స్తోత్రములు చేస్తూ దైవగ్రహ గృహీతుడు ప్రకాశిస్తూ వుంటాడట !

ఇక దైత్య గ్రహంపట్టిన వాడి లక్షణాలు చూడండి.

శ్లో ॥ సంస్వేది ద్విజగురు దేవదోషవక్తా
జిహ్మాక్షోవిగతభయో విమార్గదృష్టిః
సంతుష్టోభవతి నచాన్న పానజాలైః
దుష్టాత్మాభవతిచ దేవశత్రుజుష్టః

ఎప్పుడూ చెమటలు క్రక్కేవాడు, ద్విజుల, గురువుల, దేవతల దూషించేవాడు, వంకర చూపులవాడు, భయములేనివాడు, చెడుమార్గమున చూపుకలవాడు, ఎంత తిన్నా, త్రాగినా తృప్తిపడనివాడు, దుష్టస్వభావుడు - దైత్యగ్రహావిష్టుడు.

శ్లో ॥ గంధమాల్య ప్రియోనంగ నర్తనంముఖరాననం
కురుతేసురత ప్రీతిం చిహ్నాం గంధర్వ దూషితం

గంధర్వగ్రహం పట్టినవాడు గంధమాల్యమునందు ఇష్టముకలిగి కామప్రేరకమైన నాటకములందు, సంగీతమునందు ఆసక్తి కలిగి వుంటాడు, ముఖ్యంగా రతిక్రీడయందు మిక్కిలి ప్రీతి కలిగి వుంటాడు.

**శ్లో ॥ పర్వతే రమతే నిత్యం సతతంరక్తలోచనః**
**క్షీరభోజ్యాదిభిః ప్రీతో అధోదృష్టిభిరాయతః**
**చలజిహ్వాలసద్వక్త్రః పుష్పమాలాంజనప్రియః**
**ఉరసాయాతినాగేన గృహీతస్యేంగితం నరః**

నాగగ్రహం పట్టినవాడు ఎర్రటి కండ్లతో వుంటాడు. కొండలపై క్రీడించాలని కోరుతుంటాడు. క్షీరభోజ్యములందు ఇష్టంఎక్కువ. పూలు, కాటుక అంటే ప్రీతి. నాలుక కదులుతూ వుంటుంది. క్రింది చూపులతో రొమ్ము విరుచుకొని నడుస్తుంటాడు.

**శ్లో ॥ మత్స్యమాంసరతో నిత్యం దౌర్మత్యాసుసమాహితః**
**శూన్యగ్రామ నివాసీచ రాక్షసాలింగితో నరః**

చేపలు, మాంసమూ రోజు తింటూ, దుష్టబుద్ధి కలిగి, పాడుబడిన ఊరిలో, ఇండ్లలో ఉంటూ వుండేవాడు రాక్షసగ్రహం పట్టుకొన్నవాడు.

బ్రహ్మరాక్షసులు పట్టినవాళ్ళు వేదం చదువుతూ, మహత్తరశక్తి సంపన్నులై ఎవరికీ లొంగక వ్యవహరిస్తూ వుంటారు.

కౌమార గ్రహాలు పట్టినవాళ్ళు పిల్లలలాగా ప్రవర్తిస్తూ వుంటారు.

**శ్లో ॥ రమతేబాలకైస్సార్థం సేవాక్రీడాదిభిస్సదా**
**కౌమారేణ గృహీతస్య చిహ్నామే తదుదీరితం**

పిల్లలతో ఆడుకుంటూ సేవాక్రీడలయం దభిరుచితో వుండటం వీరి ప్రత్యేకత.

ఇక బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాల, మ్లేచ్ఛాది గ్రహములు పట్టుకొన్నవారు ఆయా జాతి వర్ణాల లక్షణములను ప్రకాశితం చేస్తూ వుంటారు. అంటే ఇటువంటి వాళ్ళను ప్రేతములంటారు. పూర్వజన్మలో మనుష్యులై వుండి మరణించిన తర్వాత కర్మవశాన ప్రేతములై తిరుగుతూ మనుష్యులను పట్టుకొని పీడిస్తూ ఉంటారు. పూర్వ మానవజన్మ సంస్కారంవల్ల, వాళ్ళు దయ్యాలైనా ఆ

లక్షణాలు కొన్ని వాళ్ళవెంట వస్తూ వుంటవి. అందువల్ల వాళ్ళచేత ఆవేశించబడిన వాళ్ళు ఆ ప్రేతములయొక్క పూర్వజన్మ ప్రవర్తనకు సంబంధించిన అలవాట్లు, ఆచారాలు, అవసరాలు అనుసరిస్తూ, తీర్చుకుంటూ వర్తిస్తుంటారు. కనుకనే కొన్నిసార్లు గ్రహాగ్రస్తులైన వారు అంతకు ముందు తాగనివారు తాగుతారు. మాంసం తిననివారు తింటామంటారు. సుశీలం కలవారు దుశ్శీలురవుతారు.

దుష్టగ్రహాలలో ఎక్కువభాగం ప్రేతములే. భువర్లోక నివాసులైన విద్యాధర, గంధర్వ, యక్షరక్షః పిశాచాదులు ఎప్పుడో గాని వచ్చి మనుష్యులను పట్టుకోవు. ఆ లోకపు ఋణం తీరిపోయినప్పుడో లేక ఏదైన శాపంవల్లనో వాళ్ళు క్రిందికి దిగివచ్చి కొన్నాళ్ళు మానవశరీరాలను ఆవేశించి కర్మ తీరిపోయిన తర్వాత వెళ్ళిపోతూ వుంటారు. సిద్ధ, యక్ష గణములలో కొందరు మనుషులను తమకిష్టమైన లక్షణములు కలవారిని మాధ్యములుగా ఎన్నుకొని వారిలో ప్రవేశించి మహిమలను ప్రకటిస్తూ ఉన్నవాళ్ళు అక్కడక్కడ కనిపిస్తూ ఉన్నారు. ప్రసిద్ధులైన బాబాలలో, అమ్మలలో, ఎక్కువమంది అటువంటివారే. వాళ్ళకు మనుష్య శరీరాలమీద, మనస్సులమీద అధికారం ఉంటుంది. మనుషులకు వాళ్ళ మీద అధికారం ఉండదు. అందుచేతనే చాల సందర్భంలో మహిమలు వాటంతట అవి ప్రకటితమయ్యేచోట - అంటే వ్యక్తి సాధనతో, తపస్సుతో పనిలేకుండా అద్భుతాలు జరిగేచోట్ల ఎక్కువగా ఆయా మానవులకు తనయందు వ్యక్తమయ్యే శక్తులకు కారణమేమిటో తెలియదు. కారణం ఆ సిద్ధులపై వాళ్ళకు అధికారం, అదుపు లేకపోవటమే.

ఈ లోకంలో ఒకప్పుడు మనుష్యశరీరాలతో జీవించి మరణానంతరం ఊర్ధ్వగతులు లేక ప్రేతములైన జీవులు మన చుట్టూ అంతరిక్షములో తిరుగుతూ ఉంటారు. వారికి దేవతా లక్షణంగల దివ్యశరీరములుండవు. వాయుశరీరాలతో తిరుగుతూ కామక్రోధ క్షుత్పిపాసలచే పీడితులవుతూ సుఖాల కోసం వెంపరలాడుతూ ఉంటారు. వాళ్ళు అన్నీ చూడగలరు. కాని మాట్లాడలేరు. అందుచేత ఆ అనుభవము కోసం మనుషుల శరీరాలలో ప్రవేశించటానికి ఎప్పుడు అవకాశం వస్తుందా అని చూస్తూ ఉంటారు. ప్రయత్నిస్తూ వుంటారు.

ఎవరి కర్మమోకాలి మానసికంగా బలహీనుడై అశుచియైయున్న సమయంలో వారి శరీరాలలో వీటికి ప్రవేశం దొరుకుతుంది. అప్పటినుంచి వానిని పీడిస్తూ వాడు పొందే ఆహారమైథునాది భోగములను వీడనుభవిస్తూ తాము పట్టిన వానిని బలహీనుని చేసి ఆడిస్తూ ఆనందిస్తూ వుంటవి.

ఇండ్లలో చూడండి - అప్పుడప్పుడు పిల్లలు క్రిందపడితే జ్వరం వస్తుంది. ఒక్కోసారి రాత్రివేళ భయపడుతుంటారు. ఉలిక్కిపడి లేచి ఏడుస్తారు. పళ్ళు కొరుకుతారు. పాటు తగలటం, దిష్టి, గాలిసోకటం వంటి మాటలు వృద్ధులు వాడుతుంటారు. ఇవన్నీ దుష్టగ్రహాలక్షణాలే. మనస్సు వికలమై, భయభ్రాంతమై ఉన్న సమయాలలో సామాన్యంగా ఈ ప్రేతములు మనుషుల దేహాలలో ప్రవేశిస్తవి. మనుష్య శరీరము పరజీవుల ప్రవేశాన్ని భరించలేదు. తట్టుకోలేక ఘర్షణ పడుతుంది. అధికతరమైన శక్తిగల దుష్టగ్రహ ప్రభావాన్ని ఎదిరించలేని స్థితి వచ్చినప్పుడు ఏమీ చేయలేక లొంగిపోతుంది. అప్పుడు మొదలవుతవి బాధలన్నీ.

ప్రేతావేశంవల్ల వచ్చే బాధలు చాలారకాలు. ముందా ప్రేతజీవుడు పూర్వం చచ్చేటప్పుడు ఏయేవ్యాధులతో బాధపడుతూ వుండేవాడో ఆరోగాలన్నీ పట్టిన శరీరానికి దిగుమతి అవుతవి, ఎంతతిన్నా దయ్యంపట్టిన మనిషికి ఒంట పట్టదు. ఎందుకంటే తినేదాన్ని అనుభవించేది ప్రేతం గనుక. రోజురోజుకూ బలహీనుడవుతూ వుంటాడు.

"బలికామా రతౌకామా హంతుకామా ఇతిత్రిథా"

బలికాములు, రతికాములు,హంతుకాములు - అని ఈ దుష్టగ్రహాలు మూడురకాలు. ఆహారవాంఛ, మైధునవాంఛ, హననవాంఛ అంటే చంపేకోరిక గలిగి ఇవి తిరుగుతూ మనుష్యదేహాలలో ప్రవేశిస్తూ ఉంటవి.

ఎప్పుడైనా ప్రేమతో పట్టటం కూడా కద్దు. ఒక వృద్ధురాలు రోగగ్రస్తురాలై మరణించింది. ఆమెకు తనకున్న ఒకే ఒక కూతురియందు చాలాప్రేమ. ఆమె చనిపోయిన కొన్నాళ్ళకు కూతురికి కూడ అదే వ్యాధి వచ్చింది. ఒక మాంత్రికుడు తన దర్శనంలో చూస్తే ఆ తల్లి ప్రేతమై కూతురిని పట్టుకొన్నట్లు కనిపించింది. అత డడిగాడు "ఇదేమిటమ్మా, లోకంలో ఎవరైనా విరోధులను పట్టి పీడిస్తారు. రోగాలతో బాధిస్తారు. చంపుతారు. కానీ నీవేమో నీ కూతురినే పట్టుకొని పీడిస్తున్నావు. నీకెంతో ఇష్టమైన బిడ్డగదా ! ఏమిటీ విపరీతము' అని. ఆమె చాలా విచిత్రంగా సమాధానం చెప్పింది. "నా కూతురు చస్తే వచ్చే నష్టమేమిటి? నేను చావలేదా ? అల్లుడు నా బిడ్డను సరిగ్గా చూచుకోవటంలేదు. అందుకని అమ్మాయిని తీసుకెళ్ళిపోదామని వచ్చాను. నా దగ్గర హాయిగా ఉంచుకొంటాను" ఈ కూతురికి పాపం ! తన తల్లే తనను పీడిస్తున్నదనీ, ఆ పీడించటానికి విరోధంకాక ప్రేమ కారణమని తెలియదు.

మరణించేవరకే చావంటే భయంగాని మరణించిన తర్వాత అదేమీ ఉండదు. అందువల్లనే ప్రేతాత్మలకు మనుషులను చంపటమంటే పెద్దదోషంగా అనిపించదు. అదీగాక ప్రేతదశలో కామ క్రోధ మద మోహములు అతి తీవ్రమైన స్థితిలో ఉంటవి. ఈ దశలో ఏది దొరికితే అది అనుభవించాలన్న ఆదుర్దా, తీవ్రవాంఛ ఉండడంచేత, మంచి-చెడు ఆలోచించే విచక్షణా జ్ఞానం, వివేకం ఉండవు. కనుకనే ప్రేతములు తమ ఒకప్పటి ఆత్మీయులను కూడ పట్టుకోటానికి సంకోచించవు. ఆ ప్రేతస్థితి ఒక దుర్భరమైన, అవాంఛనీయమైన దశ.

# భూతావేశము

ఆవేశపూరితులైనప్పుడు మనుష్యులు ఎంత కష్టమైన పనినైనా అవలీలగా చేస్తారు. అందులోనూ ఏదైనా భూతమో, దైవమో ఆవేశిస్తే ఇక చెప్పాల్సిన పనిలేదు. ఇప్పటికి కూడా కొలుపులు, ఉత్సవాలు చేసేటప్పుడు నిప్పుల్లో దూకేవారు, నారసాలు గుచ్చుకునేవారు, రకరకాల సాహసకార్యాలు చేసేవారున్నారు. క్రీడాభిరామ కావ్యంలో అటువంటి పనులను వర్ణించిన తీరుచూస్తే నాటి సాహసకార్యాలు ఆశ్చర్యాన్ని కలిగిస్తవి.

రవరవమందు ఎఱ్ఱని చంద్రమల్లెల
చోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాడి అలుగుల గనపపాతర్లలో
ఉట్టిచేరులు గోసి ఉరుకువారు
గాలంపు గొంకి కంకాళ చర్మముగ్రుచ్చి
ఉడువీధి నుయ్యేలలూగువారు.
కటికి హొన్నాళంబు గండకత్తెరవట్టి
మిసిమింతులునుగాక మ్రింగువారు
సందులను నారసంబులు సలుపువారు
ఎడమకుడిచేత నారతులిచ్చువారు
సాహసముమూర్తిగైకొన్నసరణి వారు
ధీరహృదయులు మైలార వీరభటులు

పాండురంగ మహాత్మ్యంలో "అంభోధరము క్రింద నసియాడు నైరావతియు

బోలె సిడి(వేలె తెరవయోర్తు" అని చెప్పబడింది. ఒక పొడుగాటి స్తంభం పాతి దాని చివర కర్రకట్టి, ఆ కర్ర చివరి ఒక గాలంవంటి దానికి శరీరంలో కొంతభాగం గ్రుచ్చి ఆపైన అంతరిక్షంలో వేలాడుతూవుంటే నాలుగువైపులా ఆ కర్రను తిప్పుతూ ఉండటం జరుగుతుంది. గ్రామదేవతలకు మొక్కులు మొక్కుకొని తమ కోరికలు తీరిన తర్వాత భక్తులు తమ మొక్కులు తీర్చుకునే పద్ధతుల్లో సిడివేలటం ఒకటి. ఇటువంటి వాటన్నింటికి ఆ దేవతాభక్తిచేత కలిగిన తీవ్రావేశమే కారణం. ఆ ఆవేశమే ఆ భక్తులకు బాధలేకుండా అంత సాహసకార్యాలు చేసే శక్తినిస్తుంది. ఆయా దేవతల తేజస్సు కొంత వారిలో ప్రవేశించటం వల్లనే అంత భయంకర కృత్యాలు వారు చేయగల్గుతున్నారు. మహమ్మదీయులలో కూడ పీర్లపండుగలప్పుడు, మరికొన్ని సమయాలలోనూ ఇటువంటి వీరకృత్యాలు చేయటం ఉంది.

సామాన్యంగా ఆవేశమనేది ఎప్పుడూ అధికశక్తియుతులు తమకంటె అల్పులను ఆవేశించటమే జరుగుతుంది. అలా ఇతర జీవులలో ప్రవేశించి తమ యిష్టమైన పనులను ఆ అధికులు చేస్తూ ఉంటారు. వారి కాజీవుల శరీరాలు ఆలంబనం.

భారతములో పౌష్యుని కథ ఆ విధమైనది. రాక్షసునిచే మోసపుచ్చబడిన ఆ రాజు వసిష్ఠునికి నరమాంసయుతమైన భోజనం పెట్టాడు. మహర్షికి కోపం వచ్చి అసురత్వం పొందమని శపించాడు. అందులో తాను తెలిసిచేసిన దోషమేమీ లేదని, విచక్షణ లేకుండా తనను శపించిన వసిష్ఠునకు ప్రతిశాపం ఇస్తానని రాజు జలం గ్రహించాడు.

కాని అతని పత్ని అడ్డువచ్చి గురుని శపించరాదని ప్రార్థించింది. పౌష్యుడు శాపజలాన్ని ఎక్కడా విడవగూడదు, గనుక తన కాళ్ళమీదనే పోసుకున్నాడు. అందుచేత కల్మాషపాదుడైనాడు. అసురభావం పొందిన కల్మాషపాదుడు ఒకనాడు రథమెక్కిపోతూ ఎదురువచ్చిన వసిష్ఠపుత్రుడు శక్తిని అడ్డుతొలగనన్నాడని కశాఘాతముచే పీడించాడు. శక్తి ఆగ్రహించి అతనిని రాక్షసుడు కమ్మని శపించాడు. రెండవ శాపంతో రాక్షసరూపం కూడా వచ్చింది. ఆ సమయంలో అదృశ్యుడుగా ఉన్న విశ్వామిత్రు డిది చూచి తన మిత్రుడైన ఒక రాక్షసుణ్ణి ఆ శాపగ్రస్తునిలో ప్రవేశించమని ప్రేరేపించాడు. ఋషిశాపం, రాక్షసావేశం కలిసి క్రూరుడై కల్మాషపాదుడు శక్తినేగాక వసిష్ఠపుత్రులు నూర్వురినీ భక్షించాడు. తరువాత కొంతకాలానికి శక్తి భార్యయైన అదృశ్యంతిని మింగబోయి వసిష్ఠహుంకారముచే

నివారితుడై శాపవిమోచం పొందాడు. రాక్షసావేశాలు ఇలా వుంటవి.

సామాన్యమనుష్యులను సరే! దివ్యాంశసంభూతులను కూడా భూతగణం ఆవేశించగలదా ? ఇది చాలా జాగ్రత్తగా పరిశీలించవలసిన విషయం. భారతములో ఘోషయాత్రా ఘట్టంలో ఒక విచిత్రమైన అంశం ఉంది. గంధర్వులచేత అవమానం పొంది, భీమార్జునులచే విడిపించబడి, ధర్మరాజుచేత మందలించబడి తిరిగివెళుతూ మానధనుడైన దుర్యోధనుడు మరణించాలని నిశ్చయించుకొని ప్రాయోపవేశం పూనాడు. అత డప్పుడే మరణించటం. పాతాళలోకం లోని రాక్షసులకిష్టం లేదు. వారు హోమం చేసి ఒక కృత్యను ఆవాహనంచేసి దాని సహాయంతో దుర్యోధనుణ్ణి తమ దగ్గరకు తెప్పించుకున్నారు. అతని జన్మరహస్యాన్ని తెలియజేసి రాబోయే మహాసంగ్రామంలో పాండవులను తప్పక గెలుస్తావని చెపుతూ, పాండవ పక్షపాతులైన భీష్మద్రోణాదులను యుద్ధసమయంలో ఆవేశించి వారిచేత క్రూరంగా సంగరం చేయించి పాండవ నాశనం చేయిస్తామని మాట యిచ్చారు. దీన్నిబట్టి దివ్యతేజో విలసితులను గూడ మహత్తరశక్తియుక్తులైన రాక్షసులు ప్రవేశించగలరని అనిపిస్తుంది.

విద్యారణ్యస్వామి రచించిన శంకరవిజయంలో ఒకక్షుద్ర మాంత్రికుని ప్రయోగంవల్ల శంకరాచార్యస్వామికి భగందరవ్యాధి వచ్చినట్లు శిష్యుడైన పద్మపాదుడు తన నరసింహోపాసన శక్తిచేత దానిని నివారించినట్లు వ్రాయబడింది. అదేవిధంగా వివేకానందస్వామి జీవితంలో కాశ్మీరులో ఒక మహమ్మదీయ మాంత్రికుని ప్రయోగంవల్ల బాధపడినట్లుగా వుంది. వీటినిబట్టి చూస్తే అవతారమూర్తులలో గూడ భూతపిశాచములు ప్రవేశించగలవని తెలుస్తున్నది. తరువాత వాటిని నివారించుకోవటం వేరే విషయం. ముందు ప్రవేశిస్తవని అంగీకరించాలి.

పాశ్చాత్య వాఙ్మయంలో దేవునికి భూతనాధునికి మధ్యగల వైరాన్ని గురించి ఎన్నో కథలున్నవి. వాళ్ళ దేవతలు, భూతాలు తమ తమ సామ్రాజ్య విస్తరణకోసం, మానవులలో తమ ప్రాబల్యంపెరగటం కోసం నిరంతరం ప్రయత్నం చేస్తుంటారు. ముఖ్యంగా భూతములు అనేక ప్రలోభాలు చూపించి, సుఖభోగాలు ఎరగా ప్రదర్శించి మానవులను తమ వర్గంలో చేర్చుకోటానికి ఎన్నో రకాలుగా యత్నాలను చేస్తుంటారు. అటువంటి వాటిల్లో ఫాస్టుకథ ప్రసిద్ధమైనది. సామాన్యుడైన ఒక యువకుడతడు. తన ఊరిజమిందారు కూతురును మనసారా ప్రేమించిన అతడ్ని

ఆ అమ్మాయి కూడా వలచింది. కాని దారిద్ర్యం అడ్డుగోడగా నిలచి అతనిని కారాగారంపాలు చేసింది. కఠినుడైన జమిందారు అతనికి మరణశిక్ష విధించాడు. తెల్లవారితే ఉరిశిక్ష. నాటిరాత్రి అతడు జైలు గోడమీద లిఖించబడివున్న ఒక పురాతన లేఖనము చూచాడు. అదియొక పిశాచమంత్రం. చదువగానే భూతనాధుడు ప్రత్యక్షమైనాడు. అన్ని కష్టాలనించి గట్టెక్కించి ఇరవైనాలుగేండ్లు కోరిన సుఖాలన్నీ ప్రసాదిస్తాననీ, భోగాలలో ఓలలాడిస్తాననీ, ఈ కాలంలో అతడు దేవాలయంలో అడుగుపెట్టటంగాని, దేవుడ్ని స్మరించటంగాని చేయరాదని నియమాలు విధించాడు. ఇరువది నాలుగు సంవత్సరాల తర్వాత అతడు తన వశం కావలసివుంటుందని హెచ్చరించాడు. మృత్యుముఖాన వున్న ఆ యువకుడు కోరి చావును తెచ్చుకోలేక భూతనాధుని నియమాల అంగీకరించి ఆ నియతకాలం మహాభోగాలనుభవించాడు. భూతావిష్టుడైన పాస్టు చేయలేని పనిగాని, సాధించలేని కార్యంగాని వుండేదికాదు. అపారసుఖాలనుభవించి తరువాత పాపపంకములో కూలిపోయినాడతడు.

క్షుద్రోపాసనలలో భూతావేశములలో ఉండే ఫలితాలివి. ఎవడే దేవత నుపాసిస్తే అంతమున ఆ దేవతాలోకానికి వెళతాడు భక్తుడు. భూతములను, పిశాచములను ఉపాసించినవాడు తాత్కాలికంగా ఒక మెరుపు మెరసినట్లు ప్రకాశించినా అంతమునందు పిశాచగణములో తానూ ఒకటై, ఆ పిశాచము చెప్పిన పనులను ఇష్టమున్నా లేకపోయినా చేస్తూ వుండవలసి వస్తుంది. దేవత - భక్తుని రక్షిస్తుంది. భూతము రక్షించినట్లు, ప్రభావాన్ని ప్రసాదించినట్లు కనిపించి, చివరకు భక్షిస్తుంది. దేవత నుపాసించినవాడు దేవత అవుతాడు. పిశాచమును ఉపాసించినవాడు పిశాచమవుతాడు.

ఒక మంత్రాన్ని ఉచ్చరిస్తే మంత్రాధిష్ఠాన దేవత ఆకర్షించబడుతుంది. ఆ మంత్రచైతన్యము సాధకుని మనశ్శరీరములను ఆక్రమిస్తుంది. సాధన చేయగా చేయగా ఆ మంత్రము తానే అయ్యేస్థితి వస్తుంది. ఆ దేవత తానే అవుతాడు భక్తుడు. అంగన్యాస కరన్యాసములలోని అంతరార్థమిదే. తన శరీరంలోకి దేవతను ఆవాహనం చేసే ప్రక్రియ అది. యక్షరాక్షసులను రాజసమూర్తులనీ, భూతప్రేతములను తామసమూర్తులనీ భగవద్గీత వివరిస్తున్నది.

**శ్లో ॥ యజంతే సాత్వికా దేవాన్ యక్షరక్షాంశ్చ రాజసాః**
**ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజంతే తామసాజనాః**

తామసములైన భూతప్రేతముల ఆవేశంపల్ల మేలు జరుగదు. అప్పటికేదో కొంత ఉపకారం జరిగినట్లు అనిపించినా, కనిపించినా తుదకు వచ్చేది అపకారమే. ఆయా భూతాదుల గుణములు ఉపాసకులకు సంక్రమించి జీవుడు మరింత అధోగతి పాలవుతాడు. కనుక భూతోపాసన దానివల్ల కలిగే భూతావేశాది విశేషాలు అంతిమ ఫలితదృష్టితో శ్రేయస్కరంకాదు.

# గ్రహాలు - దయ్యాలు

అనేకవిధాలైన భూతాలు మనుషులను ఆవేశిస్తుంటవి. కాని సామాన్యంగా ఆవిష్టులైనవారికి తమనెవరో ఆవేశించారని తెలియదు. ఆ అధికశక్తుల ప్రేరణచే ప్రవర్తిస్తూ తమ సొంత ఆలోచనచేతనే అలా నడుచుకొంటున్నామని అనుకొంటూ వుంటారు. అటువంటి వారిని మీరు గ్రహగ్రస్తులైనారంటే నమ్మరు. తాము తమ మనస్సుతో ఆలోచిస్తూ పనిచేస్తూ వుంటే తమ మనస్సులో, శరీరంలో గ్రహాలేవో ప్రవేశించి ప్రభావితం చేస్తున్నవని అనుకోవటం ఎక్కువమందికి ఇష్టం ఉండదు. ఒక దయ్యం పట్టి తానావహించిన మనిషి మనస్సును పూర్తిగా స్తబ్ధంచేసి పరిపూర్ణంగా వ్యక్తమై నేను ఫలానా వ్యక్తిని. ఈ శరీరాన్ని పట్టుకొన్నాను అంటే అప్పు డెక్కువగా నమ్ముతారు. అప్పుడు గూడా నమ్మక మనోభ్రాంతి అని త్రోసిపుచ్చేవారు కూడా వుంటారు. వాళ్ళ సంగతి అలా వుంచండి. ఆస్తికులను మాత్రం శాస్త్రపురాణాది ప్రమాణాలు చూపించి, అప్పుడప్పుడు వ్యక్తపిశాచ ప్రవర్తనను ప్రత్యక్షముగా చూపించి, నమ్మించవచ్చు. ప్రత్యక్షముతోపాటు అనుమానము, ఆప్తవాక్యము కూడా గొప్ప ప్రమాణాలే. మనుష్యులను గ్రహించే భూతములకు గ్రహములని పేరు.

శ్లో॥ హింసా వికారాయేకేచిత్ దేవభావము పాశ్రితాః
భూతానీతి కృతాసంజ్ఞా తేషాం సంజ్ఞా ప్రవక్ష్యభిః
గ్రహసంజ్ఞాని భూతాని . . . సుశ్రుతం.

దేవత్వం ఉండి, హింసా వికారము గలవారిని శాస్త్రజ్ఞులు భూతములన్నారు. మనుష్యులను పట్టకొంటవి గనుక గ్రహాలన్న పేరు వచ్చింది. ఇవి అసంఖ్యాకాలు. అయినా వీటిని ఎనిమిది రకాలుగా ప్రధానంగా చెప్పవచ్చు.

శ్లో ॥ దేవా స్తథాదైత్య గణాశ్చ తేషాం
గంధర్వ యక్షాః పితరో భుజంగాః
రక్షాంసియాచాపి పిశాచజాతిః
ఏ షాష్టకో దేవగణో గ్రహాఖ్యః

1) దేవ, 2) దైత్య, 3) గంధర్వ, 4) యక్ష, 5) పితృ, 6) నాగ, 7) రాక్షస, 8) పిశాచ - వర్గములు.

అతీతశక్తులుగల ఈ దేవదానవ పిశాచాదుల భేదాలు రకరకాలచ్చో రకరకాలుగా వుంది. మరొక తంత్ర గ్రంధ కధనం గమనించండి.

శ్లో ॥ ఆగంతవో గ్రహాజ్ఞేయా వక్ష్యమాణా సురాదయః
అమర్త్యబల విజ్ఞాన విక్రమాది సమన్వితాః
అమరా అసురా నాగ యక్ష గంధర్వ రాక్షసాః
హేధకశ్మల నిస్తేజో భస్మకాః పితరఃకృశాః
వినాయకాః ప్రలాపాశ్చ పిశాచాంత్యజయోనిజాః
భూతాః ప్రేతాః బ్రహ్మరక్షో నృప వైశ్యాశ్చ శూద్రజాః
వృషలా నీచ చండాలా అపస్మారాశ్చ ఛద్మజాః

అమరులు, అసురులు, యక్షులు, నాగులు, రాక్షసులు, కూష్మాం వినాయకాదులు, బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాల ప్రేతములు మొదలగున ఈ గ్రహములలోని భేదములు. ఇవి అనూహ్యమైన బలవిజ్ఞాన విక్రమములత ప్రకాశిస్తూ వుంటవి.

ఇవి ఎక్కడ ఉంటవి ? అని సహజంగా సందేహం కలుగుతుంది. వాటి స్థానాలు పరికించండి.

శ్లో ॥ గృహాశ్మకూలా శైలాగ్రవనోపవనసానుషు
సరిద్వాపీసరః కూపతటాకోదన్వతాంతటే
సంగమే సరిదావర్తే గోకులే శూన్యమందిరే
ఏకవృక్షే చితాస్థానే ప్రభ్రష్టే దేవతాగృహే
నిధిదేశేరసక్షేత్రే బలిద్వారే చతుష్పథే
గ్రామ సీమాంతరే మాతృస్థానే చ క్షేత్రతీర్థయోః

ఆరామోద్యానయోః సౌధప్రాసాదాట్టాలకేషుచ
క్రీడాపరావసంత్యేషు స్థానేష్వన్యేషు చ గ్రహాః

సామాన్యంగా గ్రహాలు కొండలమీద, పురాతన వృక్షాలమీద, చెరువు, సముద్రము, నదులఒడ్డున, నదీసాగర సంగమంలో, గోకులమున, ఎవరు లేని ఇంట్లో, శ్మశానంలో, చితిపై, కొన్నాళ్ళు దేవతాపూజచేసి మానినచోట, నిధుల దగ్గర, ఊరి పొలిమేరలయందు, మాతృకల దగ్గర, క్షేత్రతీర్థాలలో, తోటలలో, మేడలపై వుంటవి. ఇది స్థూలంగా చెప్పేదికాని, ఎక్కడపడితే అక్కడ సిద్ధదేవతా సన్నిధిలో తప్ప స్వేచ్ఛగా విహరిస్తూ వుంటవి.

అవి యెవరిని బాధించటానికి పూనుకొంటవో ఆ వివరాలు కూడా ఆసక్తికరంగావున్నవి.

శ్లో ॥ సిద్ధక్షేత్ర ప్రదేశేతు రజస్తామసభావుకః
అయోగ్య ఫలవాంఛాయై యః కరోతిజపాదికం
తస్యబాధాంకరోత్యేవ దేవతా ప్రేరణైస్సహ.

పరమపుణ్య ప్రదమైన సిద్ధక్షేత్రంలో రాజసతామస గుణముగల భావములతో అయోగ్యములైన కోరికలు ఫలింపజేసుకోటానికి ఎవరు జపతపములు చేస్తాడో వానిని దేవతా ప్రేరణచే గ్రహాలు పట్టుకొని బాధలు కలిగిస్తవి.

అంటే సత్వగుణ ప్రధానమైన శాంతస్థలాలలో, అక్కడి పవిత్ర వాతావరణాన్ని దుష్టవాంఛలతో కలుషితం చేయటాన్ని క్షేత్రదేవతలు సహించరన్నమాట. కోరికలు తీరవు సరిగదా - లేని ప్రమాదాన్ని తెచ్చుకుంటాడు సాధకుడు. కనుక తన వాంఛనుబట్టి సాధన స్థానాన్ని ఎన్నుకోవాలి ఎవడైనా.

అవతలివాడు నాశనం గావాలి - నేను వృద్ధిపొందాలి, నా శత్రువులు చావాలి - నేను బ్రతకాలి, వాడు దరిద్రుడు కావాలి - నేను కుబేరుడ్ని కావాలి, ఫలానావాడి భార్య నాకు వశంకావాలి, నేను కోరిన స్త్రీలంతా నాకు లొంగిపోవాలి, నే నెన్ని అక్రమాలు చేసినా నేను రక్షించబడాలి, నే నెవరికి దొరకకూడదు - ఇలాంటి కోరికలతో దివ్యక్షేత్రాలకు పోగూడదు. పోతే ఆ కోరికలను క్షేత్రదేవతలు తీర్చకపోవటమేగాక అట్టివారిని శిక్షిస్తారు కూడా, ఆ దేవతల ఆజ్ఞచేత వాళ్ళను భూతములు పట్టుకొని పీడిస్తవి. కనుక మహాక్షేత్రాలకు దుష్టబుద్ధులతో పోయి పూజాదులు చేస్తే తమ చెడుకోరికలు సిద్ధించక పోవటమటుంచి దయ్యం నెత్తికెక్కి

వెంటపడుతుందన్న విషయం జనం గ్రహించటం మంచిది.

శ్లో ॥ దేవతాభక్తిసంయుక్తం విరక్తం భక్తిసంయుతం
వృధా మత్సర సంయుక్తశ్చేత్ తస్యోపాసనదేవతాః
రాక్షసాంచ పిశాచాంశ్చ ప్రేరయంత్యనిశంతథా

ఒకడు దేవతా భక్తుడైనా వృధామత్సర సంయుక్తుడైతే అతనిఉపాస్యన దేవతలే అతడ్ని పీడించటానికి రాక్షసులను పిశాచాలను ప్రేరేపిస్తవి.

ఆరాధించబడే దేవతలే భక్తుణ్ణి శిక్షించటం చిత్రంగా తోచవచ్చు. ఇందులో ఒక రహస్యంవుంది. ఒక వ్యక్తి జపతపములు చేశాడనుకోండి. దేవతను భక్తితో కొలిచాడనుకోండి. దాని ఫలితముగా ఆ సాధకుడికి కొన్ని సిద్ధశక్తులు వస్తవి.

అతడు మత్సరగ్రస్తుడైతే ఆ సిద్ధులు దుర్వినియోగం కావచ్చు. ఇతరుల కపకారం జరగవచ్చు. అక్రమాలు,అన్యాయాలు వాటిల్లవచ్చు. దానివల్ల లోకవ్యవస్థకు భంగం వాటిల్లుతుంది. దాన్ని అరికట్టటానికి ముందే దేవతలు సాధకుణ్ణి పరీక్షిస్తారు. దివ్యములైన సిద్ధులు ఉత్తమ గుణయుతునకే దక్కేటట్లు, దుష్టులకు లభించకుండా ఉండేట్లు చూడటమే విశ్వకళ్యాణకారులైన దేవతల కర్తవ్యము. పురాణాలలో ఋషుల చెంతకు ఇంద్రు డప్సరసలను పంపటం ఆ పరీక్షలో భాగమే. కామక్రోధాలకు వశులుగాని వారికే యోగశక్తులు లభించేలా జాగ్రత్తపడటం ఆ త్రిలోకనాధుని దీక్ష. అయితే అతడ్నికూడా తిరస్కరించి, సహజంగా కామక్రోధాది గుణయుతులయినా తపోవ్రత వేళ మాత్రం వాటికి లొంగకుండా పట్టుదలతో శక్తులు సాధించేవాళ్ళు రాక్షసులు. రావణాదు లిట్టివారే.

ఇక గ్రహాలు మంత్రతంత్ర శస్త్రాదులచే ఇతరులను హింసించే వాళ్ళను కూడ పట్టుకొంటవిట ! భూతతంత్రం ఇలా పలుకుతున్నది.

శ్లో ॥ మంత్రప్రయోగశస్త్రాద్యైః హింసాంచైవకరోతియః
తస్య తద్వైరరూపేణ గ్రహోగృహ్ణంతిపూరుషం

ఇంకా విశేషాలు చూడండి.

శ్లో ॥ మహాపాతక సంయుక్తం పుణ్యక్షేత్రేవసన్నపి

పుణ్యక్షేత్రంలో ఉంటున్నా ఘోరపాపములు చేసినవాడ్ని క్షేత్రదేవత ఆజ్ఞ తీసుకొని గ్రహాలు పట్టుకొంటవి.

ఈ సందర్భంగా రామకృష్ణ పరమహంస చెప్పిన ఒక కథ గుర్తు చేసుకోదగింది. చమత్కారంగా మాట్లాడుతూ ఒకసారి ఆయన గంగాస్నానం చేసేటప్పుడు మహాపాపి పాపాలన్నీ ఒడ్డున ఉన్న చెట్టుమీదికి ఎక్కి వాడు ఈవలకు రాగానే మళ్ళీ పట్టుకొంటవని అన్నారు.

శ్లో ॥ బ్రాహ్మణంవా యతింవా ధ శతసాహస్రపోషకం
యేనకేనా ప్యుపాయేన యః కరోతిచ మారణం
దేవాజ్ఞయా సమనుజో గ్రహగ్రస్తోభవేత్ ధ్రువం.

బ్రాహ్మడ్నిగాని, యతినిగాని, అనేకులను పోషించే మనిషినిగాని ఏ ఉపాయంచేత చంపినాసరే హంతకుణ్ణి దేవాజ్ఞచేత గ్రహములు గ్రసిస్తవి.

ఈ శతాబ్దంలోనే విజయనగరంలో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. శ్రీ పీఠభక్తుడైన ఒక చిన్నఉద్యోగిని ఒక ఉన్నతోద్యోగి తీవ్రంగా అవమానించాడు. బాధితుడైన ఆ వ్యక్తి పీఠమునకు సంబంధించినవాడు, పండిత విధేయుడు, వినయభూషణుడు కావటంవల్ల మిత్రులైన ఉపాసకులు అతని ప్రేరణవల్ల ఉన్నతోద్యోగిపై ప్రయోగం చెయ్యాలని నిశ్చయించారు. ముందుగా ఒక హెచ్చరిక పంపారు. అవమానం చెందిన తమ స్నేహితునికి క్షమాపణ చెప్పాలని లేకుంటే మారణప్రయోగంచేసి చంపుతామని. ఉన్నతోద్యోగి నవ్వి ఊరుకొన్నాడు. వీళ్ళ మాటలను ఖాతరు చేయలేదు. వెంటనే వీళ్ళు ఇరువదియొక్క రోజులలో మరణం కలిగించే భైరవహోమం మొదలుపెట్టారు. రోజులు గడుస్తున్నకొద్దీ మళ్ళీ మళ్ళీ హెచ్చరికలు పంపారు. అధికారి లెక్కచేయలేదు. ఇరవై యొకటో రోజు సాయంకాలం పూర్ణాహుతి జరిగింది. జరిగిన మూడునిమిషాలకే ఆ అధికారి కుక్కలాగా మూడుసార్లు అరచి మరణించాడు.

అయితే ఇది జరిగిన కొద్దికాలానికే బ్రహ్మహత్యా ఫలితంగా ప్రయోగకర్తలు, కారయితలు అందరూ కుటుంబనాశనం అయిపోయినారు. అవతలివ్యక్తి శిక్షింపదగిన దుర్మార్గుడే అయినా శిక్షించే అధికారం రాజుకు, యముడికి మాత్రమే ఉంది. ఇతరులా పనిచేస్తే చట్టాన్ని తమ చేతిలోకి తీసుకొన్న వాళ్ళయి దానివల్ల వచ్చే ప్రతిక్రియా ఫలితాన్ని పొందుతారు. కనుకనే మారణ ప్రయోగాలు తొందరపడి చేయరాదని పెద్దలు చెపుతూ వుంటారు.

ఇంకా గ్రహాలు ఎవరిని పట్టుకొంటవో తంత్రశాస్త్రాలలో చెప్పబడింది.

పురుషులను :

"హృష్టం క్లిష్టం హతం క్రుద్ధం హసితం భీతశోకినం
శర్వరీస్థితముచ్ఛిష్టం వ్యాధితం సకుతూహలం
అలాభమూఢం పూర్వాప్త నష్టద్రవ్యం వియోగినం
ఏకాకినం కాంతతనుం భూషితంచ నిరాయుధం ...".

చింతాశోకాన్వితుని, హర్షక్లేశభయాది సమన్వితుని, హాస, కోపాధికుని, వెన్నెలలో ఉన్నవానిని, ఉచ్ఛిష్టుని, ఏకాకిని, అందమైనవానిని, అలంకృతుని, నిరాయుధుని ... ఇత్యాది పురుషులను గ్రహములు పట్టుకొనును.

స్త్రీలలో . . .

"ప్రసూతాం గర్భిణీం నగ్నాం ఋతుస్నాతాందురాచరీం
ఆసన్న పుష్పాం కామార్తాం మద్యమత్స్య ప్రకాంక్షిణీం
వ్యూహమానాం విలాసాఢ్యాం రథ్యాచత్వరయోఃస్థితాం
ప్రాప్త ప్రథమసంభోగాం తైలాభ్యక్తామవర్జితాం
హృష్టాం మూఢాం విభక్తాంగీం హసంతీం అవమానితాం...

ప్రసవించిన దానిని, గర్భిణిని, దిగంబరను, ఋతుస్నానము చేసిన దానిని, పుష్పవతి కానున్నదానిని, కామవాంఛ తీవ్రంగా ఉన్నదానిని, మద్యాదులు కోరుదానిని, మొదటిసారి సంభోగము పొందినదానిని, నూనె అంటుకొన్నదానిని నాలుగురోడ్ల కూడలిలో ఉన్నదానిని విలాసవతిని, అవయవములు విచ్చలవిడిగా వదిలివేయుదానిని, ఎప్పుడూ నవ్వేదాన్ని, అవమానితురాలిని ... ఇత్యాది పరిస్థితులు గలవారిని గ్రహములు పట్టుకొనును. ఈ గ్రహములకే దయ్యము లనేది తెలుగుమాట.

# ప్రేతాత్మల ఆవాహన

మానవులు చనిపోయిన తర్వాత స్వర్గానికిగాని, నరకానికిగాని పోవచ్చు. మళ్ళీజన్మ ఎత్తటానికి స్త్రీ గర్భంలో ప్రవేశించవచ్చు. లేదా ప్రేతరూపంతో ఇక్కడే తిరుగుతూ వుండవచ్చు. పుణ్యపాపాల ఫలితాలు అనుభవించటానికి స్వర్గ, నరకాలకు వెళ్ళినవాళ్ళు ఈ లోకానికి సుదూరంగా ఉండిపోతారు. అనుభవం

పూర్తిఅయిన తర్వాత భూలోకానికి వచ్చి జన్మయెత్తుతూవుంటారు. అనుభవకాలం సామాన్యముగా మూడుతరాలకాలం వుంటుందని భావించారు ప్రాచీనులు - అంతకాలం ఇతర లోకాలలోనివారి తృప్తికోసం వారి సంతానం తద్దినాలు పెడుతూ వుంటారు. ఎక్కడో కొద్దిమంది వెంటనే మరుజన్మానికి వెళ్తూ ఉంటారు.

మరికొందరు తీవ్రమైన అసంతృప్తితో మరణించినవారు, కామక్రోధములు ఎక్కువగా వుండి అవి తీరక చనిపోయినవారు, బలవన్మరణము, ఆత్మహత్య చేసుకున్నవారు, ప్రమాదములలో పోయినవారు సామన్యముగా ప్రేతత్వం పొందుతూ వుంటారు. పాంచభౌతికమైన శరీరాన్ని విడిచి పెట్టిన తర్వాతకూడా అనుబంధాలు, మమకారాలు, ద్వేషరోషాలు పోక,ఊర్ధ్వలోకాలకు పోలేక, ఆకలిదప్పికలతో పీడించబడుతూ వాయుశరీరులై తిరుగుతూ వుంటారు. మానవశరీరాలలో ఎక్కడైనా,ఎప్పుడైనా ప్రవేశం దొరకటం కోసం వేచి, పొంది అవకాశం దొరకగానే దూరి తాము సుఖిస్తూ చేరిన దేహాన్ని బాధలపాలుజేస్తూ వుంటారు.

మాంత్రికులు తమ కార్యసిద్ధి కోసం ఈ ప్రేతజీవులను వశం చేసుకొంటుంటారు. మంత్రసిద్ధిచేత సాధించిన వశీకరణ శక్తిచేత ప్రేతములను ఆవాహనం చేయగలిగినవాడు వాటినుండి ఎన్నో విశేషాలు తెలుసుకొని తన పనులకు వాటిని ఉపకరణాలుగా వాడుకొంటాడు.

భౌతికమైన ఈ శరీరాలకులేని సౌకర్యాలు కొన్ని ఆప్రేత శరీరాలకున్నవి. ఎన్ని వందల మైళ్లైనా సునాయాసముగా కొద్దినిముషాలలో చుట్టి చూచి రాగల దేహాలవి. కనుక ఎక్కడ ఏమి జరుగుతున్నదో క్షణంలో చెప్పగల శక్తి వాటికుంటుంది. అయితే భవిష్యత్తును తెలుసుకోగల దివ్యశక్తి వాటికుండదు. మంత్రప్రేరణవల్ల ఇతరులకు అపకారము చేయటము, మనస్సుల మీద ప్రభావము చూపించటము ఇవి చేయగలవు.

మనచుట్టూ ఉన్న వాతావరణంలో అవి నిరంతరమూ తిరుగుతూనే వుంటవి. మనుష్యుల కార్యకలాపాలన్నింటిని వారు చూడగలరు. వినగలరు. అయితే తాము మాత్రం మాట్లాడలేరు. ఏ మనిషినో పట్టినపుడు తప్ప, వీటి ప్రధానస్థానము శ్మశానము. అక్కడ వందల, వేల ప్రేతములు నెలవు చేసుకొని వుంటవి.

కనుక ప్రేతములను వశం చేసుకోదలచిన మాంత్రికులు శ్మశానానికి వెళ్ళి అర్ధరాత్రి అవి మేలుకొని స్వేచ్ఛగా తిరిగే వేళలలో మంత్రసాధనచేత వాటిమీద అధికారం సంపాదిస్తారు. అవి కూడ ఒకపట్టాన లొంగవు. ఎందుకంటే మాంత్రికునకు లొంగితే వాటి స్వేచ్ఛపోతుంది. వారిచ్చిన బలులకు, నివేదనలకు సంతృప్తిపడి, మోజుపడో, తప్పకనో వశమయిపోతవి ప్రేతాత్మలు. వశమైన తర్వాత విక్రమార్కుడికి భేతాళునివలె చెప్పిన పనులు చేయవలసివస్తుంది.

మంత్ర, తంత్ర, యంత్ర సహాయంతో ప్రేతాత్మలను అదుపులోకి తెచ్చుకొనేవాడు అద్భుతాలెన్నో చేయగలుగుతాడు. విచిత్రమైన మహిమలను ప్రదర్శిస్తాడు. కాని లోకంలో కొందరు తీవ్రమైన సాధనలు లేకుండా ప్రేతాత్మలను అవాహనం చేయటానికి ప్రయత్నిస్తారు. దానివల్ల సాధించగలిగింది చాలా తక్కువ. అయినా వాటిని గురించి కూడా కొంచెం తెలుసుకోవటం అవసరం.

ఇటీవల కాలంలో ఎందరో స్టాలు, అక్షరాలు ఛార్టులు మొదలైన ఉపకరణాల సహాయంతో మృతాత్మలను పిలచి వాళ్ళ ద్వారా విశేషాలు తెలుసుకోటానికి ప్రయత్నించటం చాలాచోట్ల వుంది. ఇద్దరు ముగ్గురు కలిసి ఈప్రయోగాలు చేస్తుంటారు.

ముగ్గురో, నలుగురో చుట్టూచేరి మధ్యలో ఒక తేలికపాటి స్టూ పట్టుకొని దానిమీద నలుగురూ చేతులు పెట్టి బలంగా నొక్కకుండా ఉంచి తమ ఇష్టదేవతను ప్రార్థనచేస్తారు. దేవతలు తీవ్రమైన తపస్సుచేస్తే కాని రారు కనుక ఈకొద్దిపాటి ప్రార్థనలకు వారికి అనుగ్రహం కలుగదు. కాని మానవులతో సంబంధం కోసం వేచిఉన్న ఏ ప్రేతాత్మో యిందులో ఎవరో ఒకరి శరీరం ద్వారా చేతులలో నుంచి స్టూను కదిలింపచేస్తుంది. ఒక కాలెత్తికొడుతూ వుంటుంది. కొంచెం జరుగుతూ వుంటుంది. మనస్సులో ఏదైనా ఒక కోరిక కోరుకుని అది జరిగినట్లయితే నువ్వు కొంచెం జరగమంటే ఆ స్టూ ఒక్కరవ్వ ప్రక్కకు జరుగుతుంది. ఆ కదిలికలనుబట్టి తమ కోరికలు తీరుతవో, తీరవో ఈ మనుష్యులు నిర్ణయించుకొంటారు. ఏ అతీతశక్తో వచ్చి తమ ప్రశ్నలకు సమాధానం చెప్పిందని, తమ పిలుపుకు ఒక దివ్యశక్తి వచ్చి పలుకుతున్నదని ఆనందపడి పదిమందికి ఆ విద్య ప్రదర్శించి పరవశించిపోతుంటారు.

అటువంటిదే అక్షరాల ఛార్టుకూడ. రకరకాల ఇంగ్లీషు అక్షరాలను బోర్డుమీద గళ్ళలో వ్రాసి ఉంచి (లేదా వాటిని అచ్చుబోర్డులు కూడా అమ్ముతారు)

పైలాగనే మనస్సులో ప్రార్ధించి ఒకకలమో, పెన్సిలో చేతిలో పట్టుకొని తేలికగా ఆ ఛార్టు మీద ఆనించి వుంచితే సరి, కాసేపటికి ఆ కలం అక్షరాలమీదగా కదలటం మొదలుపెడుతుంది. కలము మూసివేసి పట్టుకోవాలి. లేకపోతే అక్షరాలకు సిరా అయ్యే ప్రమాదం వుంది. మనస్సులో ఏదో ప్రశ్న అనుకుంటే చాలు నెమ్మదిగా ఒక్కొక్క అక్షరం దగ్గర ఆగుతూపోతూ ఉంటుంది. ఏఏఅక్షరం దగ్గర ఆగిందో వాటిని కూడబలుకుతూ ఉంటే ఒక వాక్యం నిర్మాణమవుతుంది. అందులో అడిగిన ప్రశ్నకు సమాధానం ఉంటుంది.

ఈ రకమైన విద్యలన్నింటిలోకి పరిణతమైనది. ఆటోరైటింగ్ పద్ధతి. దీంట్లో నున్నటైన ఒకకాగితంమీద చక్కగారాసే ఒక కలం పట్టుకొని వ్రాయటానికి సిద్ధంగాపెట్టాలి. అంటే కాగితం పాళి ఆనించి మరీ గట్టిగా కలాన్ని నొక్కకుండా కలం దానంతటది కదలటానికి వీలుగా తేలికగా పట్టుకొని వుంచాలి. అనగా కలం స్వేచ్ఛగా కదలటానికి చెయ్యి ఒక ఉపకరణంగా మాత్రమే ఉండాలి. ఇంతకుముందు పద్ధతులలో వలెనే మనస్సులో ప్రార్ధనచేసి మొదలుపెడితే కొంతసేపటికి కలం దానంతటదే వ్రాయటం మొదలుపెడుతుంది. ఒక్కోసారి రోజుకు అరగంట చొప్పున రెండు మూడు రోజులు సాధన చేసిన తర్వాత కలం సాఫీగా నడవటం మొదలుపెడుతుంది. ఇక సాధకులు ప్రశ్నలడుగుతూ వుండటం కలం సాఫీగా నడవటం మొదలుపెడుతుంది. పృచ్ఛకులు ప్రశ్నలడుగుతూ వుండటం కలం సమాధానాలు రాస్తూ ఉండటము జరుగుతూ ఉంటుంది. వ్రాసేవాళ్ళకు మాత్రం తాము వ్రాయటంలేదని కలాన్ని ఏ అదృశ్యశక్తో నడిపిస్తున్నదని స్పష్టంగా తెలుస్తూనే వుంటుంది. అయితే ఆ శక్తిని చూడలేరు. దానిమాటలు వినలేరు. వ్రాత మాత్రమే సంబంధము. అయితే మనుష్యులు ఊరుకోరు గదా. ఎప్పుడైతే అదృశ్యశక్తితో లేఖన సంబంధం ఏర్పడిందో అప్పుడురకరకాల ప్రశ్నలు వెయ్యటం మొదలుపెడతారు. నీవెవరు? నీపేరేమిటి ? నేను పిలిచినప్పుడల్లా వస్తావా ? సరిగ్గా సమాధానం చెప్పుతూ వుంటావా ? అని ఇటువంటి వాటిన్నిటిని ఆ కలం శక్తి కొద్ది ఓపికగా సమాధానాలు చెబుతూనే వుంటుంది. రోజులు గడిచినకొద్ది బాగా అలవాటై కలం పట్టుకుంటే చాలు ధారా ప్రవాహంలాగ కలం వ్రాసుకొని పోతుంది. ఇక సాధకుల సంతోషానికి అంతుండదు. సామాన్యంగా ఆ కలం శక్తులు వీళ్ల ఇష్టదేవతలపేర్లు వ్రాస్తూ వుండటంవల్ల తమ జన్మ తరించి తమ దేవత తాము పిలిచినప్పుడల్లా పలికే దశకు తాము చేరుకున్నామని నమ్ముతూ

ఉంటారు. అయితే ఆమార్గంలో కొన్ని చిక్కులు బయలుదేరుతవి. భవిష్యత్తును గూర్చి వీళ్ళడిగిన ప్రశ్నలకు రాయబడిన జవాబులు జరగని పరిస్థితి వస్తుంది. అప్పుడు దేవత ఎందు కబద్ధం చెప్పింది? తనకు కూడ నిజం తెలీదా ? తెలీకపోతే దేవత ఏమిటి ? అనే సందేహాలు బయలుదేరి కొట్టుమిట్టాడే స్థితి వస్తుంది. కాని కొంచెం జాగ్రత్తగా ఆలోచిస్తే నిజం బోధపడకపోదు. సంవత్సరాల తరబడి కఠోరమైన ఆహార విహార నియమాలతో సిద్ధక్షేత్రాల నాశ్రయించి తపస్సు చేస్తేనేకాని అనుగ్రహించని దేవతలు కలం చేత్తో పట్టుకోగానే ఇట్టే వచ్చి అడిగిన ప్రశ్నలన్నిటికీ సమాధానాలు చెబుతూ కూచుంటారా ? అది జరిగే పనికాదు. కనుక ఆవచ్చినవాళ్ళు మానవులకంటే అతీతులుకావచ్చును, కాని మహిమాన్వితులైన దేవతలు మాత్రంకారు.

# ప్రేతాత్మల ఆవాహన - 2

పరమ సాత్వికులైన ఉత్తమశ్రేణి దేవతలను వదిలిస్తే ఆ క్రింది గణాలలో యక్షఃపిశాచ భూతప్రేతములు భూలోకాన్ని దానికి దగ్గరలో వుండే భువర్లోకాన్ని నెలవుచేసుకొని వుంటవి. ఈ జీవులంతా సత్యవ్రతులేమీ కాదు. మానవులలో వలెనే అబద్ధాలు, నిజాలు అవసరాన్నిబట్టి పరిస్థితిని బట్టి చెప్పే లక్షణం వాళ్ళలోను వుంది. మనుష్యులకు, వాళ్ళకూ వున్నతేడా అల్లా గుణాలలో కాక శక్తులలో మాత్రమే. మనుష్యులు సశరీరులైతే వాళ్లు అశరీరులే. అశరీరులంటే అసలు శరీరం లేదనికాదు. మన చర్మచక్షువులకు కనిపించని సూక్ష్మశరీరాలతో వాళ్ళు సంచరిస్తూ వుంటారు. అందులోనూ ముఖ్యంగా ప్రేతములు కొద్దికాలం క్రిందటనే మానవశరీరాన్ని విడచిపెట్టి వచ్చినవి కనుక పూర్వపు ఇష్టానిష్టాలు, సత్యాసత్యాలు ఇంకొంచెం ఎక్కువ మోతాదులోనే వుంటవి. జీవాత్మ ఒక దీపం వంటిదైతే మనుష్యశరీరం ఒక మట్టిపిడతవంటిది ఆ పిడతలోపలి దీపమువలెనే శరీరములోని జీవుడు కూడా ఆధివ్యాధులచేత,జరాసంఘాతముల చేత అణిగిమణిగి కాంతివిహీనుడై ఉంటాడు. శరీరం పతనమై, మరణాంతరం సూక్ష్మదేహం వచ్చిన తర్వాత శరీరవికారములచేత జరావ్యాధులచేత క్షీణించివున్న కామక్రోధములు అడ్డు, ఆపులేక విజృంభిస్తాయి. అందుచేత వారి భావన చాలా తీవ్రంగా ఉంటుంది మానవులచేత ఆవాహన చేయబడినపుడు ఆ అవకాశము తీసుకొని వాళ్ళ

మానవులతో సంబంధం పెట్టుకుంటారు. తమ కామక్రోధాలను జీవించివున్న మనుష్యులద్వారా తీర్చుకోవటానికి ప్రయత్నంచేస్తారు. ఈ సంబంధ బాంధవ్యాలలో ఒక్కోసారి ఉపయోగపడుతూనే వుంటారు. మరోసారి ఏమాంత్రికునికో చిక్కి వాళ్ళు కూడా బాధపడుతూ వుంటారు.

కొంతకాలం క్రింద ఒక ఆంగ్ల పత్రికలో 'ఆటోరైటింగు'లో ఘనమైన స్థితిని పొందిన ఒక అమెరికన్ 'యువతిని' గురించి వ్రాయబడింది. అన్యోన్యంగా వుండే దంపతులలో ఆమె మాత్రం మిగిలి, భర్త మరణించాడట. మృతిచెందిన తన పతితో మాట్లాడాలని ఆవిడ ఎంతగానో తపనపడింది. ఆటోరైటింగ్ ద్వారా ప్రేతాత్మలను ఆవాహనం చేయవచ్చునని విని తన భర్త రాకకోసం ఆ పద్ధతిలో ప్రయత్నం చేసింది. రోజూ కాగితం మీద కలం పట్టుకొని కూర్చుండేది. నిరాశ చెందక, నిస్పృహలకులోనుకాక చిరకాలం వేచి వేచి సాధన చేయగా కొన్నాళ్ళకు ఆమె భర్త మరణించిన రోజు సంవత్సరం తరువాత వచ్చిననాడు కలం కదిలి "నేను నీ భర్తను వచ్చాను' అని రాసింది. అనాటినుండి ఆమెకు, ఆమె భర్తకు ఆ ఆటోరైటింగ్ ద్వారా సంబంధం కుదిరింది. అతడనేక విశేషాలామెతో చెబుతూ ఉండేవాడు. అతనిది సూక్ష్మశరీరం గనుక ఎంతదూరాన జరుగుతున్న విశేషాలనైనా క్షణంలో చూచివచ్చి చెప్పగలిగేవాడు అతని సహాయంతో ఆమె ఎప్పుడూ అనేక విషయాలు చెప్పగలుగుతూ మానవాతీతమైన అంశాలలో సలహాలిస్తూ బాగా ధనార్జన చేస్తున్నది. 'ఆమెవల్ల అక్కడ లోకోపకారము బాగానే జరుగుతున్నదట. ఉదాహరణకు ఒక కోటీశ్వరుడికి ఒక విశాలమైన స్థలం వున్నది. ఆ స్థలంలో కొంతభాగం ఒక మహాభవనం నిర్మిద్దామని ప్లానువేయించి నిర్మాణం ప్రారంభించారు. ఏవో అడ్డంకులు వచ్చి అది ఆగిపోయింది. ఆ పని తల పెట్టినప్పుడల్లా తనకో, ఇంట్లోవాళ్ళకో, నిర్మాణంచేసే కూలీలకో అనారోగ్యం వచ్చి పని ఆపవలసివచ్చేది. చాలాసార్లిలా జరగటంతో వాళ్ళకు అనుమానం కలిగి అతీత శక్తులతో సంబంధం కలిగిన వ్యక్తిగా ప్రసిద్ధి చెందిన యీావిడను సంప్రదించారు. ఈవిడ తన భర్తనడిగింది. అతడు రేపు చెబుతానన్నాడు. ఆరోజు రాత్రి అశరీరుడైన ఆమెభర్త ఆ స్థలం దగ్గరికి వెళ్ళాడు. అక్కడ అతని వంటి ప్రేతాత్మలే కొన్ని వున్నాయి. వాళ్ళతో మాట్లాడాడు. ఆ స్థలయజమాని భవనం నిర్మిద్దామని అనుకొన్నచోట వాళ్ళ సమాధులున్నవట. ఎవరికీ తెలియదు. ఆ సమాధుల నాశ్రయించి వున్న ప్రేతాత్మలకు ఈ త్రవ్వకాలవల్ల ఇబ్బందికలుగుతున్నది. తమ సమాధులు కదిలించబడటంగాని,

తామక్కడ నుండి కదిలిపోవటంగాని వాళ్ళ కిష్టంలేదు. కనుక భవననిర్మాణప్ర ప్రయత్నాలు అక్కడ మొదలుపెట్టినప్పుడల్లా దానికి సంబంధించిన వాళ్ళందర్నీ బాధలపాలుచేసి ఆ పని ఆగిపోయేటట్లుగా చూస్తున్నారు. వాళ్ళకు రోగాలు, బాధలు రాకుండా వుండాలంటే అక్కడ త్రవ్వటంగాని, ఇల్లు కట్టటంగాని చెయ్యరాదట. ఈ అశరీరభర్త మరునాడు తనభార్యకి ఈ విషయం కాగితంమీద వ్రాయటం ద్వారా తెలియబరచాడు. స్థలయజమానులకు అసలు విషయాన్ని ఆమె చెప్పవలసిన రీతిలో చెప్పి బోధపరిచింది. ఆమె సూచనప్రకారం ఆరోజు స్థలయజమాని, అతనికి సంబంధించిన వ్యక్తులు అర్ధనిశావేళ ఆ స్థలం దగ్గరకు వెళ్ళి దీపం వెలిగించి ఇక ముందెన్నడూ ఆస్థలంలో ఎటువంటి త్రవ్వకాలు చెయ్యమని అక్కడ ఇల్లు కట్టబోమని ప్రమాణంచేశారు. తరువాత వారికి ఏ యిబ్బందులులేవు. ఆ ప్రదేశాని కవతల కొంచెందూరంలో వేరే భవనం నిర్మించుకున్నారు. ఆమెకు ఈ విధంగా తన భర్తప్రేతాత్మ సహాయంతో మంచి ప్రాక్టీసు సాగుతున్నది.

పాశ్చాత్యదేశాలలో హిప్నాటిజం ద్వారా మాత్రమే కాక ఈ ప్రేతాత్మలను ఆవాహనం చెయ్యటంవల్లకూడ ప్రజాసేవ చేస్తున్నవాళ్ళు వున్నారు. ఇతర ఖండాలలో పేరాసైకాలజీ డిపార్టుమెంటులో విశ్వవిద్యాలయాలలో వీటికి సంబంధించిన అనేక విధములైన ప్రయోగాలు చేస్తున్నారు. అక్కడ ఈ రంగంలో ఎంతో కృషి జరుగుతున్నది. సున్నితమైన యంత్రపరికరాల ద్వారా ప్రేతాత్మలను పలికించడం వాటి చిత్రాలు (ఫోటోలు) తియ్యటం కూడా మంచి పురోగతిలో వున్నది.

సమాధులలో వున్నప్రేతాత్మలు తమ కేవిధమైన భంగంకలగటానికి ఇష్టపడవు. ఆ సమాధుల నెవరైనా కదిలిస్తే వాళ్ళమీద ప్రతీకారం తీసుకోవటానికి అవి పూనుకుంటవి. శరీరాలు శిధిలమైపోయినా మిగిలివున్న అస్థిపంజరం మీద మమకారం వదులుకోలేక వాటిచుట్టూ ప్రేతాత్మలు తిరుగుతూ వుంటాయి.

పూడ్చి పెట్టబడినవారికి తొందరగా ప్రేతత్వం వదలదని తెలిసిన మన ప్రాచీనులు దహన సంస్కారాన్ని ప్రశస్తమని భావించారు. శరీరాన్ని దహనంచేసి బూడిదను కొద్దిగా మిగిలిన ఎముకలను పుణ్యనదులలో కలిపివేస్తే ప్రేతాత్మ విముక్తి త్వరగా కలుగుతుంది. తనకు సంబంధించిన ఏ అవశేషము లేక ఏ ఆలంబనము లేక జీవుడు వేగంగా ఈలోకపు వాసనలు వదులుకొని వెళ్ళిపోతాడు. సన్యాసులకు, వీరశైవులకు, మరికొన్ని కులాలవారికి ఖననకర్మ విధించబడటంలోని

ఉద్దేశ్యం వాళ్లు జీవించి వుండగానే ఈశ్వరత్వం పొందినవాళ్ళు కనుక. వాళ్ళకు ప్రేతత్వం వచ్చే అవకాశంలేదు. కాబట్టి వాళ్ళకు దహనసంస్కారం అవసరంలేదని నిర్ణయించబడింది.

సరి వానికేమి ? ప్రేతత్వమును పొందిన వాళ్లను ఆవాహనం చెయ్యటానికి మనదేశంలో బహువిధములైన మంత్రతంత్రాలున్నాయి. ఎముకలతో, చితాభస్మంతో ప్రేతములను, మాంత్రికులు ఆవాహనం చేస్తారు. యంత్రములు కూడా అందుకు ఉపకరిస్తాయి. ఎముకలపొడితో చితిలోని బొగ్గుతో పసుపు, కుంకుమలతో యంత్రంవేసి నిమ్మకాయలు మొదలైనవి కోసి బలులిచ్చి ఆ యంత్రంపై భూతావిష్టులైన మనుష్యులను కూర్చోపెట్టి ఆవహించిన భూతప్రేతములను పలికించే విద్యలు మంత్రతంత్రవేత్తలైన ప్రజ్ఞావంతు లెరుగుదురు. దానినిబట్టే ఏదైనా అసలు విషయాన్ని పలికించేటప్పుడు ముగ్గులోకి తేవటం అనే నానుడి మనసీమలో పుట్టింది. మృతజీవులను ఆవాహనం చేయటానికి ఇతర దేశాలలోను, మనదేశంలోనూ కూడా చాలమంది ప్రయత్నిస్తున్న వాళ్ళు ఇప్పుడూ ఉన్నారు. ముఖ్యంగా ఆటోరైటింగ్ రంగంలో చాల కృషి జరుగుతున్నది. అయితే వచ్చినచిక్కల్లా ఎక్కడంటే మంత్రతంత్ర వశీకరణశక్తి లేకుండా ఏ ఆటోరైటింగ్ ద్వారానో, ఇతర మార్గాల ద్వారానో వచ్చే ప్రేతాత్మలు మనుష్యులతో సంబంధం ఏర్పరచుకొని అతీతశక్తులున్నవన్న విశ్వాసాన్ని కలిగించటం వరకు జరుగుతుంది. కాని అవి మనష్యుల వశంకావు. వాటి చేతిలో మానవుడే కీలుబొమ్మ అయ్యే ప్రమాదం ఉంది. మరొక ప్రధానమైన అంశం ఏమిటంటే ప్రేతాత్మల స్పర్శ మానవులకు ఆరోగ్యకరంకాదు. మానసికంగా, శారీరకంగా చెరుపు జరిగే అవకాశాలే ఎక్కువ. కనుక సిద్ధమాంత్రికులైతే తప్ప కాలక్షేపానికో, వింత చూడటానికో ప్రేతాత్మలను ఆవాహనం చెయ్యటం శ్రేయస్కరంకాదు.

# దివ్యదృష్టి

మంత్రతంత్ర యోగసాధనలలో ఏ సాధన చేసినా సిద్ధిని పొందే దశలో సాధకుడికి లభించేది దివ్యదృష్టి. భౌతికమైన చర్మచక్షువులతో చూడలేని విషయాలు చూడగలగటం దీంట్లో జరుగుతుంది. సాధకుడు మొదట్లో తీవ్రమైన ఏకాగ్రత చేత తన ధ్యేయమూర్తిని మాత్రమే చూడగలుగుతాడు. అది కరచరణాది సహితమైన

ఆకారం కావచ్చు, రేఖా సమాన్వితమైన యంత్రాకారం కావచ్చు. లేదా పట్టి తేజః పుంజమే కావచ్చు. క్రమక్రమంగా దేవతానుగ్రహం చేత తాను కోరిన వాటిని గూడ చూడగలిగే శక్తి సాధకుడికి వస్తుంది. ఏ దేవతామంత్రమైనా యీ స్థితిని తప్పక దాటితీయాలి. ఆజ్ఞాచక్రస్థానమైన భ్రూమధ్యంలో మూడవకన్ను అదృశ్యరూపంగా యోగికి ఉదయిస్తుందన్నమాట. శివుడు ఫాలాక్షుడనటంలోని తాంత్రిక రహస్యం ఇక్కడ స్మరించాలి.

కాళిదాసు కుమారసంభవంలో శివతపోభంగానికి మన్మధుడు వస్తున్న సందర్భంగా ఆ దక్షిణామూర్తిని త్రియంబకునిగా వర్ణించాడు. మారుడు పుష్పాస్త్రాలను విడిచిన తరువాత కొద్దిపాటి మనస్సంచలనం కలిగినా నిగ్రహించుకొని పరమేశ్వరుడు ధ్యానదృష్టితో విషయాన్ని గ్రహించి మూడవకన్నులో నుండి అగ్నిని పుట్టించి మన్మధుణ్ణి భస్మం చేశాడు. రుద్రుడు మూడవకన్ను తెరిస్తే అగ్నిజ్వాల మాత్రమే ఉదయిస్తుంది అని చాలా చోట్ల వర్ణించబడింది. కాని హరవిలాసంలో శ్రీనాథ కవి సార్వభౌముడు దారుకావన విహారంలో శివుడు రంభావక్షోజ సౌందర్యాన్ని మూడు కన్నులతోటి చూచి ఆనందించినట్లు వర్ణించాడు. దీన్ని బట్టి మూడవ కన్ను కేవలం దహనానికి మాత్రమే కాక మామూలుగా చూడటానికి కూడా ఉపయోగించవచ్చునని కవిరాజు మనకు చెప్పినట్లయింది.

మానవులలో ఈ మూడవకన్ను వికసించటం కోసమే ఉపనయనము, బ్రహ్మోపదేశము అనే ప్రక్రియను ప్రాచీన ఋషులు నిర్మించారు. ఉపనయనము అంటే అధికమైన కన్ను అని అర్థము. భ్రూమధ్యంలో యీ కన్ను తెరుచుకొని అదృశ్యదేవలోకములను దర్శించటానికి యీ ఉపనయన కలాపముద్దేశించ బడింది. టిబెట్‌లోని లామాలకు ఈ విశేషం బాగా తెలుసు. లోబ్‌సాంగ్ రాంపా టిబెట్ దేశములోని యీ త్రిలోచన సాధనను గూర్చి ఒక పుస్తకమే రాశాడు. పాశ్చాత్య దేవతలలో నెప్ట్యూన్ ఫాలభాగమున కన్నుగల దేవతగా వర్ణన చేయబడినది. ఈజిప్టు రాజులు అయిన ఫారోల భ్రూమధ్యమునందు కనుపించే సర్పదర్శక సర్పచిహ్నం దివ్యదర్శనానికి ఒక సంకేతమని పండితులు భావిస్తున్నారు.

పురాణాలలో చాలచోట్ల మహనీయులైన ఋషులు తమ దివ్యదృష్టి ప్రభావం చేత త్రికాలములలోని విషయాలను తెలిసికోగలిగినట్లు చెప్పబడింది. ఉదాహరణకు రఘువంశంలో దిలీప మహారాజుకు చాలాకాలం సంతానం లేదు. ఎంత కాలమో వేచి అనేక వ్రతములు చేసినా ఫలితం కనబడక చివరకు కులగురువైన

వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్లి ఆయన పాదపద్మాలను ఆశ్రయించాడు. ఆ మహర్షి ధ్యాన సమాధిలో గత కాలంలో జరిగిన దిలీపుని దోషగాథను, దాని వల్ల అతడు తెలియకుండానే కామధేనువు చేత పొందిన శాపాన్ని వివరించి ఆ దోషాన్ని పోగొట్టుకోవటానికి మార్గం కూడా ఉపదేశించాడు. ప్రతి పురాణంలోను ఇటువంటి విశేషాలడుగడుగునా గోచరిస్తూనే ఉంటాయి.

ఇటీవలి కాలంలో కూడా సిద్ధవ్యక్తులైన వారంతా ఈ దివ్యదృష్టిని సాధించినవారే. మహానుభావుడైన రామకృష్ణపరమహంస దర్శనానుభవాలను పరిశీలిస్తే ఎన్నో విచిత్ర విషయాలు కనిపిస్తాయి. ఈ జన్మకు రాకముందు ఊర్ధ్వలోకాల నుండి ఒక దివ్య శిశువుగా క్రిందికి దిగి వస్తూ మధ్య త్రోవలో కనబడిన ఒక మహర్షిని తనతో పాటు మానవజన్మ ఎత్తి, తనకు సహకరించటానికి రమ్మని కోరినట్లుగా పరమహంస ఒక చోట అన్నారు. ఆ ఋషియే వివేకానందుడని కూడా విశదపరిచాడు. తనకు శిష్యులు కావాలని కోరివచ్చిన వారి యోగ్యతలను తెలుసుకోవటానికి వారి పూర్వజన్మల సంస్కారాలు మొదలైన వాటిని తన అంతర దృష్టితో చూచి తగిన వాళ్ళని తోస్తేనే ఆయన స్వీకరించేవాడట. తరువాతి కాలములో వివేకానందస్వామికి కూడా ఈ శక్తి వికసించినట్లు ఆయన జీవిత చరిత్రను చదివితే తెలుస్తుంది.

అరుణాచలవాసి జగత్ప్రసిద్ధుడు ఆయన రమణ మహర్షి దృష్టి మహత్వాన్ని గురించి ఎన్నో కథలు వ్యాపించి ఉన్నవి. ఒక్క చూపులోనే అవతలి వ్యక్తిలోని విశేషాల్ని గుర్తించి తన దృష్టి ప్రభావం చేత వాళ్ళ జీవితాలనే ఆయన మార్చగలిగేవాడు. గుడిపాటి వెంకటాచలం వంటివారు మారిందా దృష్టి ప్రభావం చేతనే. రమణ మహర్షిని గురించి అంతో ఇంతో వ్రాసి ప్రచురించిన పాల్ బ్రంటన్ ఈజిప్టులో జరిపిన అన్వేషణల ఫలితంగా అక్కడి కొందరి సిద్ధవ్యక్తుల పరిచయాన్ని పొంది, దానివల్ల అతడి మనోనేత్రం వికసించగా, పూర్వజన్మలో తానొక ఈజిప్టు దేశపు దేవాలయార్చకుడనని చూచి తెలుసుకోగలిగాడు.

మంత్రసిద్ధుడు, మహాకవి అయిన కావ్యకంఠగణపతిముని తన పూర్వజన్మ విశేషాలను తెలుసుకోటం మాత్రమే కాక ఎందరి విశేషాలనో చూడగానే చెప్పగలిగేవాడట.

రమణ మహర్షి అప్రఖ్యాతుడై అరుణాచలంలో తపస్సు చేసుకుంటూ

ఉండే తరుణంలో ఒకనాడు ఆయనను చూచి తనకు కలిగిన అనుభూతిని కావ్యరూపం లిలా ఛందోమయంగా పలికారు.

శ్లో ॥ పశ్యామిదేవదత్తేన జ్ఞానేసత్వాం ముహుర్ముహుః
బ్రహ్మణ్యానాం వరంబ్రహ్మన్ సుబ్రహ్మణ్యం నరాకృతిం

శ్లో ॥ పురా కుమారిలోనామ భూత్వాబ్రాహ్మణసత్తమః
ధర్మం వేదోదితం నాథ త్వం సంస్థాపితవా నసి

శ్లో ॥ జైనై ర్వ్యా కులితే ధర్మే భగవన్ ద్రవిడేషుచ
భూత్వాత్వం జ్ఞాన సంబంధః భక్తిం స్థాపితవానసి

శ్లో ॥ అధునాత్వం మహాభాగ బ్రహ్మజ్ఞానస్య గుప్తయే
శాస్త్రజ్ఞానేన సంతృప్తైః నిరుద్ధస్యాగతో ధరాం

.... దేవతలు నాకు ప్రసాదించిన జ్ఞానంతో బ్రహ్మణ్యులలో శ్రేష్ఠునిగా నరరూపం ధరించిన సుబ్రహ్మణ్యునిగా నిన్ను చూస్తున్నాను. పూర్వం కుమారిలభట్టనే బ్రాహ్మణోత్తమునిగా పుట్టి వేదోదితమైన ధర్మమును నీవు స్థాపించావు. దేశములో వేద ధర్మము జైనుల చేత వ్యాకులపాటు చెందగా నీవు ద్రవిడులలో జ్ఞానసంబంధర్ అనే పేరుతో ఉదయించి భక్తిని స్థాపించావు. ఈనాడు శాస్త్రజ్ఞానం చేత సంతృప్తులైన వారిచే నిరోధించబడియున్న బ్రహ్మజ్ఞానాన్ని గోపనం చేయటానికి నీవు రమణునిగా భూమికి వచ్చావు"

కుమారస్వామి భూలోకంలో మూడు జన్మలెత్తాడని "రమణ మహర్షిది మూడవది, చివరిది అయిన జన్మ అని గణపతి ముని పలికారు. జీవించి ఉండగా కపాలభేదన సిద్ధిని పొంది మహాతపస్విగా ఖ్యాతిగాంచిన వారి మాటలు ఆర్ష విజ్ఞానపు మూటలు.

ఒక్క పూర్వజన్మకు సంబంధించిన విషయాలే కాదు, ఇహజన్మలోని కష్టసుఖాలన్నింటికీ మూలమైన అంశాలన్నీ దివ్యదృష్టిద్వారా తెలుసుకుంటారు తపస్వులు. దాని వల్ల ఎంతో లోకోపకారం జరుగుతుంది.

ఇంతకూ ఈ దివ్యదృష్టి, ఈ మనో నేత్రం, ఈ జ్ఞానలోచనం తెరుచుకొనే మార్గమేమిటి అని పరిశీలిస్తే ;

"ఆకుంచ్యవాయు మవిజిత్యచ వైరిషట్కం
ఆలోక్య నిశ్చల ధియా నిజ నాసికాగ్రం"

గాలిని కుంభించి, అరిషడ్వర్గాన్ని జయించి నిశ్చలబుద్ధితో నాసాగ్రమును చూస్తూ ఉండాలి. అని యోగశాస్త్రములు చెపుతున్నవి.

తిక్కన మహాభారతంలో హరిహరనాథుడ్ని నాసాగ్రనివాస రసికునిగా వర్ణించాడు. భ్రూమధ్యం ఆజ్ఞాచక్రస్థానం. లలితాసహస్ర నామాలలో ఆజ్ఞాచక్రాంతరాళస్థా 'రుద్రగ్రంధి విభేదినీ' అని ఉంది. పరమేశ్వరి ప్రధాన స్థానాలలో అది ఒకటి.

సిద్ధుడైన మంత్రవిదుని చేత ఉపదేశం పొంది భ్రూమధ్యమునందు దేవతను నిలుపుకొని కనులుమూసి జపసాధన ఏకాగ్రంగా చేస్తే తప్పక మూడవకన్ను - అంతరలోచనం విచ్చుకుంటుంది.

ఈ చూచే సాధనలో మరికొన్ని కూడా ఉన్నవి. అంతర్లక్ష్యము, బహిర్దృష్టి కలిగినది శాంభవీముద్ర. కొందరు ఊరక కనులు తెరిచి ఉంటారు. బయట వస్తువును దేనినీ చూడరు. అది లక్ష్యరహితమైన చూపులా కనిపిస్తుంది. కాని అది శాంభవీముద్ర సాధన విశేషం. మరికొందరు దీపసాధన చేస్తారు. దీపదుర్గ వంటి మంత్రాలు కొన్ని ఉన్నవి. ఆ దీపపు వెలుగులోవారు జీవితరహస్యాలు చూస్తారు.

ఆ మార్గాలన్నింటిలో అంజనవిద్య ప్రసిద్ధమైంది. కొన్ని మూలికలతో కాటుక తయారు చేసి తమలపాకు పైనో ఒక బొటనవ్రేలి గోరుపైననో దానిని రాచి మాంత్రికుడు తాను చూడటమో, లేక ఇతరుల చేత చూచేలా చేయటమో ఇందులో జరుగుతుంది. కావలసిన విశేషాలు ఆ అంజనంలో సినిమాలో దృశ్యాలలాగ కనిసిస్తూ ఉంటవి.

వీటిలోదేనికైనా ఏకాగ్రత మనోనిశ్చలత, మంత్రసిద్ధి ముఖ్యం. ఇందులో ఎక్కడ లోపం వచ్చినా కనిపించవలసింది కనిపించదు. కొన్ని సార్లు కనిపించినవి తప్పిపోతూ ఉంటవి. పిల్లల చేత అంజనము వేయించే సందర్భాలలో మాంత్రికులూ వారి మనస్సులను అదుపులోకి తెచ్చుకొని చూడవలసినవాటికి ప్రేరేపించి తాము చెప్పినవి చూచేట్లు చేయటం వల్ల భవిష్యత్ ఫలితాలు జరగకపోవటం కొన్ని చోట్ల గమనించవచ్చు. ఏదైనా సర్వసాధకులకూ ధ్యానమార్గంలో దివ్యదృష్టి అత్యంత ప్రధానమైన దశ.

# ఉచ్ఛిష్ట గణపతి

ఆంధ్ర విశ్వకళాకళా పరిషత్తులో ఆంధ్ర శాఖాచార్యులుగా ఉండే శ్రీయస్వీజోగారావు హైస్కూలులో చదువుచున్న రోజులలో వారి ప్రక్కయింటికి ఒక మాంత్రికుడు వచ్చాడు. అతణ్ణి గురించి జనం చాలా గొప్పగా చెప్పుకుంటున్నారు. అతడు ఓఢ్రుడు. పేరు సర్వజొణో, సంస్కృత సర్వజ్ఞ శబ్దానికి ఒరియా వికృతి అది. అతనికి తెలియని, తెలుసుకోలేనిది లేదని ఏమయినా చెయ్యగలడని అతనికి పెద్దపేరు. జోగారావు గారు, అతని స్నేహితులు కాస్త అవకాశం చేసుకొని ఆయన దగ్గర కూర్చున్నారు. ఈ బాలురను చూచి ఆయనకు ఒక విధమైన వాత్సల్యం కలిగింది. సరదాగా కాసేపు వీళ్ళతో అవీఇవీ మాట్లాడాడు.

చిన్నపిల్లలు ఏం అడగాలో ఏం అడగకూడదో కూడా తెలీని వయస్సు ఆయనకన్నీ తెలుసునన్న విశ్వాసం ఒక ప్రశ్న వెయ్యటానికి వీళ్ళని ప్రేరేపించింది.

వీళ్ళలో ఒకడు, ఏమండీ, రేపు మాకు లెక్కల పరీక్ష. ఆ ప్రశ్నపత్రం చెబుతారా" అని అడిగాడు. ఆయన నవ్వి ఏం పరీక్షకు బాగా చదవలేదా" అని అన్నాడు – వీళ్ళు అదికాదండీ, రేపటి పేపరు చాలా కష్టం. మీరు వచ్చే ప్రశ్నలు ముందు చెబితే బాగా చదువుకొని సిద్ధపడి వెళ్తాం" అన్నారు. ముక్కుపచ్చలారని ఈ బాలురను చూచి వాళ్ళ ఆదుర్దాకు జాలిపడి సరే చెబుతాను, రాసుకోండి" అన్నాడు సర్వజొణో. ఒక క్షణం కళ్లుమూసుకొని చెవిదగ్గర చేయి పెట్టి ఏదో విని చెబుతూ ఉన్నట్లుగా మొదలుపెట్టాడు. ఆయనకు ఇంగ్లీషురాదు. పరీక్ష పత్రాలు ఇంగ్లీషులో ఉండేవి. అయినా ఏ మాత్రము తప్పు రాకుండా నెమ్మదిగా, స్పష్టంగా ఉచ్చరిస్తూ ప్రశ్నపత్రం మొత్తం వాళ్ళకు చెప్పాడు. మర్నాడు అవే ప్రశ్నలు ఉన్నవి ఉన్నట్లుగా వచ్చాయి. హెడ్‌మాష్టర్ గారి బీరువాలో పదిలంగా దాచిపెట్టబడిన కాగితాలలోని ప్రశ్నలు ఎలా ఆయన ముందురోజే చెప్పగలిగాడో వాళ్ళకు అర్థం కాలేదు. తరువాతి కాలంలో కర్ణ పిశాచి మొదలైన విద్యల చేత అటువంటివి సాధ్యమని వారు వినటం జరిగింది.

అయితే సర్వజొణో ఈ ఒక్క విద్యలోనే కాదు. అనేక ప్రయోగ విద్యలు తెలిసినవాడు. మంత్ర తంత్రదక్షుడు. కొన్ని సంవత్సరాలకు సిద్ధపురుషుడైన ఒక యోగిమీదకు పోయి విరోధంతో ప్రయోగాలు చేసి తనశక్తులన్నీ పోగొట్టుకొని

చివరి రోజులలో చాలా బాధపడి మరణించాడు.

ఇటువంటి వాటి నన్నింటిని మనవారు క్షుద్రవిద్యలుగా పరిగణించి వాటి జోలికి పోవద్దని హెచ్చరించేవారు. అయినా ఆ శక్తుల మోజులో పడి వాటి సాధనలు చేసి వశం చేసుకొని కొంతకాలం పాడినది పాటగా సంచరించి మహాభోగానుభవము పొంది చివరి కాలంలో భ్రష్టులై పోయిన వారి గాథలు అక్కడక్కడా వింటూనే వుంటాము.

దాదాపు 70 సం.ల క్రితం ఆ విధంగా మహాద్భుత శక్తులతో కొంతకాలం తెలుగుదేశం సంచారం చేసిన వ్యక్తి ఆర్. చతుర్భుజదాస్ అనే విచిత్ర వ్యక్తి. గుంటూరు మండలంలో ఈయన చేసిన పనులు స్వయంగా చూచినవారు కథలు కథలుగా చెబుతుంటే చాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఎంతెంత అధికారుల దగ్గరకో, ధనవంతుల వద్దకో వెళ్ళి జంకు గొంకు లేకుండా నేను ఫలానా చోట ఉన్నాను. నా పేరిది" అని చెప్పి వచ్చేసేవాడు. కాసేపటికల్లా ఆ వ్యక్తికి ఒక గుబులు పుట్టినట్లుగా బయలుదేరి ఆయన విడిదికి వచ్చి చాలా విలువైన కానుకలు, ధనము సమర్పించుకొనేవాడు. సౌందర్యవతులు, కళానిలయలు అయిన భోగకాంతలెందరో తామితరుల దగ్గర సంపాదించిన ధనాన్ని, తమ శరీరాలను అతని కప్పగించి ధన్యత్వము పొందినట్లు భావించారు. ఈ ధనమంతా నిలవ చేసుకొన్నాడా అంటే అదీ లేదు. విలాసంగా ఖర్చు పెట్టేవాడు. నిరంతర సమారాధనలు చేసేవాడు. ఉత్సవాల పేరు పెట్టి వేలమందికి భోజనాలు పెట్టేవాడు. మహావైభవము, భోగమూ కొన్ని సంవత్సరాల పాటు అనుభవించి మహేంద్రుని వలె వెలిగాడు. తరువాత కొన్నాళ్ళ కెవరికీ కనిపించకుండా వెళ్ళిపోయాడు. ఏమైపోయినాడో, ఎక్కడికి వెళ్ళాడో, ఎక్కడున్నాడో ఎవరికీ తెలియదు. కొన్ని సంవత్సరాల తర్వాత పరమ దరిద్ర స్థితిలో తినడానికి కూడా తిండి సరిగా దొరకని దశలో కనిపించాడు. మహానుభావా! ఏమిటి యిలా ఉన్నారు? ఎటువంటి మహాపురుషు లెలా అయిపోయినారు ? ఏమిటి కారణం?" అని అడిగితే ఆయన నవ్వు కాని నవ్వొకటి బలవంతంగా పెదవుల మీదకు తెచ్చుకొని నేను సాధించిన విద్యల లక్షణ మటువంటిది. కొన్నా ళ్ళింద్రపదవినిస్తవి. పిదప అధఃపతనానికి దారితీస్తవి. అయితే నే నా రోజులలో సంపాదించిన ధనంలో కొంతభాగం అన్నదానానికి వినియోగించాను. దాని ఫలితంగా నా కివాళ తినటానికి మాత్రం దొరుకుతున్నది. ఆ పాత వైభవ మంతా గతకాలపు గాథలే" అని చెప్పాడు.

ఇవన్నీ ఇటీవలి కాలంలో జరిగిన సంఘటనలే. ఇటువంటి తాత్కాలిక వైభవాలను కలిగించే క్షుద్రవిద్యలు తంత్రశాస్త్రాలలో చాలా ఉన్నవి. అటువంటి వాటిల్లో ఉచ్ఛిష్టగణపతి ఒకటి. దీని మీద మోజుపడిన వారు చాలా మంది ఉన్నారు. విఘ్ననాశకునిగా సర్వార్థ ప్రదాతగా ప్రసిద్ధుడైన గణపతికి సంబంధించిన విద్యలలో ఇది చాలా ప్రసిద్ధమైనది. క్షుద్రవిద్యగా ఎక్కువమంది నిరసించినా దీనినే గొప్పదానిగా భావించినవారు లేకపోలేదు. మంత్ర మహోదధికర్త ఇలా అంటున్నాడు.

శ్లో ॥ ద్యూతే వివిధే సమరే జప్తోయం జయమావహేత్
కుబేరోస్య మనోర్జాపాత్ నిధీనామ్ స్వామితా మయాత్
లేభాతే రాజ్యమనరివానరేశ విభీషణౌ

జూదములో, వివాదములో, యుద్ధములో ఉచ్ఛిష్ట గణపతి మంత్రం జపిస్తే జయం తప్పక సిద్ధిస్తుంది. ఈ మంత్రం జపించే కుబేరుడు నిధులకు అధినాధుడైనాడు. వానరేశ్వరుడైన సుగ్రీవుడు, రాక్షసుడైన విభీషణుడు శత్రురహితముగా రాజ్యాన్ని పొందారు.

ఈ విద్యను సాధించడానికి రకరకాల ప్రక్రియలు చెప్పబడినవి. రక్తచందనంతో కాని, తెల్లజిల్లేడుతో కానీ, సాధకుడు తన బొటనవ్రేలి పరిమాణముకల గణపతి విగ్రహాన్ని తయారు చేసుకోవాలి. దానికి ప్రాణ ప్రతిష్ఠ చేసి షోడశోపచారాలతో పూజ చేసి రోజూ జపం చేయాలి. ఇటువంటి వాటన్నిటికి కృష్ణపక్షంలో అష్టమి నుండి చతుర్దశి దాకా చెయ్యటం ఒక పద్ధతి. రక్తవస్త్రములు ధరించి రక్తాంగరాగములు పూసుకొని దేవనివేదితములైన భక్ష్యములను కాని, లేక తాంబూలమును కాని తింటూ రాత్రిపూట జపం చెయ్యటం అవసరం. ఘృతతైలాదులతో హోమప్రక్రియ కూడా చెప్పబడింది. దిగంబరుడై జపించటం మరొక పద్ధతి. దాని ఫలితం చూడండి.

శ్లో ॥ గణేశో హమితిధ్యాయన్ ఉచ్ఛిష్టోఽనావృతోరహః
పక్షాద్రాజ్యమవాప్నోతి నృపజోఽన్యోపివానరః

ఉచ్ఛిష్టుడై వివస్త్రుడై నేనే గణేశుడననే అద్వైత భావనతో 15 రోజులు చేస్తే రాజ్యాన్నే పొందవచ్చును.

ఈ విగ్రహాలను ఇతర వస్తువులను కూడా మరికొన్నింటిని ఉపయోగించి

ప్రత్యేక ఫలితాలను పొందచ్చును. కుమ్మరి మట్టితో చేసిన బొమ్మ రాజ్యదాయిని, పుట్టమట్టితో చేసినది సౌభాగ్యాన్ని ఇస్తుంది. ఉప్పుతో చేసినది శత్రువులను క్షోభింపచేస్తుంది. ఇవికాక నీచాతినీచమైన మరొక పద్ధతి కూడా ఉన్నది. సాధకుడు తన మలమూత్రములతో చితాభస్మాన్ని కలిపి బొమ్మ తయారు చేసి శ్మశానంలో రాత్రివేళ పూజచేసి రక్తాన్నాదులు నైవేద్యం పెడుతూ జపం చేస్తే చాలా వేగంగా హస్తిముఖుడైన పిశాచవల్లభుడు ప్రత్యక్షుడై అనుగ్రహిస్తాడు. భవిష్య పురాణంలో యక్షిణీతంత్రంలో చెప్పబడిన మరో ప్రక్రియ ఉన్నది. శ్వేతార్కంతో చేసిన గణపతి విగ్రహం మీద నిరంతరము నీళ్లు పుక్కిలించి ఉమ్మేస్తూ జపం చెయ్యాలి. మన ప్రాంతాలలో అందుకే ఎవడైనా ఎక్కువగా ఉమ్ముతుంటే, ఏమిరా ఏమన్నా ఉచ్ఛిష్టగణపతి చేస్తున్నావా?"అని అనేవాళ్ళు.

ఘోరములైన ఉపద్రవాలు వచ్చినప్పుడు తెల్లజిల్లేడుతో కానీ వేపచెక్కతో గాని బొమ్మ తయారుచేసి రక్తచందన పుష్పాలతో పూజించి మద్యభాండములో దానినుంచి చేయిలోతు త్రవ్విన నేలలో పూడ్చి దానిపై కూర్చొని జపం చేస్తే ఏడు రోజులలో ఉపద్రవములు తొలుగుతవి.

శ్లో. విషమేసమను ప్రాప్తే సితార్కారిష్ట దారుజం
గణపం పూజితం సమ్యక్ కుసుమైః రక్తచందనైః
మద్యభాండస్థితం హస్త మాత్రే తం నిఖనేత్ స్థలే
తత్రోపవిశ్య ప్రజపేత్ మంత్రీనక్తం దివామనుం
సప్తాహమధ్యే నశ్యంతి సర్వే ఘోరా ఉపద్రవాః

దుష్ట స్త్రీలను, సామాన్య సాధనల చేత వశంకాని వాళ్ళను వశం చేసుకోవటానికి చెయ్యాల్సిన పద్ధతి చూడండి,

శ్లో. దుష్టస్త్రీ వామపాదస్య రజసా నిజదేహజైః
మలై ర్మూత్ర పురీషాద్యై కుంభకారమృదాపిచ
ఏతైఃకృత్వా గణేశస్య ప్రతిమాం మద్యభాండగాం
సంపూజ్యనిఖనే ద్భూమౌ హస్తార్ధే పూరితేపునః
సంస్థాప్యవహ్నిం జుహుయా త్కుసుమైః హయమారజై
సహస్రంసా భవేద్దాసీ తన్వాచమన సాధనైః

దుష్టస్త్రీ ఎడమకాలి దుమ్మును సంపాదించి సాధకుడు తన

మలమూత్రములతో కుమ్మరి ఆవంలోని మట్టితో కలిపి గణేశ ప్రతిమ చేసి మద్యభాండములో పెట్టి పూజ చేసి నేలలో పూడ్చి దానిపై గన్నేరు పూలతో హోమం చేయాలి. వెయ్యి అహుతులువేసి పూర్ణాహుతి చేస్తే ఆ స్త్రీ తన తను మనోధనములతో దాసురాలవుతుంది.

శ్లో. నదీజలం సమాదాయ సప్తవింశతి సంఖ్యయా
మంత్రయిత్వాముఖంతేన ప్రక్షాళ్యేశ సభాంవ్రజేత్
పశ్యేద్యం దృశ్యతేయేన సవశ్యో జాయతే క్షణాత్

నదిలోని నీరు తెచ్చి ఇరవైయేడు సార్లు మంత్రించి ముఖం కడుక్కొని రాజసభకు వెళితే ఇతడెవరిని చూచినా, ఎవరితడిని చూచినా క్షణంలోనే వశమవుతారు.

ఇటువంటి విధానాలెన్నో ఉచ్ఛిష్టగణపతిని గూర్చితంత్రములలో కనిపిస్తుంది. ప్రధానంగా విద్యాప్రదాతగా, భూతభవిష్యద్వర్తమానాలను తెలిపే దేవునిగా ఎక్కువగా ప్రసిద్ధి. వశీకరణానికి ఇంతకు మించినది లేదని అనేకులంటారు. ఏదైనా క్షుద్రవిద్యగానే దీని స్థానం నిలిచి ఉంది.

# కర్ణపిశాచి

ఒకనాడు సాయంకాలం గోధూళివేళ పశువులను ఇంటికి తోలుకొచ్చి లోపల కట్టివేశాడు పాలేరు. గృహిణి ఇంట్లో ఏదో పని చేసుకుంటున్నది. పరమనిష్ఠాపరునిగా షట్కాల శివపూజాదురంధరునిగా పేరు చెందిన అయ్యవారు లోపల సంధ్యావందనం చేసుకుంటున్నాడు. ఆ కాపరి బావి దగ్గర కాళ్ళు చేతులు కడుక్కొని వాకిలి దగ్గరకు వచ్చి "అమ్మగారూ" అని కేక వేశాడు. ఆవిడ లోపలి నుంచి వచ్చి వాకిట్లో నిల్చుంది. అమ్మ ! నాకు గారెలు పెట్టరా? అని అడిగాడు. "గారె లెప్పుడు చేశామురా" అన్నది ఆమె. "నాకు తెలుసండమ్మ గారూ ! 54 గారెలు చేశారు, మధ్యాహ్నం. అందులో 30 ఖర్చయినవి. ఇంకా 24 ఉన్నాయి బుట్టలో"అన్నాడు వాడు. ఆమె విస్తుపోయింది. ఇంట్లో ఎప్పుడో మధ్యాహ్నమనగా చేసిన గారెల సంగతి వాడి కెట్లా తెలిసింది? ఆ మాయ ఏమిటో ఆమె కర్థం కాలేదు. ఆ పశువుల కాపరి చిన్నప్పటి నుంచి వాళ్ళ ఇంట్లో పనిచేస్తున్న వాడే. ఆమె కేమీ తోచక ఒక అరడజను గారెలు తెచ్చి ఇచ్చింది. లోపల జపం చేసుకుంటున్న

అయ్యవారు వాణ్ణి కేకేసి పిలిచారు. "ఒరే ఆ గారెలు తినేసి ఇటురా" అన్నాడు. ఆ పనివాడు తినటం పూర్తి చేసి మంచినీళ్లు తాగి యజమాని దగ్గరకు వచ్చాడు. ఆయన దొడ్లో చెట్టు క్రింద మంచం వేసుకొని కూచున్నాడు. వాణ్ణి కూడా కూచోమనిచెప్పి, అప్పుడడిగాడు. "ఏమిరా మా యింట్లో వండిన గారెలు సంఖ్యతో సహా ఎట్లు చెప్పావు. అసలు వండిన సంగతే నీకు తెలీదు కదా. ఇప్పుడే నీవు పొలాన్నుంచి వస్తివి. ఈ సంగతి ఎలా కనుక్కున్నావు ?" వాడు ఏదో చెప్పి తప్పించుకోవాలని చూశాడు. కాని ఆయన గట్టిగా పట్టుపట్టటంతో చెప్పక తప్పలేదు. అయ్యగారు, నా దగ్గరొక విద్య ఉన్నది. ఏం కావాలన్నా అది చెవులో చెబుతూ ఉంటుంది. దాని వల్ల గారెల సంగతి కనుక్కున్నాను" అనివాడు తన రహస్యం చెప్పాడు. అయ్యవారికి ఆశ కలిగింది. ఎన్నో సంవత్సరాలుగా తాను కఠోర దీక్షతో శివపంచాక్షరి చేస్తున్నాడు. ఇప్పటికే కొన్ని కోట్లు పూర్తయింది. అప్పుడప్పుడు ఏదో స్వప్న దర్శనం తప్ప శివుడు తన తపస్సుని మెచ్చి సాక్షాత్కరించనే లేదు. తన దగ్గర ఎటువంటి మహిమలూ లేవు. తన దగ్గర పనిచేసే పాలేరు దగ్గర అద్భుతమైన శక్తి ఉన్నది. తానా విద్య ఎందుకు నేర్చుకోగూడదు? అని అనిపించి తనకా మంత్రం నేర్పమని వాణ్ణి బ్రతిమాలాడాడు. వాడు ఎంతో చెప్పి చూచాడు. ఇది బ్రాహ్మలు చెయగూడదండీ, బెడిసి కొడుతుందేమో"అన్నాడు. అయినా ఆయన వినలేదు. చివరకు వాడు తప్పక అయ్యవారికి దానికి సంబంధించిన మంత్రము తంత్రము చెప్పాడు. ఆ ప్రక్రియ అంతా చాలా సులభంగా కనిపించిం దాయనకు. మడిలేదు. శుచిత్వము లేదు. చాలా సులభంగా ఉంది పద్ధతి. వాడు చెప్పిన పద్ధతినే కొన్ని గంటలలోనే నిర్ణీత మంత్ర జపం పూర్తయింది. చెవులో ఏదో హోరులాగా తర్వాత మాటలు స్పష్టంగా వినపడడం మొదలుపెట్టింది. ఏమయ్యా బ్రాహ్మణా! నన్నెందుకు పిలిచావు? ". త్రికాల విషయాలు నాకు తెలియజేయటం కోసం నిన్ను ఆరాధించాను" అన్నాడయ్యవారు. అతడికి ఒక పెద్ద నవ్వు వినిపించింది. నీ దగ్గర శివుడున్నాడు. నీ ఇంట్లో దేవతార్చన మందిరమున్నది. అందువల్లే నేను నీ దగ్గరకు గాని మీ ఇంట్లోకి గాని రాలేను. నేను నీ దగ్గరకు వచ్చి రోజూ కోరిందల్లా చెప్పాలంటే నీవు నీ అనుష్ఠానం మానేసి దేవతార్చన ఇంట్లో నుంచి తీసేస్తే అప్పుడు సాధ్యమవుతుంది" అన్నాడు. అయ్యవారికి తల తిరిగింది. ఇన్నాళ్ళు తాను చేసిన తపస్సుకు ఇంతశక్తి ఉన్నదని తెలుసుకోలేకపోయాడు. ఒక పిశాచాన్ని తనలోని శివతేజస్సు దగ్గరకు రానివ్వటం లేదు. మోక్షసాధకుడైన తాను యీ పవిత్ర విద్యను వదలుకొని పిశాచవిద్యల వెంటబడినందుకు తనను

తాను నిందించుకొని చేతిలో ఇన్ని నీళ్ళు పోసికొని అయితే ఇకముందు నా దగ్గరకు రానక్కర లేదు" అంటూ ఆ నీళ్ళు బైటకి విసిరాడు. ఆ పిశాచి వెళ్ళిపోయింది. తెలుగుదేశంలోని ఒక ఆరాధ్య కుటుంబంలో జరిగిన గాథ యిది.

ఇటువంటిదే గుంటూరులోని శృంగేరి శ్రీ విరూపాక్ష పీఠాధిపతులు జగద్గురు శ్రీ కళ్యాణానందభారతీస్వామి నిలయములో జరిగింది. ఒక రోజు జ్యోతిష్కుణ్ణని ఒక వ్యక్తి వచ్చి పీఠంలో ఉన్న కొంతమందికి జాతకము, చెయ్యి ఏదీ, చూడకుండానే చెవి దగ్గర చేయిపెట్టుకొని భూత భవిష్యద్వర్తమానాలు చెప్పేస్తున్నాడు. అంతా ఆశ్చర్యపోతూ వింటున్నారు. ఈ కలకలం విని మేడ మీది నుంచి కిందికి వచ్చారు స్వామి. ఆ జ్యోతిష్కుడాయనకు సాష్టాంగ నమస్కారం చేశాడు. ఆయన ఆసక్తితో విషయమేమిటని అడిగారు. శిష్యులు అంతా వివరించారు.

ఆయన నవ్వుతూ వాళ్ళందరికి చెప్పావు కదా నాకు కూడా చెప్పవయ్యా" అన్నారు. "అలాగే స్వామీ" అంటూ వాడొక క్షణం కళ్ళు మూసుకొని చెవి దగ్గర చెయ్యిపెట్టుకొని ఏదో విని చెప్పాలని ప్రయత్నించాడు. ఎంతసేపు ప్రయత్నించినా ఏమీ చెప్పలేకపోయాడు. ఖిన్నుడై నా దేవత పలకటం లేదండీ" అని నమస్కరించి వెళ్ళిపోయాడు. శిష్యులకు సందేహం కలిగింది. తమందరికి అంత అద్భుతంగా చెప్పిన జ్యోతిష్కుడు స్వామివారి కెందుకు చెప్పలేకపోయినాడు అని అనుమాన నివృత్తి చేయవలసిందిగా జగద్గురువులను ప్రార్థించారు. ఆయన చిరునవ్వు నవ్వుతూ విశేషమేమీ లేదు. వాడు కర్ణపిశాచి విద్య సాధించాడు. అది అడిగిన సంగతులన్నీ చెవులో చెబుతూ ఉంటుంది. దానికి ఇంక జాతక చక్రము అక్కరలేదు. చెయ్యి చూడడము అక్కరలేదు. మనిషిని చూస్తే చాలు. నా ఎదురుగా ఉన్నప్పుడు వాడు పిలిచిన ఆ క్షుద్ర పిశాచము రాలేకపోయింది. అందువల్ల వాడు వెళ్ళిపోయినాడు" అని విశదీకరించారు. మహాపురుషుల ముందు క్షుద్రపిశాచములు వచ్చి నిలువలేవు.

ఇటువంటి కథలు దేశంలో ఎన్నో వినిపిస్తూ ఉంటవి. వీటిలో చెప్పబడిన ఈ కర్ణపిశాచి ఒక విచిత్రమైన విద్య. దీనిని ఉపాసించిన వాళ్ళకు అది చెవులో అన్ని విధాలైన విషయాలను పిలిచినప్పుడల్లా వచ్చి చెబుతూ ఉంటుంది. క్షుద్రవిద్య కావటం వల్ల బ్రహ్మనిష్ఠులైన వ్యక్తులు దీని జోలికి పోరు. తంత్ర గ్రంథాలలో దీని సాధన విశేషాలు అనేక రీతుల చెప్పబడి వున్నవి. మంత్ర రత్నాకరంలో పిప్పలాద ఋషి దర్శించిన కర్ణపిశాచిని దేవతారూపాన్ని చూడండి.

శ్లో ॥ చితాసనస్థాం నరముండమాలా విభూషితాం అస్థిమణీం కరాబ్జైః
స్రోతాంనరాంత్రైః దధతీంకువస్త్రాం భజామహే కర్ణపిశాచినీం తాం

ఎముకలు, పేగులు, నరముండమాల ధరించి చితాసనము నందుండే కర్ణపిశాచిని దేవతను శ్మశానమునందుగాని, శవముపై కూర్చుండి కాని లక్షజపం చేసి అందులో దశాంశం విభీతక సమిధలతో హోమం చెయ్యాలి. ఆ తరువాత అపవిత్రయై బదరీతరువు క్రింద కూర్చొని మరో లక్ష చెయ్యాలి. అప్పుడా పిశాచి ప్రసన్నురాలై చెవిలో సర్వవిషయాలు చెబుతూ ఉంటుందట.

దీన్నే మరోచోట ఇంకో మంత్రం భేదం చెబుతూ విభీతకవృక్షం క్రింద ఒక లక్ష జపించి 21 రోజుల పాటు శయ్యాతలమునందు నగ్నుడై అషోత్తరశతము జపించాలని అప్పుడు శ్రవణపిశాచి సంతోషించి అనుగ్రహిస్తుందని చెప్పారు.

ఫేట్కారిణీ తంత్రంలో మరొక సాధన చెప్పబడింది. ఆ మూర్తి వర్ణన యిలా వుంది.

శ్లో ॥ ధ్యాయేత్ పిశాచీం చలశూల హస్తాం
శ్యామాం సుదీర్ఘాం యువతీం త్రినేత్రాం
క్రుద్ధాం వివర్ణాం తమ వృత్తమధ్యాం
గుంజాఫలైః కల్పితహారయష్టిం

గురివిందగింజల దండ మెడలో ధరించి చేతిలో శూలం పట్టుకున్న ఒక దీర్ఘ శ్యామలమైన త్రిలోచనను మంత్రపూర్వకంగా ధ్యానించాలి

శ్లో ॥ ఏకవింశద్దినం యావత్ ఉదయాస్తమయం జపేత్
నిత్యం సాయం స్వమాహారం పిండం హర్మ్యోపరిక్షిపేత్
త్రిసప్తాహేచ్చ తుష్టాసా శయ్యాం గత్వా పిశాచినీ
పంచవింశతి దేశానాం కథాంచ కథయత్యపి
త్రింశద్దినైశ్చ దేవేశి జంబూద్వీప కథాం నయేత్
ద్వాత్రింశతా తథా గౌరి త్రైలోక్యం శ్రావయేద్ధ్రువం
త్రిస్వాదుబలదానేన సర్వంవదతి తత్క్షణాత్
సభాయాం యది సంఘాతే ద్యూతేచ రిపుసంసది
సర్వం కథయతి క్షిప్రంనూనం తుష్టా పిశాచినీ
కేనాపినైవవేద్యాసా సాధక స్తాం ప్రపశ్యతి.

ఇరవై ఒక్కరోజులు సూర్యోదయం నుండి అస్తమయం దాకా జపించి రోజూ సాయంకాలం తాను తినే ఆహార పిండాన్ని మేడ మీద ఉంచాలి. 21రోజులిలా చేస్తే కర్ణపిశాచిని పక్క దగ్గరకు వచ్చి 25 దేశముల కథలు చెబుతుంది. 30 రోజులు చేస్తే జంబూద్వీప కథలు, 32 రోజులు చేస్తే మూడు లోకాల విశేషాలు వినిపిస్తుంది. త్రిమధురాలను బలి సమర్పిస్తుంటే కోరినప్పుడల్లా సభలో కాని, శత్రుమధ్యంలో కాని ఎక్కడైనా సరే సాధకుని కొక్కనికి మాత్రమే కనిపిస్తూ అన్ని విషయాలు చెబుతుందట. శ్మశానంలో చేసే విద్య కంటే ఇది కొంత మేల్తరమైనది. ఇటువంటివే కర్ణయక్షిణి, కర్ణమాతంగి మొదలైన కొంతమంచి విద్యలు కూడా వున్నవి. అయితే పిశాచ విద్యలు సిద్ధించినంత త్వరగా ఉత్తమ విద్యలు సిద్ధించవు గదా. యక్షపిశాచ నివాసాలైన మర్రి, రావి, బదరి, తాని చెట్ల క్రింద జపం చేస్తే ఈ కర్ణపిశాచ విద్యలు వేగంగా సిద్ధిస్తవి. దీని వల్ల సర్వ విషయాలు తెలుసుకోవచ్చు

# శవచింతామణి

సంస్కృతంలో నైషధీయ చరిత్రమనే మహాగ్రంధాన్ని రచించిన శ్రీహర్షుడు శవచింతామణీ మంత్రసిద్ధుడని ఒక ప్రసిద్ధ కథ ప్రచారంలో వుంది. శ్రీహర్షుని తండ్రి శ్రీహీరుడు; తల్లి మామల్లదేవి. శ్రీహీరుడొక విద్వాంసుని చేతిలో శాస్త్రవాదంలో ఓడిపోయి వాద శపథ ఫలితంగా ప్రత్యర్థి పండితుని పాదుకలను జీవితాంతమూ పూజించవలసివచ్చిందట! ఆ అవమానాన్ని భరించలేక అనతికాలంలోనే శారీరకంగా, మానసికంగా కృశించి అతడు మరణించాడు. అప్పటికి శ్రీహర్షుడు పసివాడు. అతనికేమీ తెలుసుకొనే వయస్సు కాదు. అతడు కాస్త పెరిగి ఉపనయనమై విద్యాభ్యాసం మొదలుపెట్టిన వెంటనే అతని తల్లికి తన బిడ్డను మహాపండితుని చేసి తనభర్త కవమానం కలిగించి, ఆయన అకాల మృత్యువుకు కారకుడైన శత్రువిద్వాంసుణ్ణి పరాజితుడ్ని చేయించాలని పట్టుదల ఏర్పడింది. ఆ దీక్షతోనే ఆమె ఇంత కాలమూ ప్రాణాలుగ్గబట్టుకొని ఉంది. కాని బిడ్డ శ్రీహర్షు డెప్పటికి విద్య పూర్తి చేసుకొని విద్వాంసుడై పరాభవం తీర్చగలడు? మామూలు పద్ధతిలో వేదాలు, శాస్త్రాలు చదువుకొని నిష్ణాతుడు కావటానికి చాలా యేండ్లు పడుతుంది. అప్పటికి విరోధి జీవించి వుంటాడో, వుండడో, ఒకవేళ వున్నా తన కుమారుడే గెలిచి తీరుతాడని నమ్మకమేమిటి? జయాపజయాలు దైవాధీనాలు. కనుక మామల్ల

దేవి ఆలోచించి దైవాన్ని వశం చేసుకొంటే తప్ప చిన్న వయస్సులోనే తన కుమారునికి పగతీర్చే శక్తిరాదని నిశ్చయం చేసుకొన్నది. తపస్సు వల్ల మాత్రమే దేవతలు అనుగ్రహిస్తారు. కాని శరీరాన్ని కృశింపజేసుకొని కఠోరనియమాలతో ఎంతకాలమో తపిస్తేనేగాని దేవతలు ప్రసన్నులు కారు. కనుక సామాన్యమైన వైదిక మార్గంలో కాక తీవ్ర వామాచార మార్గంలో ఆత్మబలిదానం ద్వారా సిద్ధి సాధించాలని ఆమె నిర్ణయించుకొన్నది. ఇంకా శ్రీహర్షుడు తానెత్తుకొనే వయస్సులోనే ఉన్నాడు. ఆమెకు శవచింతామణీ విద్య తెలుసు. సరస్వతి అధిదేవతగా గల చింతామణీ మంత్రాన్ని శవంపై కూర్చుండి జపిస్తే వెంటనే దేవతాసాక్షాత్కారం కలుగుతుందని ఆమె యెరుగును. శ్రీహర్షునికి మంత్రోపదేశం చేసి, తాను క్రింద పడుకొని, అతనిని మీద కూర్చోబెట్టుకొని, కండ్లు మూసుకొని, తాను పిల్చినదాకా జపం చేయమని చెప్పింది. కుర్రవాడు జపం చేస్తున్నాడు. ఆమె తన కుమారునికి మంత్రసిద్ధి కలగాలని సంకల్పించి నిశ్శబ్దంగా ప్రాణాలు వదిలింది. తల్లి పిలిచిన దాకా జపం చేయాలి గనుక శ్రీహర్షుడు జపిస్తూనే వున్నాడు. ఆ తల్లి సంకల్ప శక్తి వల్ల, ఆమె శవం కావటం వల్ల, శవం మీద కూర్చుండి జపం చేసినందువల్ల చింతామణీ మహామంత్ర దేవతయైన సరస్వతి అతనికి సాక్షాత్కరించి అజేయమైన కవితా పాండిత్యమును ప్రసాదించింది. ఆ సిద్ధశక్తితో అతడు ప్రత్యర్థులను జయించి తండ్రి అవమానానికి ప్రతిక్రియచేసి తల్లి ఆత్మకు శాంతి కలిగించాడు.

ఏదియేమైనా నైషధంలో చింతామణీ మంత్రం మహాద్భుతంగా వర్ణించబడింది. ఆ మంత్ర స్వరూపాన్ని వివరించే చిత్రమైన శ్లోకమిది.

శ్లో. **అవామావామార్ధే సకలముభయాకారఘటనా**
**ద్విధాభూతం రూపం భగవదభిధేయం భవతియత్**
**తదంతర్మంత్రంమే స్మరహరమయం సేందుమమలం**
**నిరాకారం శశ్వజ్జపనరపతే సిద్ధ్యతు సతే**

ఈ శ్లోకంలోంచి మంత్రోద్ధారం చేయటానికి వ్యాఖ్యాతలంతా ప్రయత్నించారు. ప్రణవ సంపుటితమైన మాయాబీజం మంత్రమని కొందరు భావించగా మరికొందరు రకరకాల మంత్ర రూపాలనందులోనించి చూపించారు. మరి శ్రీహర్షుడే మంత్రం చేశాడో ! నైషధాన్ని అనువదించిన కవిసార్వభౌముడు శ్రీనాథుడు, ఒక మత్తేభవిక్రీడితంలో దీన్ని ఇమిడ్చి గుప్త పద్ధతిలో పలికాడు.

**సకలంబై హిమరుక్కళాభరణమై సవ్యాపసవ్యార్థ యు**
**గ్మక రూపంబయి శైవమై గతకళంకంబై శివంబై యుపా**
**సక చింతామణియై ప్రసిద్ధ భగవచ్ఛబ్దాభిధేయార్థమై**
**ఒక మంత్రంబు మదీయమొప్పు నది నీ కుర్వీశ యే నిచ్చితిన్**

నలదమయంతుల వివాహ సందర్భంలో సరస్వతీదేవి నలునకు స్వయంగా ఈ మంత్రోపదేశం చేసింది. నిజానికీ కథలో ఆ మంత్రం యొక్క అవసరమేమీ లేదు. భారతంలోని నలోపాఖ్యానంలో ఈ ప్రస్తావనే లేదు. ఆ మంత్రాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పదలచుకొని శ్రీహర్షుడు దానికొక ఘట్టం కల్పించాడు.

ఆ మంత్ర మహత్వాన్ని ఎంతో అభినివేశంతో వర్ణించాడు. ఆ చింతామణీ మంత్రసిద్ధి పొందినవారు సర్వాంగీణరసామృతస్తిమిత వాచావీచివాచస్పతులై, గర్వోన్నద్ధవిరోధిరాడుదధివాగ్గాంభీర్యకుంభోద్భవులై, స్వర్వామా సదృశాంగనాజన మనస్సంచార పంచాస్త్రులై లోకంలో ఎదురులేక విహరిస్తారట! ఇంకా ఆ మంత్రవిద్య గొప్పదనం పరికించండి!

**ఎంత జడుడైన గానీ**
**చింతామణి మంత్ర రాజ సేవాపరుడ**
**బ్దాంతంబున కవితా సి**
**ద్ధాంత రహస్యోపనిష దుపాధ్యాయు డగున్.**

ఎంత మొద్దయినా సరే ఒక సంవత్సరము పాటు ఈ మంత్రాన్ని నిష్ఠతో సేవిస్తే మహాపండితుడై కవితాచార్యుడై వర్ధిల్లుతాడు.

**ఆచారపరత వేకువ**
**లేచి పఠింపుము కుమార లేఖర్షభ యీ**
**శ్రీచింతామణి మంత్రము**
**ప్రాచికి నభిముఖుడవై శుభంబొనగూడున్.**

రోజూ తెల్లవారుజామునే లేచి తూర్పువైపుకు తిరిగి చింతామణీ మహామంత్రాన్ని శ్రద్ధతో జపించేవానికి సర్వశుభములూ కలుగుతవని సరస్వతీ దేవి నలునకు సిద్ధసారస్వత సంసిద్ధిదాయకమైన ఆ మహావిద్యను కరుణతో అనుగ్రహించింది. బహుశా శ్రీనాధుడు కూడా బ్రాహ్మీదత్త వరప్రసాదుడనని చెప్పుకోవటం వల్ల ఈ విద్యనే ఉపాసించాడేమో అని ఊహించటానికి అవకాశం

ఉంది.

ఆ విధంగా చింతామణి స్మరణం చేసినవాళ్ళు అక్కడక్కడ మనకు కనిపిస్తారు. శ్రీకృష్ణ కర్ణామృతకర్త మొదటి శ్లోకం చూడండి.

శ్లో. **చింతామణిర్జయతు సోమగిరిర్గురుర్మే**
**శిక్షాగురుశ్చ భగవాన్ శిఖిపింఛమౌళిః**
**యత్పాదకల్పతరుపల్లవ శేఖరేషు**
**లీలా స్వయంవర రసం లభతే జయశ్రీః**

లీలాశుకుని యీ చింతామణి యెవరో నిర్ణయించటం కష్టం, అతని జీవితంలో మార్పుకు కారణమైన చింతామణి అనే వేశ్య అని కొందరంటారు. లేదా అతడు చింతామణి మంత్రోపాసకుడూ అయి వుండవచ్చు. తాను శైవుడ్నని, పంచాక్షరీ జపపరుణ్నని చెప్పుకోవటం వల్ల శివచింతామణి చేసి వుంటాడేమో అని కూడా అనుకోవచ్చు.

మొత్తం మీద సారస్వతాది బహుసిద్ధి ప్రదాయకమైన చింతామణీ విద్య ఎన్ని రకాలుగానో మంత్రశాస్త్రాలలో మనకు దర్శనమిస్తుంది. దీనిని దక్షిణాచారంలో,వామాచారంలో రెంటిలోనూ చేయవచ్చు. శవచింతామణి సాధనకు తారా పద్ధతిలో చేయవచ్చు.

శ్లో. **శ్మశానే శూన్యసదనే దేవాగారేఒ ధనిర్జనే**
**పర్వతే వనమధ్యేవా శవమారుహ్య మంత్రవిత్**
**సమరే శత్రునిహతం యద్వా షాణ్మాసికం శిశుం**
**విద్యాం సంసాధయేత్ శీఘ్రం సాధితైవం ప్రసిద్ధ్యతి.**

శ్మశానంలో, ఎవరూ నివసించని యింట్లో, దేవాగారమున, నిర్జనమైన పర్వతమున, అడవిలో శవముపై ఎక్కి జపము చేయవలెను. యుద్ధములో శత్రువుల చేత మరణించిన వాని శవమైనా, ఆరునెలల శిశువు శవమైనా సరే, అలా చేస్తే విద్య త్వరగా సిద్ధిస్తుంది.

శాస్త్ర దృష్టితో, పరిశోధన దృష్టితో ఈ శవసాధనలు ఇవ్వబడుతున్నవే గాని, ప్రయోగ, సాధనవైఖరితో ఆలోచించేవారు ప్రస్తుత చట్టాలను దృష్టిలో వుంచుకోవటం అవసరం.

# సారస్వత విద్యలు

పాఠశాలల్లో, కళాశాలల్లో చదివే విద్యార్థులు, వయసు పెరిగిన తర్వాత చదివే పెద్దలు తరచుగా జ్ఞాపకశక్తిని గురించి ఫిర్యాదు చేయటం చూస్తుంటాము. చదివింది బాగా జ్ఞాపకం ఉండటం లేదని ఎందరో అంటుంటారు. జ్ఞాపకశక్తి పెరగటానికి మార్గమేదైనా వుందా అని కూడా వెదుకుతూ వుంటారు.

మామూలుగా జ్ఞాపకశక్తి పెరగటానికి జ్ఞాపక వ్యాయామము చేయటమే ఉత్తమమైన పద్ధతి. శరీరం పెరగటానికి బలపడటానికి ఎటులో అటులే మనస్సు దృఢంగా ఏకాగ్రంగా నిలపటానికి వ్యాయామం అవసరం. అదేదో వింత సాధనమేమీ కాదు. ప్రాచీన కాలం నుంచి అనుసరింపబడుతున్న మార్గమే. కంఠతా వచ్చేట్లు అభ్యసించటమే అది. వల్లెవేయటం వల్ల గుర్తుంచుకునే అలవాటు పెరుగుతుంది. వేదాధ్యయన పరులలోని జ్ఞాపకశక్తి రహస్యమదే. దానికి తోడు తీసుకొనే ఆహారం మీద కూడా ఆ శక్తిచాలనం ఆధారపడి వుంటుంది. రాజస తామసాహారాలను తీసుకుంటే మాంద్యం, అలసత ఏర్పడి బుద్ధి మందగిస్తుంది. సాత్వికాహారం వల్ల బుద్ధి పదునుదేరుతుంది. ఘృతాని కాశక్తి వుందని ఆయుర్వేదం చెబుతున్నది. సారస్వతౌషధాలను గూర్చి ప్రత్యేకంగా చర్చలే చేసినవి ఆయుర్వేద గ్రంథాలు. ఛందశ్శాస్త్రకారుడైన అప్పకవి కూడ కవిత్వం చెప్పటానికి ఓషధులంటూ బ్రాహ్మీ బోడతరము, పిప్పలి, వస, శొంఠి మొదలైన వాటిని గూర్చి చెప్పాడు. సరస్వతి ఆకుతో ఘృత, చూర్ణాదులు చేసే ప్రక్రియలున్నవి. **"సద్యోబుద్ధిహరం బింబం సద్యోబుద్ధికరీ వచా"** అని ప్రాచీనోక్తి, తినగానే బుద్ధిని దొండ హరిస్తుంది, వస కలిగిస్తుందని వస్తు గుణాన్ని బట్టి ప్రాచీనులు నిర్వచించారు. వసుచరిత్రకారుడైన రామరాజ భూషణుడు **"ఏ లబ్బెడిన్ తలక్రిందైన అనూన వాగ్గ్రహణ మేధాశక్తి బింబాశికిన్"** అని తలక్రిందుగా తపస్సు చేసినా దొండతినేవాడికి వాక్కులను గ్రహించే శక్తి ఎలా అబ్బుతుంది అని అన్నాడు. **అశేష శేముషీ మూషరమాష మశ్నామి మాతుల"** అనే సంస్కృతోక్తి పండితలోక ప్రసిద్ధమైంది. మినుములతో చేసిన ఏమి పదార్థమైనా బుద్ధిసంపదను పోగొట్టుతుంది. ఇడ్లీ, వడ, గారె, కుడుములు, దోసె మొదలైన తినుబండారాలు జ్ఞాపకశక్తిని పాడుచేసేవే.

యోగశాస్త్రంలో శీర్షాసనం జ్ఞాపకశక్తిని పెంచుతుందని వ్రాయబడింది.

చాలామంది రోజూ కొద్ది నిముషాలు గోడకానుకొనో, అనుకోకుండానో శీర్షాసనం వేసి నాలుగు వారాలు కాగానే జ్ఞాపకశక్తి యేమీ పెరిగినట్లు లేదే అని బాధపడిపోతుంటారు. ఆహారశుద్ధితో ఆరు నెలలు రోజుకు మూడు గంటల చొప్పున ఆసనంవేస్తే గాని ఆసనసిద్ధి రాదనీ, అప్పుడుగాని ఫలితాలు కనపడవనీ వారెరగరు.

ఇక మంత్రశాస్త్రానికి వస్తే బుద్ధిశక్తిని పెంచేవి, వాక్ప్రభావాన్నిచ్చేవి, కవిత్వాన్ని ప్రసాదించేవి చాలా విద్యలున్నవి. ఐంకారానికి వాగ్బీజమనే పేరు. ఆ ఒక్క అక్షరాన్ని జపిస్తే చాలు సాధకుడు వాక్పతి కాగలడు. దేవీభాగవతంలో ఒక కథ ఉంది. సత్యవ్రతుడని పేరు గాంచిన ఒక విప్రుడు నిర్జన ప్రదేశములో ఒక కుటీరము నిర్మించుకొని ఉన్నాడు. ఒక రోజు వనవరాహాన్నొకదాన్ని తరుముతూ ఒక కిరాతుడు అటువైపు వచ్చాడు. భయభ్రాంతమైన పంది అరుస్తూ ఒక పొదలో దూరి దాక్కొన్నది. బోయవాడు వచ్చి ఇతణ్ణి అడిగాడు. స్వామి మీరు సత్యవ్రతులు, ఆహారం కోసం, నేను వేటాడుతున్నాను. ఆ పంది యెటుపోయిందో చెప్పండి" సత్యవ్రతునకేమీ పాలుపోలేదు. నిజం చెపితే వాడు దాన్ని చంపుతాడు. అబద్ధం చెప్పటం తన వ్రతవిరుద్ధం. ఓయీ! చూచిన కన్నులకు మాట్లాడే శక్తి లేదు. మాట్లాడే నోటికి చూచేశక్తి లేదు. ఏం చెప్పేది" అన్నాడు. స్వాములవారేదో వేదాంతం చెపుతున్నాడని వాడు వెళ్ళిపోయినాడు. ఆ పంది ఆర్తితో అరిచిన అరుపులో అతనికి ఐంకారం వినిపించింది. ఆ వింత ధ్వనిని మననం చేస్తూ ఉంటే మనస్సు దానియందు లగ్నమైంది. అది సమాధియైంది. ఆ యేకాగ్రనిశ్చల దశలో ఆ నాదానికి అధిష్ఠాన దేవతయైన సరస్వతి అతనికి సాక్షాత్కరించింది. ధవళవర్ణోద్భాసితయై వీణా పుస్తకపాణియై శరచ్చంద్రకాంతితో ప్రకాశించే శారదాదేవిని ఆచార్య శంకరులెలా వర్ణించారో చూడండి.

శ్లో. శరజ్జ్యోత్స్నాశుద్ధాం శశియుతజటాజూటమకుటాం
వరత్రాసత్రాణస్ఫటిక ఘుటికా పుస్తకకరాం
సకృన్నత్వానత్వా కథమపిసతాం సన్నిదధతే
మధుక్షీర ద్రాక్షా మధురిమధురీణాః ఫణితయః

సత్వగుణంతో ప్రారంభమైన శక్తి చాలనం ఎప్పుడూ అరుణోజ్జ్వలమైన రజోగుణం నుంచే జరుగుతుంది. అందుకే కాబోలు ఆచార్యులు మరొకచోట ఆ విరించి ప్రేయసిని కవీంద్ర చేతః కమల వనములకు బాలాతపరుచిగా అరుణగా తరుణతరశృంగారలహరీగభీర వాక్ప్రసాదినిగా వర్ణించారు. చిదగ్నికుండ

సంభూతయైన లలితాపరమేశ్వరి విలాసాలను వర్ణించే ఘట్టమిది.

శ్వేతకాంతితో ప్రకాశించే సరస్వతి ఒకప్పుడు నీల వర్ణంతో కూడా అలరారుతూ ఉంటుంది. అప్పు డామెకు నీలసరస్వతి అనిపేరు. తారామంత్ర ప్రభేదములలో ఈ విద్య ఒకటి. ఘంటాశిరశ్శూల కరవాలములను ధరించి చంద్రకళావతంసయైన ఆ దేవతను బ్రహ్మ దర్శించినట్లుగా మంత్రరత్నాకరం చెబుతున్నది. శవాసన, సర్పభూషణ, కర్త్రీకపాల చషక త్రిశూలధారిణి, నరముండమాలాలంకార, త్రిలోచన అయిన మరొక రూపం కూడ వున్నది.

తారా విద్య మహాశక్తి సంపన్నమైనదిగా తాంత్రికులు భావిస్తారు. కాశ్మీర వంగ భూములలో దీనికి మిక్కిలి ప్రశస్తి ఉండేది. నవద్వీపపండితులతో వాదిస్తున్నప్పుడు సభాపతియైన అంబికాదత్తుడనే మహావిద్వాంసుడు వాసిష్ఠగణపతిశాస్త్రిని "యత్కిం త్రిభువనసారా తారానారాధితాభవతా!" అని అధిక్షేపించాడు. అప్పటికి వాదంలో గెలిచి కావ్యకంఠ బిరుదునందుకొన్నా ఆ తారా విద్యను సాధించాలి అనే పట్టుదలతో వెదకివెదకి ఆ విద్యావేత్త నొకనిని కనుగొని వింధ్య దక్షిణ ప్రాంతంలో ఆ విద్యను ప్రచారం చేసినవారిలో ప్రథముడైనాడు. ఆ విద్యను ఉపదేశించటంలో కూడా ఒక ప్రత్యేకత వుంది. ఉపదేశించే వ్యక్తి స్త్రీ అయితే ఇబ్బంది లేదు. పురుషుడైతే స్త్రీ ద్వారా మంత్రాన్ని శిష్యున కుపదేశించాలి. విద్యాధిదేవత తారామంత్రాన్ని గురించి మంత్రమహోదధిలో, మంత్రమహార్ణవంలో తదితర గ్రంథాలలో చాలా విశేషాలు చెప్పబడినవి. ఒక చమత్కార సహితమైన విశేషమేమిటంటే తారా మంత్రసిద్ధుడు సంస్కారవంతమైన కుటుంబములో పుట్టిన 8ఏండ్ల వయస్సు గల ఇద్దరు బాలురను తెచ్చి వారి శిరస్సులపై రెండు చేతులుంచి అభిమంత్రణం చేస్తే ఇద్దరూ ఆవేశపూరితులై శాస్త్రవాదం చేస్తారుట. బౌద్ధమతంలో కూడా తార అత్యంత ప్రధానమైనదేవత. "అపారమైన వాగ్వైభవాన్ని ప్రసాదించే దివ్యశక్తిగా వజ్రయాన సంప్రదాయస్థులు ఆమెను ఆరాధిస్తారు.

ఆ తరువాత దశమహావిద్యల్లో కాళీదేవత సర్వసిద్ధి ప్రదాయకమైన విద్యయే అయినా ప్రత్యేకంగా కవితా ప్రసాదినిగా కూడా వర్ణించబడింది.

శ్లో. గతాసూనాం బాహు ప్రకరకృత కాంచీపరిలసత్
నితంబాం దిగ్వస్త్రాం త్రిభువన విధాత్రీం త్రినయనాం

**శ్మశానస్థే తల్పే శవహృదిమహాకాలసురత**
**ప్రసక్తాం త్వాం ధ్యాయన్ జపతి జడచేతా అపి కవిః**

నక్కలతో, ఘోరమైన శవనివహముతో, ముండాస్థి నికరముతో సంకీర్ణమైన శ్మశానమునందలి చితిపై మహాకాలునితో పురుషాయిత మొనరించు మహాకాళిని ధ్యానించుచు ఆ త్రిలోచని మంత్రము నెవడు జపించునో వాడెంత జడుడైనను కవియగునని చెప్పబడినది. అటులే మదనమందిరమును మనసున నిల్పుకుని దానినే చూచుచు కాళీమంత్రమును జపించువాడు కవితామృతమును ప్రవహింపజేయునని గంధర్వ శ్రేణీపతి అవుతాడని మహాకాళ ప్రణీతమైన కర్పూరాంబాస్తోత్రంలో చెప్పబడింది.

విద్యను ప్రసాదించే దేవతలుగా గణపతి, కుమారస్వామి, మేధాదక్షిణామూర్తి మొదలైనవారికి లోకంలో ఎంతో ప్రసిద్ధి. కుమారస్వామిని ఆరాధించే పాణిని పండితుడైనాడు. శాతవాహనుని ఆస్థానంలో గుణాఢ్యపండితునితో పేచీపడిన శర్వవర్మ మహారాజును సంస్కృత పండితుణ్ని చేయటానికి కాతంత్రవ్యాకరణాన్ని నిర్మించింది ఆ స్కందుని అనుగ్రహం వల్లనే. దక్షిణ దేశంలో ముఖ్యంగా తమిళసీమలో వినాయకుని, కార్తికేయుని ఆరాధించి విద్యావైభవాన్ని పొందుతూ వుంటారు. వీరశైవం బాగా ప్రబలిన కన్నడ దేశంలో, భక్తి మీది వలపు బ్రాహ్మ్యముతో పొత్తుపాయని ఆరాధ్య శైవకుటుంబాలలో కేవలం శివపంచాక్షరీ ప్రభావం చేతనే విద్యలను కైవసం చేసుకున్న వారెందరో వున్నారు. తెలుగుదేశంలో విచిత్రంగా క్రీడాభిరామకర్తయైన వల్లభరాయ డొకడు భైరవుని ఆరాధించి సిద్ధసారస్వతశ్రీని పొందినాడట.

**ఆహరవధి సమయనృత్యత్**
**తుహినాంశుధర ప్రచారధూతాభ్రధునీ**
**లహరీభ్రమ ఘుమఘుమములు**
**వహితిప్పయ వల్లభన్న వాగ్వైభవముల్.**

భైరవానుగ్రహలబ్ధమైన విలక్షణ కవితావిన్యాస లక్షణం ఇందులో పలుకబడింది.

# దీపావళి-దీపదేవతలు

దీపావళి పండుగను నరక వధానంతర సంతోష సూచకంగా దేశంలో జరుపుకోవటం ఆచారంగా వచ్చింది. రాక్షసులను సంహరించిన సందర్భంగా ఆనందాన్నివెలిబుచ్చే ఉత్సవాలు చేసుకోవటం భూలోకవాసులకే కాక దేవలోకవాసులకు కూడా సహజమే. అయితే అసుర సంహారం జరిగిన సందర్భాలు వాటిని పండుగలుగా పవిత్ర దినాలుగా జరుపుకోవటం మనకు అనాది కాలం నుంచి ఉన్నది. దేవీ నవరాత్రులు, విజయదశమి, నృసింహ జయంతి మొదలైనవి దానవ సంహారానికి గుర్తులే. అయితే వాటికి వేటికీ లేని దీపావళి అనేపేరు నరకాసుర వధానంతర దినాన జరిపే పండుగకు వచ్చింది. కొంచెం జాగ్రత్తగా గమనిస్తే దానికి కారణం గుర్తించవచ్చు.

భారత కాలం నాడు చిన్న చిన్న రాక్షసులెందరో ఉన్నారు. పెద్దవాళ్ళలో కంస, జరాసంధ, కాలయవన, నరకులు ముఖ్యులు. అందులో కంస కాలయవనులు స్వార్థాహంకారసహితులు. జరాసంధుడు, నరకుడు ప్రత్యేక ఆరాధనా మార్గాన్ని అనుసరించి సమాజంలో విపరీత ధోరణులు ప్రవేశపెట్టినారు. వీరు కాక దుర్యోధనాదులు మహారాక్షసాంశ సంభూతులే. అరణ్య పర్వంలో ఘోషయాత్ర సందర్భంగా ఈ విషయాలన్నీ బహిర్గతమైనవి. వాళ్ళ తత్వం వేరు.

ఎప్పటికప్పుడు సృష్టిలో దైవీమార్గాన్ని ఎదుర్కొని నాశనం చేయటానికి ఆసురీ మార్గం ప్రయత్నిస్తూనే ఉంటుంది. రాక్షసులు తమ సర్వశక్తులూ వినియోగించి దేవతలను ఎదుర్కొంటూనే ఉంటారు. మంత్ర శాస్త్రంలో కూడా రెండు విభాగాలున్నవి. రక్షో మంత్రములు, రక్షోఘ్నమంత్రములు, రక్షఃపిశాచముల నెదుర్కొని రక్షించుకొని, జయించటానికి ఆసుర మాయలను నాశనం చేయటానికి వైదికులు రక్షోఘ్న మంత్రములను ప్రయోగించేవారు. వేదవేత్తలను దేవతలను నాశనం చేయటానికి రాక్షసులు కొన్ని తీవ్ర శక్తులనుపాసించేవారు. ఆ మంత్రాల తీరే చిత్రంగా ఉంటుంది. ఉదాహరణకు నమశ్చండి ఘోరేఘోరతరేసుఘోరాన్ హన హన బ్రాహ్మణాన్ నాశయ నాశయ ఋషీన్ మారయమారయ. ఇత్యాది - రాక్షసులు భావించే ఉగ్రశక్తులు వారి తీవ్ర తపశ్చర్య చేత వాళ్ళు కోరిన వరాలు ప్రసాదించేవి.

భారతకాలం నాడు జరాసంధ నరకులు విలక్షణమైన జీవులు. జరాసంధుడు మూర్ధాభిషిక్తులైన క్షత్రియులను తెచ్చి భైరవునికి బలియిచ్చేవాడు. యుద్ధంలో చంపటంవేరు. బలి యివ్వటం వేరు. సంహారమనేది ఉభయత్ర ఉన్నా రణరంగవధ వీరకర్మ. బలి క్రూరకర్మ. రెంటి లక్షణమే వేరు. నరబలి యిచ్చే దుష్టతాంత్రిక వామాచార సంప్రదాయానికి చెందినవాడు జరాసంధుడు. వాడు మళ్లీ బ్రాహ్మణ భక్తుడే. దానధర్మ పరాయణుడే. కాని వాడి దుష్టగుణం సమాజానికి అపకారహేతువైంది. ఈనాడు కూడా చూడండి. దైవభక్తి, దానధర్మాలు చేస్తూనే ఉంటారు. పరధనాపహరణ, పరదారగమనము చేస్తుంటారు. రోజూ ప్రొద్దుననే లేచి శుచిగా దేవతార్చన చేస్తారు. ఆఫీసు కెళ్లి లంచాలు తీసుకొంటారు. తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదమే అన్న ప్రకారంగా ఉంది లోకం.

జరాసంధ లక్షణమది. ఈ వికృతి ఉన్నంత కాలం సంఘం బాగుపడదు. ఇలాంటి మరో వికృతి మూర్తీభవించినవాడు నరకుడు. నరకశబ్దంలోనే విచిత్ర లక్షణముంది. పాపాత్ములు పోయేలోకానికి నరకమని పేరు. యుగయుగాల నుంచి ఉన్న పేరిది. వీడికా పేరు వచ్చింది. ఆ అంధకారలోక ప్రతీక వీడన్న మాట. తమోజీవుడన్నమాట. వీడిది అతి తీవ్రకామప్రవృత్తి. లోకంలో ఉండే సౌందర్యవతులైన స్త్రీలనందరినీ తాను పొందాలనే ప్రకృతివాడిది. అది సాధించటానికి వాడు కామము నుపాసించాడు. దానికి స్థానమైన మదనాలయము వాని ఆరాధ్య స్థానము. ఆ జీవుని కర్మ విశేషము! వానికా అర్చన స్థానము, ఆలయము దొరికింది.

సతీదేవి శరీరమును-ప్రాణత్యాగానంతరము-దుఃఖవివశుడైన మహేశ్వరుడు తన తలపై ధరించి భయంకర తాండవమాడినాడు. ఆ ప్రళయ నాట్యాన్నాపటానికి విష్ణువు తన చక్రాన్ని ప్రయోగించగా ఆ శరీరము పదునెనిమిది ఖండములై వివిధ ప్రదేశములలో పడినవి. దేహపు తునకలు పడిన చోట్లే అష్టాదశ మహాశక్తి పీఠములైనవి. పరమేశ్వరీ యోని పడిన చోటు కామాఖ్య - నరకుని రాజ్యములో ఉంది. ఇప్పటికీ ఆ ఆలయంలో పూజించేది ఆ అవయాన్నే. నరకుడు కామ తీవ్రుడై ఆ భగోపాసన చేశాడు. తత్ఫలితంగా భయంకర వశీకరణ శక్తి, అద్భుత పరాక్రమమూ సాధించాడు. ఆ దేవత అనుగ్రహాన్ని స్మరిస్తూ తన కుమారునికి భగదత్తుడని పేరు పెట్టుకొన్నాడు. భగదేవతా వరప్రసాదమా బిడ్డ.

వేదంలో కూడా భగారాధన ఉంది. అయితే దాని స్వరూపం వేరు.

ఋగ్వేదంలోని ఏడో మండలంలో భగమంత్రములున్నవి.

**ఓం భగప్రణేతర్భగ సత్యరాధో భగేమాంధియ ముదవాదదన్నః**
**భగప్రణోజనయ గోభిరశ్వై ర్భగ ప్రన్నృభిర్నృవంతః స్యామ**

ఇటువంటి - ఐశ్వర్య ప్రదాతయైన ఈశ్వరుణ్ణి స్తోత్రం చేసే మంత్రాలు ఇవన్నీ దక్షిణాచార మార్గంలో శుచిగా ధ్యానించవలసిన ఋక్కులు.

నరకుని దలా కాదు. కేవల వామాచార సాధకు డతను. స్త్రీని - సాధనంగా ఉపయోగించే పద్ధతి ననుసరించినాడు. తంత్ర గ్రంథాలలో ఆ పద్ధతులన్నీ చెప్పబడినవి. కృష్ణ చతుర్దశి ఈ సాధనాలన్నింటికీ అతి ముఖ్యమైన రోజు. కృష్ణ చతుర్దశి నాడు నరకవధ జరగటంలో కూడా ఒక విశేషం ఉంది. అది దుష్టశక్తుల విజృంభణ కనుకూలమైన సమయం. తాంత్రికులకు అమావాస్య కంటే కూడా కృష్ణచతుర్దశి చాలా ప్రధానం. మంత్రమహోదధిలో బహుళ చతుర్దశి నాడు జరిపే కామ తంత్రాన్ని విపులంగా వర్ణించారు. **భూతాహే కృష్ణపక్షస్య సాధకో నియత వ్రతః, ఆనీయ కామినీం రమ్యాం నరపంచక గామినీం, కృత్వాతాం వివసనాం పూజయేత్ సుసమాహితః, భక్త్యా నివేదనం దత్వా గచ్ఛేత్తాం ప్రజపన్మనుం"**

ఇటువంటి క్షుద్ర -వామాచార సాధకులలో నరకు డగ్రగణ్యుడు.వాళ్ళు సాధించిన శక్తులను చూచి అనేకులు లోకంలో మోజుపడి అటువంటి సాధనలలోకి దిగుతారు. ఇంద్రియజయం లేకుండా శక్తులు సాధించిన వాళ్ళు ఎలానూ వాటిని దుర్వినియోగం చేస్తారు. అప్పుడు కృష్ణుడు నరకుని సంహరించినట్లుగా వాళ్ళ నాశనం కాక తప్పదు.

తమోరూపుడైన నరకుని వధకు సూర్యోపాసకుడైన సత్రాజిత్తు కూతురు సత్యభామ కారకురాలు కావటం కూడా గమనించవలసిన అంశమే.. ఆ అసురుణ్ణి చీకటిని వెలుతురు లాగా సంహరించిన చక్రం సహస్రారం.

సహస్రకరుడైన సూర్యుని మించిన తేజస్సుకలిగినదా ఆయుధం. లోకంలో కూడా క్షుద్ర ప్రయోగాలను నివారించి దహించే శక్తి సుదర్శనానికి మహామంత్రానికున్నది.

తమోరూపుడై తామసీశక్తులు సాధించిన నరకుణ్ణి కృష్ణచతుర్దశి నాడు లోకక్షయ కృత్ప్రవృద్ధుడైన కాలస్వరూపుడు కృష్ణుడు సంహరించాడు. ఈ వధతో సమాజంలోని అజ్ఞానాంధకారం తొలగి దుర్మత వినాశనం జరిగింది. నరకుడు

బంధించి ఉంచిన పదహారువేలమంది జీవితాలలోను చీకట్లుపోయి వెలుగు లుదయించినవి. యావత్ప్రపంచంలోను ఒక దుష్టకామ ప్రవృత్తి నశించటానికి ఆస్కారం ఏర్పడింది. ప్రమాద భయ శంకలు లేక గౌరవ మర్యాదలు గల కుటుంబాల వారు సుఖంగా గుండెలపై చేయి వేసుకొని నిద్రించారు. కనుకనే అది అనంతకోటి ప్రజా హృదయాలలో దీపాలు వెలిగించిన పండుగ అయినది.

నరకుని వంటి వారి జీవితాలను చూచి ప్రజలు నేర్చుకోవలసినది మరో అంశం కూడా ఉంది. నరకుడు భూమి మీదికి రావటానికి కారణం నిషిద్ధ సమయ సంయోగం, సంగమించిన వారు భూదేవి, వరాహమూర్తులే అయినా సమయ ప్రభావం అనుల్లంఘనీయం. దేవతలకే అది తప్పలేదంటే మనుషుల సంగతి చెప్పవలసిన పనిలేదు. జ్ఞాన దీపం హృదయాలలో వెలిగించుకొంటే శాస్త్ర విరుద్ధకార్యాలు చేయకుండా వివేకం వికసించి మానవుడు ఊర్ధ్వగామి కాగలడు. దీపావళి పండుగ అటువంటి జ్ఞాన వికాసానికి, తిమిర నాశనానికి చిహ్నం. అసలు దీపం వెలిగించి ఆహ్వానిస్తే చాలు దేవతలు దిగి వస్తారు. అందుకే సంధ్యావేళ దీపం వెలిగించి మనవాళ్ళు

**దీపం జ్యోతిః పరబ్రహ్మాం దీపం సర్వతమోపహం**
**దీపేన సాధ్యతే సర్వం సంధ్యాదీప ! నమోస్తుతే**

అని దీపస్తుతి చేశారు. తేజోరూపులైన దేవతలు దీపమంటే ఇష్టపడతారు. దీనివలన ఏదైనా సాధించవచ్చుననటం ఆ విశేషాన్నే చెబుతుంది. దేవతాయంత్రం వేసి ప్రాణ ప్రతిష్ఠ చేసి అందులో దీపం వెలిగించి దేవతాహ్వానం చేస్తే అందులోకి దేవత అవతరించి అనేక విషయాలను చూపుతుందని, చెపుతుందని మేరుతంత్రం నొక్కివక్కాణిస్తున్నది. దీపదుర్గా- ఉపాసన మహాసిద్ధికరమైన విద్యలలో ఒకటని ఆకాశభైరవ కల్పంలో చెప్పబడింది. "దీపప్రియ ః కార్తవీర్యః" అని ప్రాచీనోక్తి. దీపంవెలిగించి చేతులు జోడించి కార్తవీర్యార్జునుని ముమ్మారు స్మరిస్తే చాలు దుష్టగ్రహ, చోరాది బాధలు తొలగిపోతవని దత్తాత్రేయ తంత్రం పలుకుతున్నది.

ఏదైనా నరులలోని తిమిరాన్ని తొలగించేది జ్ఞానదీపం. ఆ చిహ్నమైన దీపావళి పండుగ ప్రపంచానికే వెలుగుల వెల్లువ.

# కాలతంత్రం

ప్రతి సంవత్సరం చైత్రశుద్ధ పాడ్యమి నాడు ఉగాది పండుగ జరుపుకోవటం తెలుగుదేశంలో అనాది కాలం నుండీ వస్తున్న ఆచారం. ఐతే అన్ని భాషా ప్రాంతాలలోనూ ఇది ఒకేరకంగా లేదు. తమిళుల సంవత్సరాది వేరు. ఉత్తరాది రాష్ట్రాలలోను కొన్ని చోట్ల వేరే. ఆయా ప్రాంతాలలో అక్కడి పంచాంగ గణన పద్ధతిని బట్టి ఉగాది పండుగ జరుపుకొంటున్నారు. ప్రాచీన కాలంలో కూడా ఇది ఒకరకంగా లేదు. ఇంచుమించు రామాయణ కాలంలో జ్యేష్ఠ మాసం సంవత్సరాదిగా భావించబడినట్లు కన్పిస్తుంది. భారతకాలంలో వైశాఖ మాసంలో ఉగాది వచ్చేదని తెలియవస్తున్నది. ఇప్పుడు మనం చైత్ర శుద్ధ ప్రథమ దినాన్ని ఉగాదిగా జరుపుకుంటూ ఉన్నాము. నిజానికి చైత్ర మాసం వచ్చే సరికి ఎండలు బాగా కాస్తున్నాయి. చైత్రవైశాఖ మాసములు వసంత ఋతువు అని చదువుకోవటమే తప్పు అందులోని వైశాఖము ఎప్పుడో వేసగి అనే తద్భవరూపాన్ని పొంది ఎండాకాలం అన్న అర్థాన్ని ఇస్తున్నది. అంతేకాదు ఫాల్గుణ మాసం వచ్చే సరికి చెట్లు చిగుర్చి వేపపూత మొదలైనవి ధారాళంగా దొరకటం మొదలవుతున్నది. ఇటీవలైతే కొన్ని ఉగాదులకు వేప పువ్వు దొరకటం లేదు కూడా. పూతకాలం అయిపోవచ్చునన్న మాట. మొత్తం మీద తేలిన ఆంతర్య మేమిటంటే నిజమైన ఉగాది ఫాల్గుణ మాసానికి జరిగిందని చెప్పవచ్చు.

పూర్వకాలంలోనైతే ఋషులు మొదలైన మహానుభావులుండేవాళ్లు, వాళ్ళేదన్నా అది శాసనంగా చెలామణీ అయ్యేది. ఋతువునకు ఒక నెల వెనక్కు జరపండి అంటే అది జరపబడేది. ఎందుకంటే ప్రకృతిలో జరిగిన ఒక మార్పును గుర్తించటమే కనుక. ఇవాళ ప్రజా హృదయాలను అంతగా శాసించగల శాస్త్రకారులు, ఋషులూ లేరు. కనుకనే వెనుకటిలాగా జ్యేష్ఠ మాసం నుంచి వైశాఖ మాసం, వైశాఖం నుంచి చైత్రం మారినట్లుగా చైత్రం నుంచి ఫాల్గుణానికి మారే అవకాశం కనపడటం లేదు. ఎంతో ఆలోచించి క్రీస్తు శకాన్ని తొలగిద్దామని శక సంవత్సరాన్ని ప్రవేశపెడితే ప్రజలచేత దాన్ని పాటింపజేసేశక్తి ప్రభుత్వానికి లేకపోయింది. ఇప్పుడు ప్రభుత్వ రంగాలలో కూడా శక సంవత్సరాల క్యాలండర్‌కు విలువపోయింది.

యుగాది శబ్దమే ఉగాదిగా పరిణమించిందని భాషా శాస్త్రవేత్తల

అభిప్రాయం. యుగాలు మారుతున్నప్పుడల్లా ఋతుగమనంలోనే కాదు సృష్టిలోని సర్వచరాచర ప్రకృతిలోను అపూర్వమైన మార్పు వస్తున్నట్లు మన వాఙ్మయంలో ఆధారాలు కన్పిస్తవి. దీనికి మూలం కాలతంత్రమని భాగవతంలో చెప్పబడింది. ఈ అనంతసృష్టిలో అనూహ్యములైన పరిణామాలను తీసుకురాగలిగిన ప్రభావం కాలతంత్రానికుందని ఘంటాఘోషంగా పురాణాలు చెబుతున్నాయి. భాగవతంలోని ఈ పద్యం చూడండి.

**వాయువశంబులై ఎగసి, వారిధరంబులు మింట కూడుచున్**
**పాయుచు నుండు కైవడి, ప్రపంచము సర్వము కాలతంత్రమై**
**పాయుచు కూడుచుండు, నొక భంగి చరింపదు, కాలమన్నియున్**
**జేయుచు నుండు, కాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్**

పంచభూతముల సంయోగ వియోగములకు కాలమే కారణమనీ దాని మార్గము నెవరునూ గుర్తింపలేరని ఎంతవారికిని అది దుస్తరమని చెపుతూ పాండవుల జీవితాన్ని అక్కడ ఉదాహరణగా ఇవ్వటం జరిగింది. ధర్మజుడు రాజట! సురరాజసుతుడు ధన్వి యట! శాత్రవోద్వేజకమైన గాండీవము విల్లట! మరి సారధియో సర్వభద్ర సంయోజకుడైన చక్రియట! ఆ ఆజికి ఉగ్రగదాధరుడైన భీముడు తోడు వచ్చునట! అయిననూ ఆపదలు తప్పలేదు. దేవాంశ సంభూతులే కాదు దేవతలైనను కాలతంత్ర శక్తిని కాదని నిలువలేరు.

అర్జునుడంతవాడు,శివునితో ద్వంద్వయుద్ధము చేసి పాశుపతాస్త్రమును పొందిన మహావీరుడు. అంత భారత సంగ్రామమున విజయము సాధించిన మహాయోధుడు కృష్ణ నిర్యాణము పిదప ద్వారక మునిగిపోవునని అందలి జనులను తీసుకువస్తూ దోవలో బోయవాళ్ళ చేత భంగపడ్డాడు. ఒక్క అస్త్రం గుర్తుకు రాలేదు. అక్షయ తూణీరాలలో బాణాలు లేవు. అటువంటి మహా పురుషుడికే ఆ గతి పట్టింది. ఈ ప్రభావము ఎంత మహాద్భుతమైనదో చూడండి.

యుగాలు మారినప్పుడల్లా కాలములో వచ్చే మార్పులు చిత్రాతిచిత్రంగా ఉంటవి. కృతయుగం నుండి త్రేతాయుగం, త్రేతాయుగం నుండి ద్వాపరం, ద్వాపరం నించి కలియుగం మారే సంధికాలంలో కొత్త లక్షణాలు కొట్టవచ్చినట్లు కనిపిస్తవి. త్రేతా ద్వాపర సంధిలో జరిగిన పరశురామకృత సర్వక్షత్రియ సంహారాన్ని పురాణాలు ప్రత్యేకంగా వర్ణించినవి. అలానే భారతయుద్ధం ద్వాపరాంతాన జరిగిన భయంకర

మారణహోమం. సప్తర్షులు మఖా నక్షత్రంలో ఉండగా జరిగిన యీ భీషణ మృత్యుహేల మళ్ళీ రెండువేల యేడు వందల సంవత్సరాల తర్వాత అదే స్థితి అంతరిక్షంలోకి వచ్చే సరికి మళ్ళీ అంతటి సంహారకాండ జరిగింది. మహానందుడు ద్వితీయ భార్గవుని వలె సర్వక్షత్రాంతకుడయినాడని నాటి విశేషాలను భవిష్యాది పురాణాలు వర్ణించినవి. కాలచక్రం గిర్రున తిరిగేటప్పటికి యమదండం ప్రచండ పాటవాన్ని ప్రదర్శించింది.

పూర్వ పూర్వయుగాలలోని జీవులే ఉత్తరోత్తరయుగాలలోనూ వస్తుంటారు. కృతయుగంలో నిరంతర ధర్మబద్ధులైన వాళ్లే కలియుగం వచ్చేసరికి అధర్మపరులవుతుంటారు. అంటే మానవ జీవితాలను నడిపేది ఆ జీవుల కర్మమాత్రమే కాక కాలం కూడానన్నమాట. భారతంలోనే దీనికొక్క చక్కని ఉదాహరణ ఇవ్వబడింది. ధర్మరాజు రాజ్యం చేస్తుండగా ఇద్దరు రైతులు వివాదంతో వచ్చారు. ఒక రైతు పొలం మరొక రైతు కొన్నాడు. అందులో ఒక నిధి దొరికింది. కొన్నవాడు నేను పొలం కొన్నాను. కాని నిధి కొనలేదని అది పూర్వ కర్షకునిదే అన్నాడు. రెండవ వాడు పొలం అమ్మేశాను కనుక అందులో ఏది వచ్చినా కొన్నవాడిదేనంటాడు. ఈ వివాదం ఎలా తీర్చాలో ధర్మరాజుకు తోచలేదు. పక్కనే ఉన్న కృష్ణుడు తీర్పు ఒక నెలవాయిదావెయ్యమని సలహా ఇచ్చాడు. ధర్మరాజు సరేనన్నాడు. ఈ నెల రోజుల్లో కలియుగం వచ్చింది. వాయిదా రోజుకు రైతులిద్దరూ వచ్చారు. అయితే, ఈ సారి నిధి నాదంటే నాదని పోట్లాడుకుంటూ వచ్చారు. ధర్మరాజు వాళ్లిద్దరి బిడ్డలకు ఒక రైతు కొడుకుకు, రెండో రైతు కూతురికి పెళ్లి చేయించి, నిధి వాళ్లకు చెందేలా తీర్పు చెప్పాడు. అదే ఇప్పుడైతే తీర్పు కూడా అట్లా ఉండదు. నిధి నిక్షేపాలన్నీ ప్రభుత్వానివి. ఆ స్థల యజమానివి కావు. ఇవన్నీ కలికాల ప్రభావం చేత వచ్చిన ఆలోచనాధోరణులు. కాలానికి గుణముల మీద కూడా ప్రభావాన్ని చూపించే శక్తి ఉన్నదంటానికి దీన్ని ఉదహరించారు.

ఒక్క గుణాల మీద నేమిటి! సమస్త వస్తుజాలం మీద, జీవ నిర్జీవ పదార్థాల మీద కాలం తన ప్రభావాన్ని చూపిస్తుంది. కృష్ణుడు భారతయుద్ధంలో అర్జునుడితో **"కాలోస్మి లోక క్షయకృత్ ప్రవృద్ధః"** అన్నాడు. లోకనాశనానికి వచ్చిన కాలుణ్ణి సుమా అంటూ భీష్మ, ద్రోణాది సర్వ వీరులూ నాచేత ఇది వరకే చంపబడ్డారు. కేవలం నీవు నిమిత్తమాత్రుడవుగా బాణాలు వెయ్యి అంటాడు. నీ బాణాలలో శక్తిని ప్రవేశపెడుతాననో, నీ చేత చంపిస్తాననో అనక నే నిదివరకే వారిని చంపాను

అనటంలో ఒక గొప్ప కాలతంత్ర రహస్యం ఇమిడి ఉంది. ప్రతి మనిషికీ పంచభూతాత్మకమైన యీ శరీరం కాక, ఆకాశచరమైన మరొక శరీరం ఉంటుంది. మానవునికి రావలసినవి, కావలసినవి, ముందు ఆ ఆకాశ శరీరం మీద కర్మ ప్రభావం చేత కనిపిస్తవి. తరువాత ఈ పార్థివ శరీరానికి దిగుమతి అవుతవి. కృష్ణుడు కాలస్వరూపుడు కనుక, ఆ ఆకాశ శరీరాలను ఖండించారు. దాని వల్ల ఈ భౌతిక శరీరాలు అర్జునుడు బాణాలు వేసినా, వెయ్యకపోయినా, కూలిపోక తప్పదు. అయితే ఆ క్రియకు అర్జునుడు నిమిత్తమాత్రుడు కావలసిన యోగం ఉన్నది గనుక, అయినాడు. ఆకాశ శరీరాల మీద కనిపించే విశేషాలు ఈ భూ శరీరాల మీద కన్పించడానికి మధ్య కొంత వ్యవధి ఉంటుంది. కనుకనే కృష్ణుడు వాళ్లను తాను చంపానని చెప్పినా రణరంగం మీద వాళ్ళంతా ఎదురుగా నిలబడే ఉన్నారు.

**మయైవేతే నిహతాః పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్**

అన్న గీతా శ్లోకంలో ఇంత తాంత్రిక రహస్యం ఇమిడి ఉంది. ఆ ఆకాశ శరీరాలకు ఆ భూశరీరాలకు మధ్య ఒక అదృశ్య రజత సూత్రం ఇన్విజిబుల్ సిల్వర్‌కార్డ్ అనుబంధంగా ఉంటుంది. రెండు దేహాల మధ్య అనుభవాల రాకపోకలు ఒక విచిత్ర పద్ధతిలో సాగుతూ ఉంటవి.

సరే! అది అలా ఉంచుదాం. కాలం కలిరూపధారియై తన విలాసాలు చూపటంలో కూడా ఒక పద్ధతి ఉంది. కొంత అంతర దృష్టి - లేక దివ్యదృష్టి కలిగితే కాని ఇందులోని విశేషాలు బోధపడవు. ఒక మహాశక్తి లోకాన్ని ఆవరించేటప్పుడు అదృశ్య తేజోరూపంలో అంతరిక్షం నిండి సర్వలోకాన్ని ఆక్రమించటము జరుగుతుంది. సూక్ష్మమైన దార్శనిక శక్తి ఉంటే గాని దీన్ని ప్రత్యక్షంగా తెలుసుకోవడం సాధ్యం కాదు.

సుప్రసిద్ధుడైన ఈ శతాబ్దపు టిబెటన్ దార్శనికుడు లోబ్‌సాంగ్ రాంపా ఒక విచిత్ర విషయం వ్రాశాడు. శ్మశానాలలో అర్ధరాత్రివేళ జాగ్రత్తగా చూస్తే నీలాకారపు కాంతి వలయాలు పూడ్చి పెట్టబడిన మానవ దేహాల నుండిపైకి వెళ్లడం చూడవచ్చునంటాడాయన. అవి జీవులు దేహాల నుండి నిర్గమించడం కాదు. జీవి ఎప్పుడో దేహాన్ని వదిలివెళ్లినా ప్రతిజీవుడికి శరీరమును ఆశ్రయించుకొని ఉండే తేజోవలయం చచ్చిన వెంటనే వదలక, నెమ్మదిగా వదిలిపోతుంది. ప్రతి మానవుడికి వాడి చుట్టూ ఉండే స్వీయ తేజోవలయమే ఇతర మానవులతో, జీవులతో

వాడికి కలిగే ఆకర్షణ, వికర్షణలకు మూలం. ఈ మృత జీవులు ఆ జీవుల తేజోవలయాలు శ్మశాన సాధకులైన తాంత్రికులకు అమూల్యమైన ఉపకరణాలు, బహుసిద్ధి కారణాలు.

ఏవిధంగానైతే జీవుల తేజోవలయావరణలు బహు కార్యములకు నిమిత్తములవుతూ ఉంటవో, అదేవిధంగా యుగస్వరూపుడైన కాలుని తేజోవలయం ప్రకృతి ఆవరణను ఆక్రమించి, విక్రమించి, ప్రతి జీవుడి మీద తన ప్రభావం చూపిస్తుంది. అందుచేతనే అంతకుముందు పరమధర్మ భావుకుడైన వ్యక్తి కూడా అధర్మపరుడై దుష్కర్మ పరాయణుడు కావడం జరుగుతుంది.

తెలుగుదేశంలో ఒక చమత్కార కథ ప్రచారంలో ఉంది. మన సీమలో అడుగుపెట్టగానే అరణ్యవాసానికి సీతారాములతో వచ్చిన లక్ష్మణుడు మీకు నేనెందుక సేవ చేయాలి? మీ సామాను మీరే మోసుకోండి. నేను వెనక్కుపోతాను" అన్నాడట. కొంత దూరందాకా రాముడేమీ మాట్లాడలేదట. తర్వాత మళ్లీ సహజస్థితికి వచ్చిన పిదప అది రాక్షసులు తీవ్ర తపస్సు చేసిన చోటు - వాళ్ల భావ తరంగాలు ఇంకా అక్కడ ప్రసరిస్తుండడం వల్ల నీ మనస్సులో అలాంటి ఆలోచనలు పుట్టినవి అని రాముడు తమ్ముణ్ణి సమాధాన పరిచాడట.

ఒక ప్రదేశానికే అంతశక్తి ఉంటే, మరి ఈ యుగాదినాడు కాలాన్ని ఆక్రమించిన కాలప్రభావం ఎంతటిదో చెప్పగలమా? ముందు యుగాలలో లేని అన్న విక్రయం, విద్యా విక్రయం, దేహ విక్రయం, కలియుగంలో ఉంటుందని మునులు చెపితే ఆనాటి వాళ్లు నమ్మలేకపోయారు. ఈనాటి వాళ్లం మనం ఆనాటి పరిస్థితులను నమ్మలేము. అందుకే వ్యాసమహర్షి "కాల ప్రభావంబు నెవ్వరూ తప్పించుకోలేరు. ఒక వేళ తప్పించుకోవాలన్న తీవ్ర కాంక్ష వుంటే బదరికా వనానికి వెళ్లండి. నరనారాయణుల తపః ప్రభావం వలన కలి అక్కడ ప్రవేశించలేదు" అని చెప్పినా ఎంతమంది బదరి వెళతారు? తపస్సు చేస్తారు? యుగ ప్రభావాన్ని తప్పించుకోగలుగుతారు ? సర్వ ప్రపంచమూ కలియుగాది నాటి కాలతంత్రమునకు వశమైనది. వేలయేండ్ల కొక్కడు, కోట్ల మందిలో నొకడు యుగాది కాలతంత్రమును జయించి దేవలోకమునకు వెలుగు బాటలు తీస్తాడు. మిగిలిన వారంతా వట్టి యుగాది పండుగలు చేసుకునే సామాన్య పామర జనము.

# రాజకీయాలు - మంత్ర తంత్రాలు

రాజకీయ రంగంలో ప్రముఖ స్థానాలలో ఉన్న వ్యక్తులు, మంత్రులు, అధికారులు తమ స్థానాలు నిలబెట్టుకోవటం కోసం, తమ శత్రువులను నాశనం చేయటం కోసం మాంత్రికులను తాంత్రికులను ఆశ్రయించి వాళ్ళచేత పూజలు, జపములు, హోమములు, రకరకాల ప్రయోగాలు చేయించటం గురించి తరచుగా పత్రికలలో చదువుతూ ఉంటాము. ఆ మధ్య పదవీ భ్రష్టుడైన ఒక కేంద్రమంత్రి తనకు సంబంధించిన ఒక తాంత్రికుని చేత అర్థరాత్రి శ్మశానంలో చితిలో మద్యంతో హోమం చేయించినట్లు ఢిల్లీ నుంచి వచ్చిన ఒక వార్తా పత్రికలో ప్రచురించబడింది. అదే విధంగా దేశనాయకు లనేకులు పదవీ ప్రమాదం, అనారోగ్యం మొదలైన ఇబ్బందులు వచ్చినప్పుడు చాలావరకు వాటికి శత్రువులు చేయించిన ప్రయోగాలే కారణమని భావించటం దానికి తిరుగుగా మాంత్రికులు ప్రతిప్రయోగాలు చేయటం చిత్రవిచిత్రాలుగా వార్తలు వెలుగులోకి రావటం చూస్తూనే ఉన్నాము.

ఇవి చూచి విని అనేకులు ఈ రాజకీయవాదుల బలహీనతలని కొట్టి పారేస్తుంటారు. నాస్తికులు, మంత్రతంత్రములను విశ్వసించని వారు ఎలాగూ వీటిని ఖండించి పారేస్తారనుకోండి. కాని నమ్మకం కల వాళ్ళలో కూడా వీటి సహాయంతో రాజకీయంగా పదవులు సాధించటం పోగొట్టటం సాధ్యమవుతుందా అనే సందేహాలు కలుగుతూ వుంటవి. ఎందుకంటే భారతీయులైన మనం సహజంగా కర్మ సిద్ధాంతం మీద నమ్మకం కలవాళ్ళము. పూర్వజన్మలో చేసిన కర్మననుసరించి ఈ జన్మలో మంచిగాని, చెడుగాని జరుగుతుంది. ఒక వ్యక్తి ఉన్నత పదవి పొందాడంటే అది అతడు చేసుకొన్న సుకృతకర్మ యొక్క ఫలితం. ఆ కర్మానుభవం పూర్తి అయ్యేదాకా అతడా స్థానంలో ఉంటాడు. పుణ్యఫలం అయిపోగానే ఆ పదవినించి తప్పుకోవలసి వస్తుంది. పదవి పోవటానికి నిమిత్తం న్యాయమైనది కావచ్చు, అన్యాయమైనది కావచ్చు. గద్దెనించి దించటానికి ఉపయోగించబడిన పద్ధతులు కుయుక్తులు కుట్రలు కావచ్చు, కాకపోవచ్చు. ఏదైనా అతడి సుకృత కర్మ పూర్తి కానిదే ఎంతమంది ఎన్నిరకాలుగా ప్రయత్నించినా అతడిని పదవీ భ్రష్టుణ్ణి చెయ్యటం సాధ్యం కాదు.

కొన్నాళ్ళు పదవీభ్రష్టులై బాధపడి మళ్ళీ కొంతకాలానికి ఉన్నత పదవిని

పొందినవాళ్ళనూ చూస్తుంటాము. అంటే మధ్యలో వచ్చిన దుర్యోగం తొలగి, కొత్త యోగం ప్రారంభమైనదన్నమాట. కనుక సమస్త మానవ జీవితాలు కర్మవశమునై నడుస్తున్నవి.

**విను కర్మం బొనరించును**
**జననము, మరణంబు, నదియ సౌఖ్యము దుఃఖం**
**బును గావించున్, దన చే**
**సినదానంబడక పోవ శివునకు వశమే**

మరి ఇటువంటి కర్మసూత్రము ప్రవర్తమానమవుతూ ఉన్నపుడు రాజ్యాధికారములు, పదవులు, సమస్తము పూర్వజన్మ కర్మవశమున ప్రాప్తిస్తూ పోతూ ఉన్నపుడు అందులో మాంత్రికుల ప్రయోగ తంత్రముల స్థానమేమిటి అన్న ప్రశ్నపుడుతుంది. మంత్రశాస్త్రాన్ని, పురుషకారము యొక్క ప్రాధాన్యాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే కేవలం సిద్ధాంతం వరకు మంత్రశక్తుల చేత ఏదైనా చేయవచ్చును, ఏమైనా సాధింపవచ్చును అని అంగీకరించినా లోకపరిస్థితిని గమనించినపుడు సామాన్య మాంత్రికులు రాజ్యాధికారముల విషయములో జోక్యము చేసుకొని సాధించి పెట్టలేరని చెప్పక తప్పదు.

ఉదాహరణకు ఒక శాసనసభా నియోజకవర్గంలో ఒక లక్షమందికి పైగా ఓటర్లు ఉంటారు. ఈ లక్ష మందిలో ఓట్లు వేయటానికి ఎక్కువ మందిని వచ్చేలా చేయాలి. వచ్చిన వాళ్ళని అందరినీ కాకపోయినా అధికభాగం చూడాలి అంటే మాంత్రికుడు వేల మందిని ఆకర్షించి సమ్మోహితులను చేసి వశీకరించుకోగలిగిన సామర్థ్యం కలిగి ఉండాలి. అంతటి శక్తి పరమేశ్వరుని దివ్యానుగ్రహం గలిగిన ఏ సిద్ధపురుషునికో సాధ్యం కాని సామాన్య మాంత్రికునకు సాధ్యం కాదు. వశీకరణ ప్రయోగం చేసి ఒకరినో, ఇద్దరినో ఒకటో, రెండో పనులు సాధించుకోవటానికి అదీ నియమిత కాలం వరకు మామూలుగా మాంత్రికులు సాధించగలరు. షట్ప్రయోగములన్నీ సామాన్యంగా ఏక వ్యక్తి నిష్ఠములు. కనుక ఏ ధనవంతుని దగ్గరనో, రాజకీయనాయకుని దగ్గరనో డబ్బు తీసుకొని వారి ఆశ్రితులైనవారికొరకు దేవతా పూజలు, ప్రయోగములు చేసే మంత్ర తంత్రవేత్తలు ఏకసమయంలో శతసహస్రాధిక మహాజన వశీకరణం చేసి ఒక వ్యక్తికి ఓట్లు వేయించి గెలిపించటం జరిగే పనికాదు. మహాసిద్ధుడైన తాంత్రికుడు, యోగి అలా చేయగలడు గదా ఎందుకు సాధ్యం కాదు అని ప్రశ్నిస్తే సాధ్యమేకాని అంతటి యోగసిద్ధుడు ఈ

క్షుద్ర రాజకీయవాదుల కాశ్రితుడై వారిచ్చే ధన కనక వస్తు వాహనాలకు ప్రలోభపడి వారికి పనిచేసి పెట్టడు. కర్మదేవతలచేత నిర్దిష్టమైన వ్యక్తుల జయాపజయములలో సిద్ధపురుషులు జోక్యం చేసుకోరు. ఎవరు గెలిచినా ఓడినా వారికొకటే. కాబట్టి ఎన్నికలలో పురాకృత కర్మవశాన ఎవడు గెలవాలని నిర్దేశింపబడియున్నదో వాడే గెలుస్తాడు. కనుక సామాన్య మాంత్రికుల కార్యకలాపములు నిష్ఫలములు.

ఒకవ్యక్తి రాజ్యాధికారము, సిద్ధింపజేయగలిగిన మహాయజ్ఞమో తపస్సో చేస్తే అప్పుడు రాదా అన్న ప్రశ్న వేయవచ్చు. దాని ఫలితము ఈ జన్మలో సిద్ధికాదని సమాధానము చెప్పవలసిఉంటుంది.

సుకృతము కాని దుష్కృతము కాని ఈ జన్మలో ఫలించదు.

**శ్లో ॥ పూర్వదేహకృతం కర్మ, భుంజతే తదిహప్రజాః**
**ఇహైవయత్కృతం పుంసాం తత్పరత్ర ఫలిష్యతే.**

భారతములోని అనుశాసన పర్వంలో ఈ విషయము వివరముగా చెప్పబడినది. దీనికి కారణము కలదు. మానవులు స్వల్పాయుష్కులు. పూర్వజన్మలో చేసిన తపో దాన యజ్ఞరూపాది కర్మచేత ఒకవ్యక్తి ఒక అరవై సంవత్సరములు ఒకదేశమునకు రాజుగా ఉండవలసిన యోగము పొందాడనుకోండి. మరొకడు అదే పదవి కోసం తగిన కర్మచేస్తే ముందువాడియోగం ఏమవుతుంది ? కనుక మొదటవాని యోగం అయిపోయిన తరువాత యోగ్యతను సంపాదించిన రెండవవానికీ ఫలించాలి. కాని అన్ని సంవత్సరాలు గడిచేసరికి ఈ రెండవవాడు వృద్ధుడై, జరా రోగ పీడితుడై రాజ్యభోగములు అనుభవించగల శక్తిలేని స్థితిలో ఉంటాడు. చేసిన సుకృత కర్మ ఫలితంగా అనుభవించవలసిన సుఖభోగములను మహారాజ పదవి పొందినా అనుభవించలేడు. అందుచేత కర్మదేవతలు వచ్చే జన్మలో యౌవనంలో ఉండగానే వాడికా మహారాజపదవిని ప్రసాదించి భోగభాగస్వాములను అనుభవింపజేస్తారు. సుదీర్ఘాయుర్దాయము కలిగిన మానవులకే ఆ జన్మలోనే చేసిన తపోవ్రతములు ఫలితం కనిపించేది. పురాణాలలో శాస్త్రములలో ఈ యజ్ఞంచేస్తే, యీ వ్రతంచేస్తే మహారాజవుతాడు ప్రజలను పరిపాలిస్తాడు అని చెప్పినవన్నీ ఆ కాలం వారికి చెల్లినవి. కలియుగంలో అల్పాయుష్కులైన మనుష్యులు రాజ్యప్రదమైన ఏ కర్మచేసినా వచ్చే జన్మదాకా వేచియుండక తప్పదు. భారతంలో ఈ విషయం స్పష్టంగా చెబుతూ ఈ పరజన్మ

ఫలమ నేటువంటిది మనుష్యులలో మాత్రమేనని చిరంజీవులైన దేవదానవులు ఆ జన్మలోనే సర్వకర్మ ఫలితములను అనుభవిస్తారని చెప్పటం జరిగింది.

శ్లో ॥ దేవానామసురాణాంచ - అమరత్వాత్తపోబలాత్
ఏకేనైవ శరీరేణ - భుజ్యతే కర్మణాంఫలమ్

ఇంకా ఇటువంటి సందర్భంలో రాజ్యపదవులకై చేసే ప్రాకులాటలో దేవతాపూజలకు మంత్ర తంత్ర ప్రయోగాలకు మాంత్రిక తాంత్రికుల శక్తులకు ఫలితమే లేదా అనవచ్చు. వీటిని అంత సులభంగా త్రోసిపుచ్చటానికి వీలులేదు. ఇవి ఎంతవరకు పనిచేస్తవో వీటివల్ల సిద్ధించే ఫలితాలు ఎంతమేర ఉండగలవో వివరిస్తాను.

మహాజనంమీద వశీకరణశక్తి ప్రయోగించి ఎన్నికలలో గెలవటం సాధ్యం కాదని నిర్ణయించిన తర్వాత మరి వచ్చిన పదవికి భంగంకలిగే పరిస్థితి ఏర్పడినప్పుడు రక్షించటం సాధ్యమా అన్న విషయాన్ని గురించి ఆలోచిద్దాము.

ఒక యోగాన్ని గురించి భావించినప్పుడు అందులో రెండు స్థితులున్నవి. ఒకటి లేని యోగమును పుట్టించటం, రెండు యోగం బలహీనంగా ఉండి ఫలించని దశలో దానికిగల ఆటంకాలను తొలగించి ఫలించేలా చేయటము. ఒకవ్యక్తి దీర్ఘాయువుండి కూడా మధ్యలో గండాలవల్ల అకాల మృత్యువు పాలై మరణించవచ్చు. ఆ గండములకు తగిన శాంతిచేసి వానిని తొలగించుకుంటే పూర్ణాయుర్దాయం అనుభవించవచ్చు. కాల మృత్యువును తప్పించుకోవటం సాధ్యంగాదు గాని అకాలమృత్యువును పోగొట్టుకోవచ్చు. ఆలయాలలో తీర్థం ఇచ్చేటప్పుడు చదివే ఈ క్రింది శ్లోకం కూడ అదే భావాన్ని వ్యక్తంచేస్తుంది.

శ్లో ॥ అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం
సర్వపాప ప్రశమనం దేవీ పాదోదకం శుభం.

అలానే ఒక జంటకు పిల్లలు లేరనుకొందాము. దాన్ని తొలగించి సంతానం కలిగించాలంటే రెండు స్థితులున్నవి. సంతానయోగం ఉండి దుష్టగ్రహ ప్రభావంచేత ఫలించని దశ లేదా అసలు యోగమేలేని దశ. మొదటిస్థితిలో దుష్టగ్రహ వీక్షణాన్ని తొలగించి సంతానయోగాన్ని ఫలింపజేయటం సులభం. యోగమే లేనప్పుడు పుట్టించటం చాలా కష్టసాధ్యం.

రాజకీయాలలో కూడా పదవీయోగం ఉండి దుష్టగ్రహముల ప్రభావంచేత ఆటంకాలు ఏర్పడుతున్నప్పుడు మంత్ర తంత్ర సాధనలచేత వానిని నిర్మూలించవచ్చు. యోగం ఉన్నంతకాలం భంగంకాకుండా కాపాడవచ్చు.

ఈ విషయంలో ఒకప్రత్యేకమైన అంశంకూడా ఉంది. శాంతి, వశ్య, స్తంభన, ఉచ్చాటన, ఉన్మాదన, మారణాది ప్రయోగదక్షుడైన మాంత్రికుడు ఒక ఉన్నత పదవిలోని వ్యక్తిమీద దుష్టప్రయోగం చేశాడనుకోండి. అప్పుడేమవుతుందనేది జాగ్రత్తగా గమనించాల్సిన విషయం.

సమర్థుడైన మాంత్రికుడు చేసిన ప్రయోగం జరిగితీరుతుంది. మరి అప్పుడు రాజయోగం కలిగి ఉన్నత పదవిని అనుభవిస్తున్న వాని కర్మ ఏమవుతుంది? అనుభవిస్తున్నాడంటే అది ప్రారబ్ధకర్మ గదా ! ప్రారబ్ధ కర్మ విడిచి పెట్టిన బాణంవంటిదని అది ఆగదని శాస్త్రములు చెపుతున్నవి. మంత్రప్రయోగ శక్తిచేత ప్రారబ్ధకర్మ భంగమవుతుందా ? అయితే కర్మసిద్ధాంతం భంగమయినట్లు కాదా ?

ఈ ప్రశ్నలకు సమాధానాలు కర్మసిద్ధాంతాన్ని సూక్ష్మంగా అర్థం చేసుకొంటే తప్ప తెలియవు. ఒకనికి వ్యాధి వచ్చి పీడితుడవుతున్నాడనుకొందాం.

**శ్లో ॥ పూర్వజన్మకృతం పాపం వ్యాధి రూపేణ బాధతే**
**తచ్ఛాంతి రౌషధై ర్దానై ర్జప హోమ సురార్చనైః**

పూర్వజన్మలో చేసిన పాపము రోగరూపంగా పీడిస్తుంది. ఔషధములచేత, దానములచేత, జపహోమముల చేత, దేవతార్చనముల చేత అది శాంతిస్తుంది.

కొందరు జ్యోతిష్కుల నాశ్రయించి చెడుకాలం ముందే తెలుసుకొని బాధలు, రోగాలు రాకుండా శాంతికర్మ చేయించుకొంటారు. మరికొందరు రోగాలువచ్చి పీడితులవుతూ గ్రహశాంతులు చేయించుకొంటారు. అంటే ప్రారబ్ధకర్మ పనిచేయటం మొదలుపెట్టిన తర్వాత కూడ శాంతి కర్మలచేత ఉపశమనం కలగటం ఉంది.

కర్మవాదమున కెక్కువ ప్రాధాన్యమిచ్చే వాళ్లు చెప్పే పద్ధతి ఒకటున్నది. కర్మానుభవం పూర్తి అవుతున్న దశలోనే పీడితునికి శాంతికర్మలు చేయించుకొందామని బుద్ధిపుడుతుంది. కనుక ప్రారబ్ధం తప్పించుకోవటమనేది లేదు. అనుభవించి తీరవలసిందే. ఒకవేళ ఎవరికైనా మంత్రసాధనలచేత వ్యాధి కుదిరితే అదికూడా

కర్మలోనే వ్రాసిపెట్టి ఉందిగాబట్టి జరిగింది అని.

ఇది అతివాదము. శాస్త్రములలో ఈవిధమైన బాధను ఈ శాంతి కర్మచేత,ఈ జపముచేత, ఈ హోమముచేత,ఈ దానముచేత పోగొట్టుకోవచ్చునని మహర్షులు చెప్పారు. దానిని అంగీకరించి తీరాలి. కనుక ప్రారబ్ధాన్ని కూడా మంత్రాది కర్మలు ఎదిరించ గలవు లేదా శమింపజేయగలవు అని అంగీకరించాలి. మరి ప్రారబ్ధం అనుభవించక నశించదని పురాణములు, శాస్త్రములు చెపుతున్నవి గదా.

శ్లో ॥ ప్రారబ్ధజామధిక సంపదమా పదం వా
భుం జాన ఏవ పురుషః పరిశుద్ధిమేతి.

ఈరెంటికీ సమన్వయాన్ని పరాశరోప పురాణం సాధించి చూపింది.

శ్లో ॥ శరీరారంభకం కర్మ యోగినో యోగినోపిచ
వినా ఫలోపభోగేన నైవనశ్యత్య సంశయః

యోగులకుకాని అయోగులకు కాని అనుభవించకుండా ప్రారబ్ధకర్మ నశించదు. ప్రారబ్ధాన్ని ఎదిరించటానికి మంత్రతంత్ర దక్షులైన యోగులు చేసేకర్మ వల్ల ప్రారబ్ధం ఆగిపోకతప్పదు. ప్రారబ్ధంలో అప్పటికి అనుభవింపగా మిగిలిన భాగము స్వప్నములోను కాలాంతర దేహాంతరములోను అనుభవమునకు వచ్చునట. ప్రమాణం చూడండి.

శ్లో ॥ ఇహైవ ఫలదం కర్మ ప్రారబ్ధం ప్రతి బధ్యచ
ఫలందదాతి స్వప్నేన జాగ్రత్ కాలాంతరేపివా
నివృతప్రతి బద్ధంతు ప్రారబ్ధం కర్మ సత్తమ
నిరుద్ధాంశ సమో భోగో యధోద్భూతశ్చజాగ్రతి
తధా నిరుద్ధంతేనైవ సహకర్మ దదాతివై
ఏవం నిరుద్ధ భాగంతు స్వప్నే జాగ్రతివా ఫలం
ఆరబ్ధస్యానుగుణ్యేన భుంక్తే దేహీ న సంశయః
ప్రారబ్ధ శేషం విచ్ఛిన్నం పునర్దేహాంతరేణతు
భుంక్తే దేహీ ననోభుంక్తే తల్లంఘయతికఃపుమాన్

దీనినిబట్టి తేలేదేమిటంటే ప్రారబ్ధాన్నికూడా మంత్ర తంత్రములలో ఎదిరించవచ్చు అని అంటే ఉన్నత పదవిని తన సుకృత కర్మచేత అనుభవిస్తున్న

ఒక వ్యక్తిని మాంత్రికుడు పదభ్రష్టుణ్ణి చేయవచ్చు. అతడి మీద ఏ దుష్టయోగమో చేసి రోగగ్రస్తుణ్ణి చెయ్యటమో చంపటమో చేస్తే అప్పటి కనుభవించగా మిగిలిన ప్రారబ్ధం తాత్కాలికంగా నిరోధించబడి తర్వాత ఎప్పుడో అనుభవానికి వస్తుంది. ఐతే అత్యంత బలవత్తరమైన మహారాజయోగం కలిగిన వ్యక్తి మీద ఎవరైనా చేతబడి వంటి ప్రయోగం చేస్తే అతడి యోగం గట్టిగా ఉండటంచేత ఆ ప్రయోగం పూర్తి ఫలితాన్ని ఇవ్వకముందే విషయాన్ని తెలుసుకొని సమర్థుడైన మరొక తాంత్రికుణ్ణి ఆశ్రయించి తనకు వచ్చిన యిబ్బందిని పోగొట్టుకొంటాడు. కొద్దిపాటి రాజయోగమైతే ప్రయోగకారుని శక్తిముందు తట్టుకోలేక దెబ్బతిని ఆగిపోతుంది. ఇటువంటివాటిని ఊహించే ప్రాచీన కాలంలో మహారాజులు మహామంత్రులు ప్రయోగోపసంహారదక్షులైన మంత్రసిద్ధులను తమ ఆస్థానాలలో రక్షణక్రింద ఉంచుకునేవారు. వారు శత్రువుల ప్రయోగాలను శమింపజేస్తూ అవసరమైతే తిప్పికొడుతూ తమను పోషించే అధికారులను కాపాడుతూ ఉండేవారు. ఈనాటిమాంత్రికులకు కూడా అంతవరకు సాధ్యమే. పదవీభ్రష్టత, రక్షణ చేయగల సామర్థ్యం కలవాళ్లు అక్కడక్కడా లేకపోలేదు.

ఆపదలు వచ్చినప్పుడు రోగాలు, క్షుద్ర ప్రయోగాలు బాధిస్తున్నప్పుడు వాటినుండి మానవులను రక్షించటం మాంత్రికుల ధర్మం, దుష్టప్రయోగాలు చేసి బాధించటం క్షుద్రమార్గం. రాజకీయాలలో ఏవిధంగానైతే సజ్జనులు, దుర్జనులు ఉన్నారో మాంత్రికులలోనూ ఆ రెండు రకాలవారు ఉన్నారు. ధనాది ప్రలోభాలకు లొంగి ప్రయోగాలు చేసేవారు ఈ నాటికీ ఉన్నారు. అందుకే పెద్దపదవులలో ఉన్నవారు తమనుతాము కాపాడుకోవటానికి, తమ స్థానాలను నిలబెట్టుకోవటానికి మంత్రతంత్ర నిపుణుల నాశ్రయించక తప్పనిస్థితి ఏర్పడుతుంది. ఐతే ఆ మంత్రతంత్రములుప్రయోగించే సిద్ధసాధకుల శక్తి పరిమితులు అల్పమైనవని గుర్తించాలి. అపారమైన అనంతశక్తులతో అపూర్వమును పుట్టించి రాజయోగములను సృష్టించి మహోన్నత పదవులను ప్రసాదించగల ఋషితుల్యులు అధికారులకు, ధనవంతులకు తలయొగ్గి వారినుండి ప్రతిఫలమును స్వీకరించి పనిచేసి పెట్టరని గ్రహించటం అవసరం.

ఆమధ్య నేను ఉజ్జయిని వెళ్ళాను. మహాకాళుని దర్శనం చేసుకొన్నాను. దేశంలో ఎక్కడాలేని విశేషం ఒకటి కన్పించింది. శివలింగాన్ని శ్మశానభస్మంతో అభిషేకం చేసే ఆచారం ఉండేదిట! ఇప్పుడైతే చాలాకాలం కింద శ్మశానం నుండి

తెచ్చిన అగ్నిని రక్షించి - ఒక అగ్ని గృహం ఏర్పరచి దానివల్ల వస్తున్న భస్మంతో అభిషేకం చేస్తున్నారట. శిప్రానదీతీరంలో ఉన్న శివపుత్రుడు భైరవునికి కేవలం మద్యం మాత్రమే నివేదన చేయటం మరోవిశేషం. ఊరికి దూరంగా అరణ్యంలో ఉన్న మహాకాళి - కాళిదాస విక్రమార్కులు ఆరాధించిన మహాశక్తి అష్టాదశశక్తి పీఠాలలో ఒకటి. భౌతికమైన వైభవం అంతగా లేకపోవటం జనం కూడా పెద్దగా లేకపోవటం ఇంకో విశేషం.

ఇక్కడ చెప్పదగిన ప్రధానమైన విశేషం వేరొకటి ఉంది. ఒక వృద్ధ బ్రాహ్మణుడు అక్కడ పరిచయమై కొన్ని విచిత్రమైన అంశాలు చెప్పాడు. కొంతకాలం క్రింద పదవీభ్రష్టత చెందిన ఒక గొప్ప వ్యక్తి మళ్ళీ ఆ స్థానం అందుకోవటానికి కావలసిన తాంత్రిక పూజలు చేయవలసిందిగా కోరి దానికి కావలసిన ధనం ధారాళంగా ఏర్పాటు చేయటం జరిగింది. అయితే అందులో ముఖ్యుడైన తంత్రవేత్త ఒక కీలకమైన విషయం చెప్పాడట. మీకు "జాతకరీత్యా- కర్మరీత్యా మళ్ళీపదవీ యోగం లేదు. తాంత్రిక యజ్ఞాలద్వారా మీ కా యోగం పట్టించటానికి మేము ప్రయత్నిస్తాము. అది సిద్ధించవచ్చు. అయితే పదవీయోగ కాలంకాగానే మీకు అకాలమృత్యువు కలగవచ్చు. ఆ ప్రమాదానికి మీకు మానసికంగా సిద్ధపడితే ఈతంత్ర ప్రక్రియ మేము చేస్తాము అన్నాడు. ఆ మహావ్యక్తి "ముందు పదవి రావటం ప్రధానం. అకాల మృత్యువును జయించటానికి మళ్ళీ ప్రయత్నిద్దాం" అనటం తరువాతి రెండు సంఘటనలు. పదవీ - గండం జరగటం చారిత్రక సత్యాలు. ఈ సంఘటన వెనుక ఉన్నతాంత్రిక ప్రయోగాల సత్యాసత్యాలు పరిశీలించవలసినవి.

దాదాపు పదిహేను సంవత్సరాల క్రింద పత్రికలలో ఒక వార్తవచ్చింది. వింధ్య పర్వతప్రాంతంలోని ఒకఅరణ్య మధ్యంలో ఒక భయంకర యజ్ఞం జరిగిందని, ఒక పెద్దకాకి బొమ్మ ప్రధాన పూజలోపెట్టి జంతువుల రక్తమాంసాలతో హోమాలు చేశారని బలులు పూజలు నిర్వర్తించారని అప్పటి ప్రధానమంత్రిని పదవి నుండి పడవేయటానికి ప్రత్యర్థి రాజకీయనాయకులు ఈ ప్రయోగాలు చేయించారని దాని సారాంశం. మొత్తంమీద పదవులు సాధించటానికి పెద్దదేవతలనో చిన్నదేవతలనో ఆరాధించటం ప్రయోజనం పొందటం అనేది ఇవాళ కొత్తగా పుట్టినదేమీకాదు. భారతంలో ధర్మరాజు ఎందరు దేవతలనో ఆరాధించాడు స్తుతించాడు. యుధిష్ఠిరుని దుర్గాస్తుతి చాలా ప్రసిద్ధమైంది. అటువైపు దుర్యోధనుడూ

తక్కువ ప్రయత్నాలేమీ చెయ్యలేదు. ఎన్నో యజ్ఞాలు, పూజలు చేయించాడు. అయితే పాండవుల దైవబలం ముందు చాలలేదు. ఈసందర్భంగా కన్నడ భారతంలో ఒక చక్కని కథ ఉంది.

దుర్యోధనుని పురోహితులలో కనకస్వామి అనేవాడు గట్టిమాంత్రికుడు. ప్రభువు ప్రేరణతో వాడొక అభిచార హోమంచేశాడు. ఆ హోమకుండంలో నుండి ఒక మహాకృత్య పుట్టింది. పాండవులను చంపమని కనకస్వామి దానిని ఆజ్ఞాపించాడు. అది అరణ్యవాసం చేస్తున్న పాండవుల మీదికి వెళ్ళింది. అయితే దైవయోగం బలవత్తరమైనది. ఆ సమయానికి ఒక కొలను దగ్గర యక్షుని తిరస్కరించి భీమార్జున నకుల సహదేవులు మూర్ఛితులై వున్నారు. యక్షుని ప్రశ్నలకు ధర్మరాజు సమాధానం చెపుతున్నాడు. అప్పుడు చేరుకున్నది కృత్య. యక్షుని ఆవరణలో ఉన్న పాండవుల మీదకు దూకపోయింది. కాని ఆ ఆవరణలోకి ప్రవేశించలేకపోయింది. ధర్మదేవతయైన ఆ మహాయక్షుడు కృత్యతో చెప్పాడు. "నా రక్షణలో ఉన్నవారిని నీవు తాకలేవు. వాళ్ళను చంపటమా బ్రతకనియ్యటమా అనేది నా నిర్ణయం మీద ఉంటుంది. నీవు వెనక్కి వెళ్ళు" అని కృత్య చెప్పింది. "నేను ఉగ్రమంత్ర ప్రేరణచేత ఉదయించిన కృత్యా శక్తిని. చంపటమే నాలక్షణం. నాకు ఆహారం కావాలి. బలికావాలి. నన్నేం చేయమంటారు. ఎవరినో ఒకరిని చంపకుండా ఉండలేను" యక్షుడు వీళ్ళను చంపనివ్వను. నిన్ను ఎవడు పంపాడో వాళ్ళ దగ్గరకే వెళ్ళు" అనగా ఆ కృత్య వెనక్కు వెళ్ళి ప్రయోగకర్తయైన కనకస్వామిని సంహరించింది. ప్రబల దైవశక్తి సంపన్నులమీదికి పంపబడిన ఆభిచారిక కృత్యాప్రయోగాలు ప్రయోగకర్తనే సంహరించట మనేది మంత్రశాస్త్రవేత్త లెరిగిన విషయమే.

భాగవతంలో ఇటువంటిదే మరొక సంఘటన ఉంది. తన మిత్రుడైన ఒకరాజును శ్రీకృష్ణుడు చంపాడని కోపంతో కాశీరాజు తనపురోహితులను ఆజ్ఞాపించి కృత్యాహోమం చేయించాడు. చేసిన బ్రాహ్మణులు సామాన్యులుకారు. మహామంత్రవేత్తలు. రాజాజ్ఞచేత తప్పక అతి భీషణమైన అభిచారిక ప్రయోగంచేసి మహాకృత్యను పుట్టించి ద్వారక మీదకు కృష్ణుని సంహరించమని పంపారు. ఈ కృత్యపోయినంతమేర దహిస్తూ వెళ్ళి అగ్నిజ్వాలలో ద్వారకను ముట్టడించి నగరంచుట్టూ ఉన్న ఉద్యానవనాలు – గృహాలు కాల్చివేసింది. జనం హాహాకారాలతో పట్టణంలోకి పరిగెత్తారు. పట్టణంలో సమయానికి కృష్ణుడులేడు. నగర

రక్షణకు సుదర్శనచక్రం ఉంది. అది ఈ కృత్యా సంరంభం చూచింది. ఆగ్రహించి ఆ కృత్యను దహించివేసి అంతటితో ఆగక అది పుట్టిన చోటు కాశీ వెళ్ళి రాజుతో ప్రయోగ కర్తలతో అందరితో కాశీపట్టణాన్ని దహించింది. కాశీపతి విశ్వనాథుడు సుదర్శన విజృంభణాన్ని చూచి పురం విడిచిపెట్టి వెళ్ళిపోయినాడు. పన్నెండు సంవత్సరాలు కాశీ – మండుతూ – తగులబడుతూనే ఉంది.

కృత్యా ప్రయోగాల నుండి కాపాడుకోటానికి ప్రాచీనకాలంలో ప్రత్యంగిరా దేవతను ఎక్కువగా ఆశ్రయించేవారు. అధర్వణవేదంలో ఉన్న ప్రత్యంగిరా ఋక్కులు మంత్రోపాసకులలో బాగా ప్రసిద్ధిచెందినవి.

**శ్లో ॥ యాం కల్పయంతినోరయః క్రూరాంకృత్యాంవధూమివ**
**తాం బ్రాహ్మణాపనిర్ణుద్మః ప్రత్యక్కర్తారమృచ్ఛతు**

**శ్లో ॥ అభివర్తస్వ కర్తారం నిరస్తాస్మాభిరోజసా**
**ఆయురస్య నికృంతస్వ ప్రజాంచ పురుషాదిని**

**శ్లో॥ యథావిద్యుద్ధతో వృక్షః ఆమూలాదనుశుష్యతి**
**ఏవం సప్రతిశుష్యతు యోమే పాపం చికీర్షతి.**

ఎవరు మా మీద ప్రయోగంచేసి కృత్యను పంపించారో ఆ కృత్య తిరిగివెళ్ళి వారినే చెందునుగాక. మా తేజస్సుచే ప్రయోగశక్తి – కర్తను అతని సంతానమును చంపునుగాక ! పిడుగుపడిన చెట్టువలె నా కపకారము చేసినవాడు మాడిపోవునుగాక !

ఇలా ఉంటవి ఈ మంత్రములు. ఆత్మరక్షణకు వీనిని మించినవి లేవు. తంత్రగ్రంథాలలో ప్రత్యంగిరామంత్రాలు వేరే ఉన్నవి. సింహముఖిగా కొన్ని ధ్యానశ్లోకాలు, భద్రకాళిగా కొన్ని ధ్యానశ్లోకాలు కనిపిస్తున్నవి. ఏదైనా ఇది అగ్ని విద్య.

శత్రువును నాశనం చేయాలంటే ఇటువంటి విద్యలను మన దేశంలోనేకాక అనేకదేశాలలో ఉపయోగించేవారని ఆయా దేశాల వాఙ్మయాలలో కనిపిస్తున్నది. వైయక్తికంగానే కాక సామూహికంగా కూడా శత్రుసంహారానికి చైనా చక్రవర్తి ఆస్థానమాంత్రికుడు వజ్రవైరోచనీ విద్యను ప్రయోగించినట్లు ఆ శక్తి వెయ్యిమైళ్ళ దూరంలో తిరుగుబాటు సైన్యాన్ని పిడుగులు కురిపించి నాశనం చేసినట్లు అక్కడితంత్ర గ్రంథాలలోను గాథలలోను వ్రాయబడింది.

చండీ సప్తశతిలో రాజ్యభ్రష్టుడైన సురథుడు చండీనవాక్షరిని ఉపాసించి ప్రతిరోజు తన రక్తంతో తర్పణంచేసి చాముండాదేవి అనుగ్రహాన్ని పొంది మళ్ళీ రాజ్యాన్ని పొందటం మాత్రమేగాక వచ్చే మన్వంతరంలో మనువుకూడా అయ్యే వరాన్ని పొందాడు.

ప్రాచీన వాఙ్మయంలో ఇటువంటి ఉదాహరణలు ఎన్నో చూడవచ్చు. అయితే ఈనాడు అటువంటివి సాధ్యమా ? అనేది ప్రస్తుత ప్రశ్న. ఏనాడైనా సాధ్యమే. అయితే సురథునివంటి తీవ్రసాధకులు కరువైపోతున్నారు. జపహోమయజ్ఞములచేత యోగము పుట్టించగల మంత్రవేత్తలూ అంతగా కనపడటంలేదు. అంతర్దృష్టి కలిగిన వారు తక్కువ కావటంవల్ల ఏసాధనచేస్తే ఫలితం వస్తున్నదో తెలియనిస్థితి ఏర్పడింది.

మంత్రసాధన సిద్ధి విషయంలో అనుభవజ్ఞులైన శాస్త్రవేత్తలు కొన్ని విషయాలు చెపుతుంటారు. కాలప్రభావము కర్మప్రభావముచేత జరుగుతున్న ఈ ప్రపంచంలో రాజపదవులు, మంత్రిపదవులు మొదలైనవాటి విషయంలో జోక్యం చేసుకొని సాధించటం కష్టం. ప్రయత్నం మొదలుపెట్టేముందు ఆ వ్యక్తికి అనుకూల యోగం ఉన్నదా లేదా అనేది తెలుసుకొని తన ప్రయత్నం ఫలిస్తుందా లేదా అనేది దేవతనడిగి తెలుసుకొని కార్యసాధనకుపక్రమించాలి గాని ఆ రాజకీయనాయకుడో, ఈ వ్యాపారవేత్తో ధనం కుమ్మరిస్తున్నాడు గదా అని యజ్ఞం చేస్తే అది ఫలించదు. కర్మదేవతలు ఒకవ్యక్తిని రాజుగా నిర్దేశించి అతనికా యోగాన్ని ఇస్తున్నప్పుడు తద్భిన్నమైన వ్యక్తికి ఆ స్థానాన్ని ఇప్పించటానికి మాంత్రికుడు ప్రయత్నిస్తే అది సాధ్యమయ్యే పనికాదు. అంత యోగం పట్టించడానికి ఈ మాంత్రికుడు దత్తాత్రేయుడుకాదు. మార్కండేయేశ్వరుడుగాడు. అందువల్ల దేవతతో మాట్లాడగల అనుబంధం, అనుగ్రహం ఉన్నవాడు తెలిసి చేస్తే ఫలితం లభిస్తుంది. అయితే అటువంటివారు అంత తొందరగా లభించటంలేదు గదా. అందుకని ప్రయత్నం మానుకోవలసిందేనా అంటే మానుకోవలసిన పనిలేదు. శ్రద్ధాళువులైన మంత్రవేత్తల చేత, యాజ్ఞికులచేత, పురోహితులచేత న్యాయమైన కామ్యసిద్ధికి ప్రయత్నించవచ్చు. కర్మ దానితోపాటు కాలం కూడా కలిసిరావాలి.

పెద్దలు ఇంకొకటి కూడా చెపుతారు. అసలు యోగం ఉన్నవాడికే సరియైన మాంత్రికులు, యోగులు, యాజ్ఞికులు లభించటం. వారు శ్రద్ధగా యజ్ఞం చేయటం జరుగుతోంది. ఈ దైవికమైన పురుషకారం చేయటం కూడా కర్మదేవతల

సంకల్పంవల్లనే జరుగుతుంది. ఈ కర్మసిద్ధాంతపు లోతులకు పోయినకొద్దీ పురుషకారము యొక్క ప్రాధాన్యము ఎంత అనేది చాల గహనమైన విషయంగా కనిపిస్తుంది. అందువల్ల మానవుడు అవిశ్వాసి కాకుండా తీవ్రమైన పురుషకారం చేయాలి. అటువంటి వాని సంకల్పం న్యాయమైతే తప్పక నెరవేరుతుంది.

ఇక ప్రపంచగమనానికి ఇబ్బంది కలిగించనివి, వేల లక్షల మందికి సంబంధించిన అంశాలలో జోక్యం చేసుకోనివి, అయిన మంత్రశక్తులు తొందరగా సిద్ధిస్తవి అని ప్రాజ్ఞుల అనుభవం. ఉదాహరణకు ఒక సాధకుడు ఏదో ఒక రోగనివారణ మంత్రాన్ని సాధించాడనుకోండి. తన దగ్గరకు వచ్చిన కొందరికి అతడు ఆరోగ్యాన్ని ఇవ్వగలుగుతాడు. దీనివల్ల లోకగమనంలో పెద్ద కల్లోలము – ఘర్షణ ఏమీ ఉండదు. అలానే మరొకరు భూత భవిష్యద్వర్తమానాలను తెలిపే విద్య పొందాడనుకోండి. దానివల్ల కూడా సమాజానికి పెద్ద సంచలనమేమీకాదు. ఎప్పుడూ నమ్మేవారు – నమ్మనివారు ఉంటారు. కొందరు తమ జీవితవిశేషాలు ఈ వ్యక్తి దగ్గరికి వచ్చి తెలుసుకుంటారు. దానివల్ల కూడా ఏవో చిన్నచిన్న మలుపులు, మార్పులు తప్ప జనజీవన ప్రవాహగమనం ఆగదు. రాజులు మారరు – మంత్రులు మారరు. దేశగతులుమారవు. వాటిని మార్చే ప్రయత్నాలే అంతసులభంగా సిద్ధించవు. కాలపురుషుని సంకల్పమైన అద్వైత స్థితికి వచ్చిన యోగికి ఈ రాజులను, అధికారులను మార్చే ఇచ్ఛ ఉండదు. దానిక్రింది దశలో ఉండి కొంత సాధించిన చిన్నయోగులు, చిన్న మాంత్రికులు ఒకనికి పదవిని, మరొకరికి ఐశ్వర్యాన్ని, ఇంకొకరికి సామ్రాజ్యాన్ని, వేరొకరికి శత్రునాశనాన్ని చేసి పెట్టటానికి ప్రయత్నిస్తుంటారు. ఆ ప్రయత్నాలు కొన్ని ఫలిస్తవి. కొన్ని ఫలించవు. ప్రతి ఫలితం వెనుక దైవికమైన కొన్ని కారణాలుంటవి. యోగము, సిద్ధి – ఇవన్నీ తదాశ్రితములు.

# సంసారము – మంత్ర ప్రయోజనము

సన్యాసి, యోగి, సిద్ధుడు, తీవ్రసాధకులు, మహామాంత్రికులు, వీళ్ళ విషయం అటుంచి నిత్యజీవితంలో సామాన్య సంసారులకు కలిగే ఇబ్బందులు, కష్టాలు, వాటిని తొలగించుకోవటానికి చేసే ప్రయత్నాలు, ఇవి సగటుమనిషి అవసరాలు. "నాకు ధర్మము నందు ఆస్థలేదు. కామమునందు, అర్థమునందు

ఆసక్తిలేదు. పూర్వకర్మానుగుణంగా ఏదివస్తే అది అనుభవిస్తాను. ఇది ఇమ్మనిగాని ఇది వద్దనిగాని అడగను. నేను అడిగేదల్లా నీయందు అహైతుకమైన భక్తిని మాత్రమే" అని అడిగే కులశేఖరునివలె అందరూ ఉండరు. కష్టాలు వస్తే పోగొట్టుకోవాలని, నష్టాలు వస్తే పూడ్చుకోవాలని కోరిన కోరికలు తీరాలని వాంఛిస్తూ దానికి చేతనైన ప్రయత్నాలు చేయటం లోకరీతి.

మానవీయమైన పురుషకారం ఎలానూ చేస్తూనే ఉంటారు. దానివల్ల పనికానప్పుడు దైవాన్ని ఆశ్రయించటం జరుగుతుంది. నిర్గుణ స్థితిలో అద్వైత పరబ్రహ్మమునకు ఇవేమీ పట్టవుగాని సగుణ భూమికలోని దేవతలు ఆశ్రయిస్తే పనిచేసిపెడతారు. అడిగే తీవ్రతను బట్టి ఎంత మహత్తర కార్యమైనా అవుతుంది. హిరణ్యకశిపు రావణాదుల గాథలు పరిశీలిస్తే అడిగే దానిలోని న్యాయాన్యాయాలతో పనిలేదు. అడగగల శక్తి, పట్టుదల, దీక్ష, తీవ్రతపస్సు, ఇవి మాత్రమే ప్రధానమని కనిపిస్తుంది. అంత పట్టుదల సామాన్యులకు సాధ్యంకాదు గనుక కొంత సాధనతో కొన్నిపనులు సాధించుకోవచ్చు.

అల్పాయుష్కులు, పరిమితశక్తులు, నాతి తీవ్రసాధకులు అయిన నేటి మానవులు పూర్వయుగాలలోని ఋషులవంటి వారు కారు. అయినా ఉన్నంతలో పూనికవల్ల కార్యసిద్ధి సాధించే అవకాశంఉంది. ఉదాహరణకు ఒకరోగి తీవ్రబాధా పీడితుడై ఉన్నాడనుకోండి. దానికి కారణమేమిటో పరిశీలించాలి. ఆహార విహారాది వికారాలవల్ల వచ్చే తాత్కాలిక బాధలు ఔషధ సేవవల్ల శాంతిస్తవి. ఒకరోజు అటూఇటూగా - కానీ దీర్ఘవ్యాధులు అలాకాదు. వానిలో కొన్ని కర్మవ్యాధులు. ఈ వ్యాధిగ్రస్తుని దివ్యదృష్టిలో చూస్తే వాని సూక్ష్మశరీరం చుట్టూ నల్లనిమచ్చలు కమ్మినట్లుంటుంది. శరీరంలోని ఏ భాగం రోగగ్రస్తమో దాని మీద స్పష్టంగా కనిపిస్తుంది. ఆదిత్యాది నవగ్రహ జప పూజాహోమ దానాదులచేత వాటిని పోగొట్టవచ్చు. లేదా ఇష్టదేవతోపాసనచేత వాటిని పోగొట్టవచ్చు. మరొకరకం రోగులు భూతగ్రస్తులై ఉంటారు. పూర్వజన్మ కర్మ ప్రేరణచేత కొన్ని, ప్రయోగప్రేరణ చేతకొన్ని భూతప్రేత పిశాచములు మానవులను ఆక్రమించుకొని అపకారం చేస్తుంటవి. కొన్ని ప్రేమ చేత అపకారం చేస్తుంటవి. ప్రేమతోగాని, ద్వేషంతోగాని, అపకారమూలేక కేవలం ఆకలిదప్పులు కామక్రోధాలు తీరటానికి ఏదో ఒక శరీరంలో ప్రవేశం దొరికిన వారు దీనినుండి బయటకుపోవటానికి ఇష్టపడరు. బతిమిలాడో, భయపెట్టో, బలవంతంగానో వాటిని బయటకు పంపితేగాని మనిషికి

ఆరోగ్యం కలగదు. భూతోచ్చాటన మార్గాలు ఎన్నో ఉన్నవి. సామదాన దండోపాయాలు ఆయామాంత్రికుని మార్గాన్నిబట్టి అప్పుడు తలపెట్టిన ప్రక్రియననుసరించి ఉంటవి. సాత్విక దేవతలనుపాసించేవారు శాంత మార్గంలో, రాజసతామస దేవతల నుపాసించేవారు తీవ్రపద్ధతులలో భూతనివారణ చేస్తారు. సామాన్యంగా దక్షిణాచారులు ఆంజనేయం, నారసింహం, శరభసాళ్వం, వీరభద్రం, దుర్గా, చండీ దేవతల మంత్రాలను చేసేవారుగా ఉంటారు. వామాచారులు కాళి, చండి భైరవ, బేతాళ మంత్రోపాసకులుగా కనిపిస్తుంటారు. కొన్నివిద్యలు ఉభయమార్గాలలోను ఉంటవి. కాళి, చండి వంటివి. ఒక తంత్ర గ్రంథంలో శ్మశానాంజనేయము, శ్మశాన నారసింహము కూడ ఇవ్వబడినది. శాక్తేయ విద్యలలో పగలు దక్షిణాచారము. రాత్రి వామాచారము చేసే సంప్రదాయాలు కొన్ని ఉన్నవి. మొత్తంమీద ఏ మార్గము ననుసరించియైనా శరీరాన్ని ఆవేశించి ఉన్న భూతాన్ని వదిలించుకోవచ్చు. కొంతమంది భూతావేశమేమిటి ? అక్కడక్కడ దయ్యం పట్టినవారు నేను ఫలానా ఈ వ్యక్తిని పట్టుకొన్నాను అని చెప్పటం. వాళ్ళేదో గొంతెమ్మ కోరికలు కోరటం తీర్చగలిగితే తీర్చటం జరుగుతుంది. అది లేనప్పుడు భూతావేశం ఉన్నదని నమ్మకమేమిటి ? అనే ప్రశ్న వేస్తుంటారు. మనిషి వ్యక్తిత్వాన్ని, అణచివేసి పూర్తిగా ఆక్రమించుకొన్నప్పుడు తెలియటం ఒకదశ. దీర్ఘమైన ఆధివ్యాధులచేత పీడించబడుతున్నప్పుడు తెలుసుకోటం మరొకదశ. మంత్ర సిద్ధివల్ల దార్శనికులైనవారు మాత్రమే దీనిని చెప్పగలుగుతారు. లేక మంత్రశాస్త్ర సంప్రదాయం తెలిసి కార్యకారణ సంబంధంచేత, అనుభవంచేత గ్రహించి నివారణోపాయాలను అనుసరించటం వేరొకపద్ధతి. ఈ విద్యలయందు, ఈ విద్యలను సాధించిన వారియందు నమ్మకం ఉన్నప్పుడే ఈ రంగంలో ముందడుగు వేయాలి. దీర్ఘరోగాలేకాదు సంసార జీవితంలో ఎన్నో సమస్యలు వస్తుంటవి. ఆడపిల్లలకు తొందరగా పెళ్ళిళ్ళుకావు. కొందరు మగపిల్లలకు కూడా. అటువంటి వాటిల్లో విశ్వావసువు మొదలైన గంధర్వులున్నారు. వాళ్ళు ఈ పనులు అనుగ్రహిస్తారు. అదేగాక ఉపాస్యదేవతా మంత్రాలను ఈ సంకల్పంపెట్టి జపంచేయటం లాజలతో హోమంచేయటంవంటి పద్ధతులవల్ల కార్యానుకూలత పొందవచ్చు. రుక్మిణీ కల్యాణం పారాయణం చేయటంవంటి లోకాచారాలు ఉండనేఉన్నవనుకోండి.

పెండ్లిండ్లయిన తరువాత కొందరు సంతానం లేక బాధపడుతుంటారు. వైద్య సంబంధమైన పరీక్షలన్నీ చేయించి ఏలోపమూలేదని తెలుసుకున్న తర్వాత

సంవత్సరాలు గడుస్తున్నా పిల్లలు పుట్టకపోవటంతో మానసికంగా బాధ, నైరాశ్యము, భవిష్యత్తును గూర్చిన బెంగ, తోటివారి దగ్గర, పెద్దల దగ్గర అవమానము, చులకనకావటం ఇటువంటి వెన్నో తటస్థిస్తుంటవి. దీనికి కారణాలెన్నో ఉంటవి. కొన్ని ప్రాంతాలలో నాగప్రతిష్ఠ చేయండి పిల్లలు పుడతారని సలహాలు ఇస్తారు. దీని వెనుకగల మూలం ఇది – ఒకవ్యక్తి తెలిసిగాని, తెలియకగాని ఒక జాతిసర్పానికి అపకారం చేశాడనుకోండి. సామాన్యంగా పశుపక్ష్యాదులకు మనసు లేకపోవడంవల్ల జ్ఞాపకశక్తి ఉండదు. కాని కొన్ని జంతువులలో కొంత గుర్తుపెట్టుకొనేశక్తి ఉంటుంది. పెంపుడు జంతువులైన పిల్లి, కుక్క, ఆవు, గుర్రం వంటివి యజమానులకు సన్నిహితంగా ఉండడం చెప్పినది చేయడం, వాళ్ళను గుర్తుపెట్టుకొని సేవించటం చూస్తూనే ఉంటాము. పాములో కూడా అటువంటి లక్షణాలు కొన్ని ఉన్నవని పెద్దలంటారు. ఆధునిక శాస్త్రవేత్తలు పాములకు పగబట్టేశక్తిగాని, పెద్దగా వినికిడి శక్తిగాని లేదంటారు. కాని అనాదికాలం నుండి వస్తున్న విశ్వాసాలు త్రోసి పారవేయటానికి వీల్లేదు. అపకారం గ్రహించిన పాము చేసిన వ్యక్తిని గుర్తు పెట్టుకొని అప్పటినుండి ఆహారం తీసుకోకుండా ఆ క్రోధాన్ని నిలువ చేసుకొంటుంది. అది ఆ వ్యక్తిని కాటేసి చంపితే కాని కసితీరదు. కోపంపోదు. అయితే అన్నిసార్లు దానికి అది సాధ్యంకాక పోవచ్చు. అతడే దానిని చంపించవచ్చు. లేదా ఆ సర్పం ఇతర కారణాల వల్ల చావచ్చు లేదా ఈ మనిషి కూడా ఇతర హేతువుల వల్ల మరణించవచ్చు. ఇందులో ఏది జరిగినా పాము యొక్క పగచల్లారదు. పగపోక మరణించిన సర్పం సర్పగ్రహమవుతుంది. ఇందులో ఏది జరిగినా పాముయొక్క పగచల్లారదు. తాను పగ పట్టిన మనిషి జీవించిఉన్నా వేరొక జన్మకు వెళ్ళినా అది గుర్తుపెట్టుకొని ఆ మనిషికి అపకారం చేయటానికి ప్రయత్నిస్తుంది. సర్పవిషంవల్ల ఏ దుష్ఫలితాలు వస్తవో సర్పగ్రహగ్రస్తుడైన వ్యక్తికి ఆ లక్షణాలు వస్తవి. విషవ్యాధులు, చర్మరోగాలు, విషజ్వరం మొదలైనవి. ముఖ్యంగా సంతానం కలగకపోవటం కలిగినా అల్పాయువులై మరణించటం ఇవన్నీ ఆ విద్వేష గ్రహ ఫలితాలు. నాగప్రతిష్ఠ, నాగోపాసన లేదా ఇతర దేవతల అనుగ్రహంద్వారా శాంతి మొదలైన కలాపం ద్వారా నాగక్రోధాన్ని తొలగించుకోగలిగితే అప్పుడు సంతానం కలుగుతుంది. అయితే సంతానం నిలవని అన్ని సందర్భాలలోను ఇదే కారణమవటానికి వీలులేదు. ఇతర కారణాలను మాంత్రికుడు, యోగి తన దర్శనం ద్వారా తెలుసుకొని తగిన శాంతి క్రియలుచేసి పరిష్కారం సాధించాలి. ఒక్కోసారి వ్యతిరేక సర్పాది గ్రహాలు

లేకపోవచ్చు. కాని పిల్లలు పుట్టకపోవచ్చు. అప్పుడు లేని యోగం పుట్టించాలి. అది సంతానగోపాలాది మంత్రాల ద్వారా సాధ్యం.

ఉద్యోగాల కోసం, ఉద్యోగాలు వచ్చిన తర్వాత అందులో అభివృద్ధికోసం, వ్యాపార వృద్ధి కోసం లౌకికమైన అనేకానేక కార్యసిద్ధి కోసం మంత్రతంత్రాలను ఆశ్రయించి పనులు సాధించుకోవచ్చు. అర్థకామసాధనలో స్వార్థంకోసం అధర్మం చేస్తే దాని ఫలితాన్ని అనుభవించకతప్పదు. ఉదాహరణకు - వశీకరణద్వారా ఒక స్త్రీని అనుభవించాడనుకోండి. ఇవాళ సుఖం పొందవచ్చు. కాని ఆ పాపఫలితం అనుభవించకతప్పదు. వామాచార మార్గంలో కోడినో, గొర్రెనో, జంతువులలో ఏదో బలియిచ్చి కొన్ని దేవతలను సంతోషపెట్టి కొన్ని పనులు సాధించుకోవచ్చు. కాని ప్రాణిహింస చేసిన పాపం పొందకతప్పదు.

స్త్రీల విషయంలో కామ విషయంలో మాంత్రికులు, దార్శనికులు కొన్ని వింతలను చూస్తుంటారు. ఇహలోకంలో కామం తీరక మరణించినవారు కామ పిశాచములై తమ ఇష్టమైన కాంతలను బాధిస్తుంటారు. సూక్ష్మశరీరంతో ఆ భూమికలో బలవంతంగా అనుభవిస్తుంటారు. ఒక బాలిక ఉంది. అమ్మాయి యోగినికాదు. విరాగిణి కాదు. వేదాంతవాసనలేదు. కాని పెండ్లివద్దంటుంది. కారణం చెప్పలేదు. వద్దనిపిస్తుంది. ఆమెను మోహించి మరణించిన ఒక వ్యక్తి మరణించి ఆమెను పట్టాడు. సూక్ష్మభూమికలో రోజూ ఆమెను అనుభవిస్తుంటాడు. ఆమె మనస్సును వివాహ విముఖంగా ఆదేశిస్తుంటాడు. పాపం ఆ బాలికకు తెలియదు. తల్లిదండ్రుల అభ్యర్థనమీద ఆ కామపిశాచి బాలికనుండి తొలగించిన తర్వాత హాయిగా పెండ్లి చేసుకొంది. సుఖంగా పిల్లలను కన్నది. సంసారం చేసుకుంటున్నది. ఇంతకు ఆ మోహించిన వ్యక్తిని గురించి చెప్పకూడదు. అయినా శాస్త్రం కోసం చెపుతున్నాను. అతడు స్థూలశరీరంతో ఉన్నప్పుడు ఒక వృద్ధసన్యాసి. చాలా సజ్జనుడు, భక్తుడు ఎటువంటి దుస్సాంగత్యముకాని దుశ్శీలముకానిలేదు. అయితే కామాన్ని బలవంతంగా అణచుకొన్నాడు. ఈ బాలిక, వారి కుటుంబ పెద్దలు అంతా వారి శిష్యులు, భక్తులు. స్థూలశరీరం పతనమైన తర్వాత సూక్ష్మశరీరానికి జరారుజలు లేవు. కామక్రోధ విజృంభణం చాలా తీవ్రంగా ఉంటుంది. అతడు సుకుమారియైన ఆ సుందర బాలికను సూక్ష్మశరీరంతో అనుభవించాడు. కొన్నాళ్ళకు ఓ యోగివల్ల పక్కకు తప్పించబడినాడు.

మరొక విచిత్రమైన కన్యకథ. విశ్వవిద్యాలయంలో పెద్ద చదువులు

చదివింది. ప్రభుత్వంలో ఉన్నత పదవిలో ఉంది. ఆమె వివాహ గాథ ఒక వింత. ఆమెకు పెండ్లియిష్టం లేదు. తల్లిదండ్రులు ఒత్తిడి చేసి వివాహం చేశారు. భర్తని సంసారం చేయనీయలేదు. అంతాబాగానే ఉంటుంది. ఒక్క శృంగారం దగ్గిర దూరంగా ఉంటుంది. భర్తను లాలిస్తుంది. శిశువువలె లాలించబడటానికి ఇష్టపడుతుంది. కామక్రీడ అంటేపడదు. మనస్సు శిశుత్వ స్థితిలో వుంది కామానికి సంబంధించినంతవరకు ఇది జన్మాంతరాగతమైన ఒక సంస్కారదోషం. ఆమె దీనికి తగిన దేవతోపాసకుని చేత కొన్నాళ్ళు మంత్రచికిత్స చేయించుకోవలసింది. జరగలేదు. ఉన్నతోద్యోగినియైనా వృద్ధ కన్యగా మిగిలిపోయింది.

వేరొక అనూహ్యగాధ. ఒక గుణశీల సంపన్నమైన కుటుంబకన్య. అద్భుత సౌందర్యవతి. భర్త చిన్నవయస్సులో మరణించాడు. కాని భార్యమీద మోజు తీరలేదు. సూక్ష్మభూమికలో ఆమెను ఆవహించాడు. వయస్సుకు సహజమైన కామం. అవకాశంలేక అణచివేయటంవల్ల అది తీవ్రమైనది. ఆమె వేదాంత సాధకురాలు కాదు. యోగినికాదు. అందగత్తె. భర్తలేదు. కనుక చాలామంది ఆశించేవారు. ఆమె వాళ్ళను తిరస్కరించేదికాదు. చనువుగా ఇష్టంగా మాట్లాడేది. వాళ్ళు తమ కోరికను వెల్లడిస్తే గుణశీలాలను గురించి ఉపన్యాసాలు చెప్పేది. అవతలివాళ్ళు మరీ ఒత్తిడిచేస్తే వీలైతే ఎప్పుడన్నా చూద్దాములే అనేది. ఏకాంతమైన అవకాశం అవతల ఏర్పాటుచేసి ఈమెకు నచ్చజెప్పి తీసుకువెళితే అక్కడ ఉపరతి వరకు ఊరుకొనేది. అసలు పనికి ఉపక్రమించగానే భర్త ప్రేతమూర్తి వచ్చి ఆవేశించేవాడు. ఆమెకు ఏదో ఆవేశము వచ్చినట్లై ఆపురుషుని విదిలించి వేసి తన శీలసంపదను గూర్చి ఉద్రేకంతో చెప్పి లేచి వెళ్ళిపోయేది. అవతలవాడు ఇదేమిటిరా ఈవిడ ఒప్పుకొని వచ్చింది. తీరా ప్రధాన ఘట్టం దగ్గర ఇలా ప్రవర్తించింది అని బిత్తరపోయేవాడు. కొంతకాలానికి ఒక గట్టి మాంత్రికుడు ఆమెకు ఆవహించిన దుష్టశక్తులను వెళ్ళగొట్టటానికి ప్రయత్నించటం జరిగింది. కొంత ఉపకారం జరిగింది. కాని ఆమె కుటుంబ పరిస్థితులలో వచ్చిన పరిణామాలవల్ల పూర్తి నివారణ జరగలేదు.

లోకంలో మనస్తత్వ శాస్త్రవేత్తల విశ్లేషణలో భూతప్రేతాలకు స్థానంలేదు. కనుక అణచివేయబడిన కామప్రవృత్తి యొక్క వికారములు ప్రకృతులు అని వీటిని గురించి అంటారు. అందువల్ల కన్యగాని, యువకుడుగాని ఏ వయస్సు వాడుగాని కామాన్ని బలవంతంగా అణచుకొన్నందువల్ల అది ఇతర తీవ్రగుణాలకు

దారితీస్తుందనేది వారి అభిప్రాయం. జరిగిన సంఘటనకు ఒక శాస్త్రం ఒక వివరణ యిస్తే మరొక సంఘటన మరొక వివరణ యిస్తుంది. ఆధునిక శాస్త్రవేత్తల వివరణలు ఒకరకం. మాంత్రికుల దార్శనికుల విశ్లేషణలు మరొకరకం.

మరొక అంశం. అర్థకామాలకు సంబంధించిన అంశాలుగాక మానవ జీవితంలో మరికొన్ని అంశాలు ఉన్నవి. ఒకవ్యక్తి వయస్సుతో, సంపదతో, పదవితో సంబంధం లేకుండా ప్రమాదాలు జరుగుతూ ఉండటం మనం చూస్తుంటాము. బీదవాడు త్రోవన నడిచి వెళుతుంటే, మరొకడు సైకిలు మీద వెళుతుంటే ఏ కారో లారీనో వచ్చి గుద్దుతుంది. సంపన్నుడు కారు లోనే వెళుతుంటే ఏ ట్రాక్టరో వచ్చి కొట్టేస్తుంది. ఇంకా పెద్దవాడు విమానప్రమాదంలో ఇరుక్కొంటాడు. ఇటువంటివి రెండురకాలు. కాలమృత్యువు, అకాలమృత్యువు. కొన్ని చిన్నగండాలు, ఆ మధ్య ఒక వ్యాయామ సాధకుని నాడీజాతకంలో "లోహపిండం మీదబడటం వల్ల ఇతడు భగ్నశల్యుడవుతాడు. అయితే దుర్గోపాసనచేత తప్పించుకోవచ్చు అని ఉంది" అతడు దుర్గోపాసన చేశాడు. నిర్దిష్ట సమయంలో ఒకరోజు బరువులెత్తుతుంటే ఒక బరువు పైన పడింది. కాని ఎక్కువ దెబ్బతగల్లేదు. నామమాత్రంగా ఒక పక్క పడి జారిపోయింది. దేవతారాధన అతనిని ఆ గండం నుండి కాపాడింది.

ఎన్ని నాడీ జాతకాలు చదివించుకొన్నా, ఎందరు జ్యోతిష్కులచేత చెప్పించుకొన్నా గండాలు, అకాలమృత్యువులు, కాలమృత్యువులు సర్వసమగ్రంగా తెలుసుకోవటం కష్టం.కొంత సూచనప్రాయంగా మాత్రమే తెలుసుకోగలుగుతారు. తీవ్రమైన దైవారాధనచేత మృత్యుంజయాది జపములచేత కొన్నింటి బారినుండి తప్పించుకోవచ్చు. కాలమృత్యువును మాత్రం ఎవడూ తప్పించుకోలేడు. అయితే వాటికి కూడా అక్కడక్కడ యుగానికొకడు కాలమృత్యుజేత కూడా ఉంటాడు. పూర్వయుగాలలో మార్కండేయుని గూర్చి వింటాము. దత్తపురాణంలో ఒక ఉదాహరణ ఉంది. ఒక స్త్రీ భర్త మృతిచెందగా ఆర్తురాలై ఏడుస్తూ దత్తస్వామి దగ్గరకు వచ్చింది. ఆయన దగ్గర భక్తులు వరుసలో నిల్చొని ఆశీస్సులు తీసుకొని వెళ్తున్నారు. ఆమె దగ్గరకు వచ్చేసరికి దీర్ఘసుమంగళీభవ అని ఆశీర్వదించాడు దత్తస్వామి. భక్తులు ఆమె భర్త మరణవార్త చెప్పారు. ఆయన ఆ మృతుని బ్రతికించాడు. అప్పు డొక భక్తుడు తన సందేహాన్ని ఇలా అడిగాడు స్వామీ ! ఇతనిది కాలమృత్యువా? అకాలమృత్యువా? అని. స్వామి "కాలమృత్యువే. ఇతని ఆయువు పూర్తి అయిపోయింది" అన్నారు. "మరెలా బ్రతికించారు ? అని భక్తుని

ప్రశ్న: "రాబోయే జన్మలో నుండి కొంత ఆయువు తెచ్చి ఇప్పుడిచ్చాను" అన్నారు.

ఇటువంటి సంఘటనే ఇటీవల సత్యసాయిబాబా గారి వల్ల జరిగినట్లు ఒక గ్రంథంలో చెప్పబడింది. విదేశీయులైన దంపతులు స్వామి చిరకాల భక్తులు బెంగుళూరు వచ్చారు. పుట్టపర్తి బయలుదేరబోతుండగా ఇద్దరిలో భర్త మరణించాడు. భార్య స్వామికి విషయం తెలియజేసి ఆర్తితో ప్రార్థించింది. ఆయన బయలుదేరి వచ్చి చచ్చిన ఆ వ్యక్తిని బ్రతికించారు. స్వామిని సేవించుకొని వాళ్ళు కొన్నాళ్ళకు వారిదేశం వెళ్ళి అక్కడినుండి పుట్టపర్తి ఆసుపత్రికి కొన్ని లక్షల డాలర్లు పంపించినారు. ఆ తరువాత కొన్నాళ్ళకు మళ్ళీ మరణించాడు. ఒక భక్తుడు మళ్ళీ పైన వేయబడిన ప్రశ్నవంటిదే వేశాడు. అప్పుడు బాబాగారు కూడా దత్తాత్రేయుడు చెప్పిన సమాధానమే చెప్పారు. యోగీశ్వరులు జీవుని రాబోయేజన్మ నుండి కొంత ఆయువును ఈ జన్మలోనికితెచ్చి కలపటం అనేది చేస్తుంటారన్నమాట.

ఇదికాక బృందావన యోగి శ్రీరాధికా ప్రసాద్ మహరాజ్ గారి జీవితంలో మరొక విధమైన విశేషం చెప్పబడుతున్నది. ఆయన శ్రీరాధాదేవి అనుగ్రహపాత్రుడు. సుమారు యాభై అయిదు సంవత్సరాల వయస్సులో తీవ్రజ్వరగ్రస్తుడై మృత్యుముఖంలోకి వెళ్ళేస్థితి వచ్చింది. ఆయన సహసాధకురాలైన రాధామహాలక్ష్మమ్మతో పరమేశ్వరి రాధాదేవి "ఇతనికి ఆయుర్దాయం పూర్తిగా అయిపోయింది. నీవు నీ భర్త మీ ఆయుష్షులలో నుండి కొంత దానం చేయటానికి ఇష్టపడితే ఇతడు మరికొంతకాలం జీవించి దేవకార్యానికి పనికి వస్తాడు" అన్నది. వాళ్ళు అంగీకరించారు. జగన్మాత వీళ్ళ ఆయువులో నుండి ఎంత తీసి ఈయనకు కలిపిందోగాని తరువాత కొంతకాలానికి ఇద్దరూ గతించారు. రాధికాప్రసాద్‌మహరాజ్ మాత్రం నూటనాలుగు సంవత్సరాల వయస్సులో బృందావన రసభక్తి సంప్రదాయాన్ని ప్రచారంచేస్తూ జీవితాన్ని సార్థకం చేసుకొంటూ ధన్యులైనారు.

ఈవిధంగా నిత్యజీవితంలో మంత్రతంత్రాలు - వాటి ప్రభావం అసామాన్యమైనది. సామాన్యమానవుడు కూడా కొద్దిపాటి సాధనతో విలువైన ప్రయోజనాలు పొందగలుగుతాడు. దైవికమైన పురుషకారం యొక్క శక్తి అద్భుతము - అమూల్యము.



# ముఖ్యమైన ప్రయోజన మంత్రములు

## గురుమంత్రము

1. ఓం -

1(ఎ). ఓం హ్రీం సిద్ధ గురో ప్రసీద హ్రీం ఓం

2. **సిద్ధాత్మల ఆవాహన** - ఓం హ్రీం హ్లాం హసహస సిద్ధాత్మాభంసం మంపంసంక్షం ఆవాహయ జాగ్రయస్ఫుటయఫట్

## గాయత్రీ మంత్రము

3. ఓం భూర్భువస్సువః - తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్
ముక్తికొరకు "పరోరజసి సావదోం" కలుపవలెను. (4వ పాదము)

4. శ్రీం హ్రీం క్లీం సావిత్ర్యై నమః

## శైవ మంత్రములు

5. **శివ** - ఓం నమశ్శివాయ

6. **రుద్ర** - ఓం నమోభగవతే రుద్రాయ

7. ఓం హూం క్రోధాగ్ని రుద్రాయ దుష్టగ్రహాన్ ఖట్‌ఫట్ జహి స్వాహా

8. **భైరవ** - ఓం జూం హూం భం కాలభైరవాయ నమః

9. ఓం హూం వజ్రభైరవాయ నమః

10. **శరభసాళ్వము** - ఓం ఖేం ఖాం ఖట్ ఫట్ శత్రూన్ గ్రససి శత్రూన్ గ్రససి హుం ఫట్ సర్వాస్త్ర సంహరణాయ శరభసాళ్వాయ పక్షిరాజాయ నమః

11. **మృత్యుంజయ** - ఓం హూం జూం సః మృత్యుంజయాయ నమః

12. **బేతాళ** - తురుతురు బేతాళాయ నమః

13. **పాశుపతము** - శ్లీం పశుహుం ఫట్

13(ఎ). ఓం క్లీం హూం కామభైరవాయ నమః పుష్పధన్వాయ యౌవనం దేహి క్లీం ఓం

13(బి). ఓం హూం మదనాంతకాయ నమశ్శివాయ కామం దహదహ రంఫట్

## వైష్ణవ మంత్రములు

14. నారాయణ - ఓం నమో నారాయణాయ
15. వాసుదేవ - ఓం నమో భగవతే వాసుదేవాయ
16. కృష్ణ - ఓం హ్రీం క్లీం కృష్ణాయ నమః

16(ఎ) ఓం శ్రీం హ్రీం క్లీం రాధాకృష్ణాయ నమః

17. గోవింద - ఓం హ్రీం క్లీం కృష్ణాయ గోవిందాయ గోపీజన వల్లభాయ స్వాహా
18. సుదర్శనము - ఓం సహస్రార హుంఫట్
19. నరసింహస్వామి - ఓం శ్రీం హ్రీం క్ష్రీం నరసింహస్వామినే నమః
20. శ్లో. ఉగ్రం వీరం మహావిష్ణుం జ్వలంతం సర్వతో ముఖం
    నృసింహం భీషణం భద్రం మృత్యు మృత్యుం నమామ్యహం
21. రామ - ఓం శ్రీం రాం రామాయ నమః
22. వేంకటేశ్వర - ఓం నమో వేంకటేశాయ
23. సంతానగోపాల - దేవకీసుత గోవింద వాసుదేవజగత్పతే
    దేహిమే తనయం కృష్ణ త్వామహం శరణంగతః
24. దత్తాత్రేయ స్వామి - ఓం ద్రాందం దత్తాత్రేయాయ నమః
25. కార్తవీర్యార్జున - ఓం కార్యవీర్యార్జునాయ నమః - శత్రూన్ ఠఠఠఠ స్తంభయ బంధయ స్వాహా
26. ఓం ఆం హ్రీం క్రోం కార్తవీర్యార్జునాయ నమః హృతం నష్టం ప్రయచ్ఛస్వాహా

## శాక్తేయ మంత్రములు

27. ఓం హ్రీం శ్రీం రాధాయై స్వాహా.
28. లలితా - ఓం ఐం హ్రీం శ్రీం లలితాయై నమః

28(ఎ) హ్రీం క్లీం కామేశ్వర లలితాయై నమః

29. క ఏ ఈ ల హ్రీం హసకహలహ్రీం సకలహ్రీంశ్రీం
30. హ్రీం లలితాయై మహిషాసురమర్దిని స్వాహా
30(ఎ) గౌరి – హ్రీం గౌర్యై నమః
31. హ్రీం పార్వత్యై నమః
32. హ్రీం ఉమాయై నమః
32ఎ. హ్రీం అన్నపూర్ణాయై నమః
33. **కాళి** – క్రీం హ్రీం హూం కాళికే స్వాహా
34. **భద్రకాళి** – క్రీం హ్రీం హూం భద్రకాళి స్వాహా
35. **మహాకాళి** – క్రీం హ్రీం హూం కాళి మహాకాళి కిలికిలిఫట్ స్వాహా
36. **ఆకర్షణకాళి** – క్రీం హ్రీం హూం కాళికే .... ఆకర్షయ ప్రస్థాపయ మణిభద్ర స్వాహా
37. **చంద్రకాళి** – ఓం హ్రీం శ్రీం సః చంద్రకాళి స్వాహా
37ఎ. **కేశకాళి** – క్రీం కేశకాళి స్వాహా
38. **అగ్నికాళి** – క్రీం రం జ్వాలామాలిని తీవ్రవశంకరి మహాకాళి స్వాహా
39. **చైతన్యకాళి** – క్రీం హ్రీం హూం కాళికేమమ చైతన్యం జాగ్రయ స్వాహా
40. **సమ్మోహనకాళి** – క్లీం బ్లూం సమ్మోహనకాళి శుద్ధయోగిని నిద్రాదేవి స్వాహా
41. **అఘోరకాళి** – క్రీం హూం క్రోధకాళి అఘోరేశ్వరి ఘోరముఖి ఊర్ధ్వ కేశి హ్రీంఖ్యః హుం ఫట్ స్వాహా
42. **తార** – ఓం హ్రీం త్రీం హూం తారే తుతారే తోరే స్వాహా
43. **స్వర్ణతార** – క్లీం త్రీం హూం వజ్రవైరోచనీయే స్వర్ణతారాయై ఫట్
44. **ఛిన్నమస్త** – హూం వజ్రవైరోచనీయే ఫట్ స్వాహా
45. ఓం శ్రీం హ్రీం క్లీం ఐం వజ్రవైరోచనీయే హూం హూం ఫట్ స్వాహా
46. **భైరవి** – హసైం హసకరీం హసైం త్రిపుర భైరవ్యై నమః
47. **బగళాముఖి** – ఓం హ్లీం బగళాముఖి స్వాహా
48. ఓం హ్లీం బగళాముఖి సర్వదుష్టానాం వాచం ముఖం పదం స్తంభయ జిహ్వాం కీలయ బుద్ధిం వినాశయ హ్లీం ఓం స్వాహా

49. ఓం హ్లీం బగళాముఖి శత్రూన్ ఠఠఠఠ స్తంభయ బంధయ స్వాహా
50. **ధూమావతి** – ధూం ధూం ధూమావతి స్వాహా
51. **కాళీధూమావతి** – క్రీం ధూం క్రీం ధూం కాళీ ధూమావతి స్వాహా
52. **వారాహి** – గ్లౌం వారాహి స్వాహా
53. **వజ్రవారాహి** – గ్లౌంహూం వజ్ర వారాహి స్వాహా
54. **స్వప్నవారాహి** – ఓం హ్రీం నమో వారాహి ఘోరే స్వప్నం ఠః ఠః
55. **మాతంగి** – క్లీం హ్రీం హూం మాతంగి స్వాహా
56. **రాజశ్యామల** – క్లీం హ్రీం హూం మాతంగి రాజశ్యామలే స్వాహా
57. **ఉచ్ఛిష్ట మాతంగి** – ఐం క్లీం నమ ఉచ్ఛిష్ట చాండాలి మాతంగి సర్వవశంకరి స్వాహా
58. **సంగీతమాతంగి** – ఐం క్లీం సంగీత మాతంగి స్వాహా
59. **కవితామాతంగి** – ఐం హ్రీం క్లీం సరస్వతీ మాతంగి కవిత్వం దేహి స్వాహా
60. **భువనేశ్వరి** – ఐం హ్రీం శ్రీం భువనేశ్వర్యై నమః
61. శ్రీం హ్రీం క్లీం భువనేశ్వర్యై నమః
62. **కమలాత్మిక** – ఐం శ్రీం జగత్ప్రసూత్యై కమలాత్మికాయై నమః
63. **లక్ష్మి** – శ్రీం లక్ష్మీ దేవ్యై నమః

63(ఎ) శ్రీం సం కుబేర లక్ష్మీదేవ్యై నమః

64. **సరస్వతి** – ఐం సరస్వత్యై నమః

64ఎ. ఐం హ్రీం జ్ఞాన సరస్వత్యై నమః

65. ఐం వదవదవాగ్దేవతే స్వాహా
66. ఐం హ్రీం త్రీం హూం నీలసరస్వత్యై నమః
67. **దుర్గ** – ఓం హ్రీం దుం దుర్గాయై నమః
68. ఓం హ్రీం దుం దుర్గాయై నమః జ్వలజ్వల శూలిని దుష్టగ్రహాన్ హుం ఫట్

68ఎ. ఓం హ్రీం దుం దుర్గే క్రోధం శమయ శం శం స్వాహా

69. **వనదుర్గ** – ఓం హ్రీం దుం వనదుర్గే ఉత్తిష్ఠ పురుషి కిం స్వపిషి భయం మే సముపస్థితం యదిశక్యమశక్యం వా తన్మే భగవతి శమయ శమయస్వాహా

70. **దీప దుర్గ** – ఓం హ్రీం దుం రం దీపదుర్గాయై నమః

71. **శాంతిదేవి** – ఓం శం శాంతే ప్రశాంతే సర్వక్రోధోపశమని స్వాహా

72. **శీతల** – ఓం హ్రీం శ్రీం శం శీతలాయై నమః

73. ఓం శం సోం సః చంద్ర శీతలాయై నమః

74. **ప్రత్యంగిర** – క్షం హ్రాం హ్రీం ప్రత్యంగిరే దుష్టగ్రహాన్ ఖట్ ఫట్ జహి స్వాహా

75. క్షం హ్రాం హ్రీం భక్ష జ్వాలా జిహ్వే కరాళ దంష్ట్రే ప్రత్యంగిరే క్షం హ్రాం హ్రీం హుం ఫట్ స్వాహా

76. **చండి** – ఐం హ్రీం క్లీం చాముండాయై విచ్చే

77. **రేణుక (ఎల్లమ్మ)** – ఓం శ్రీం హ్రీం క్రోం ఐం రేణుకాయై నమః

78. **మహామారి** – ఖేం ఖేం మహామారి దుష్టగ్రహాన్ ఖట్ ఫట్ జహి స్వాహా

79. **గణపతి** – ఓం గం గణపతయే నమః

80. **మహాగణపతి** – ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వర వరద సర్వజనం మే వశమానయ స్వాహా

81. **లక్ష్మీగణపతి** – శ్రీం గ్లౌం శ్రీం గం లక్ష్మీగణపతయే నమః

82. **ఋణహర్తృగణపతి** – ఓం హ్రీం హూం గ్లౌం గం గణేశ శ్రియందేహి ఋణం ఛింది వరేణ్యం హుం నమః ఫట్

83. **శక్తి గణపతి** – హ్రీం శక్తి గణపతయేనమః

84. **క్షిప్రగణపతి** – గం గం క్షిప్రగణపతి శీఘ్రం కార్యసిద్ధిం కురుకురుస్వాహా

85. **విద్యా గణపతి** – ఐం గం విద్యా గణపతయే నమః

86. ఐం గం సరస్వతీ గణపతయే నమః

87. ఐం గం మేధోల్క గణపతయే నమః

88. **కళ్యాణగణపతి** (వివాహానికి) - ఓం హ్రీం గం హరిద్రా గణపతయే నమః

88(ఎ). (కోరిన వ్యక్తితో జరుగుటకు) పై మంత్రము + కామిత వివాహం కురుకురు క్లీం హూం స్వాహా

89. **విజయగణపతి (కార్యసిద్ధికి)**
ఓం ఐం హ్రీం శ్రీం విజయగణపతయే నమః

89ఎ. **స్తంభనగణపతి** - ఓం హ్రీం హరిద్రాగణపతయే నమః సర్వహృదయాణి ఠఠఠ స్తంభయ మమ వశం కురుస్వాహా

**కుమారస్వామి**

90. ఓం హ్రీం సౌం శక్తి ధరాయ శరవణభవాయ నమః
91. ఓం హ్రీం సౌం శక్తి ధరాయ కుమారస్వామినే నమః
92. ఓం హ్రీం సౌం సుబ్రహ్మణ్యాయ నమః
93. **వీరభద్రుడు** - ఓం హ్రీం హూం వీరభద్రాయ నమః
94. ఓం హ్రీం హూం వీరభద్రాయ సంహార భైరవాయ శత్రూన్ ఖట్ ఫట్ జహి స్వాహా
95. **అయ్యప్ప** - ఓం హ్రీం హూం శాస్తృ భైరవాయ అయ్యప్ప స్వామినే నమః

**నాగ మంత్రములు**

96. ఓం హూం ఉత్తరజాయ ఫట్
97. ఓం హూం నమో నాగభైరవాయ ఉత్తరజాయ ఫట్
98. ఓం హ్రీం నాగేశ్వరి మానసాదేవ్యై నమః

**హనుమాన్ మంత్రములు**

99. ఓం హనుమతే నమః
100. ఓం హ్రీం హరిమర్కట మర్కటాయ నమః
101 ఓం హూం వజ్రాంగ బలాయ వీరహనుమతే నమః

102. ఓం హ్రీం హిలి హిలి స్వప్నాంజనేయాయ నమః

103. **పంచముఖాంజనేయము** - ఓం హ్రీం క్షౌం క్ష్మౌం గ్లౌం హ్సాం పంచముఖాంజనేయాయ నమః

104. **మళయాళ హనుమంతుడు** -
పెళ పెళ రుద్ర భైరవాయ మళయాళ వీరహనుమతే నమః

105. **భైరవ హనుమాన్** - ఓం హూం భైరవ హనుమతే నమః

105ఎ. ఓం హం ఆకాశ భైరవాయ వీరహనుమతే నమః

## నవగ్రహ మంత్రములు

106. **సూర్య** - ఓం హ్రాం సూర్యాయ నమః

107. **మార్తాండ భైరవ** - ఓం హ్రాం మార్తాండ భైరవాయ నమః

108. **చక్షుష్మతి** - ఓం హ్రాం నమో భగవతే శ్రీ సూర్యాయ అక్షి తేజసే నమః

109. **చంద్ర** - ఓం సోం సః సోమాయ చంద్రాయ నమః

110. **కుజ** - ఓం రం అంగారకాయ నమః

111. **బుధ** - ఓం బుం బుధాయ నమః

112. **గురు** - ఓం హ్రీం గురవే బృహస్పతయే నమః

113. **శుక్ర** - ఓం హ్రీం శుం శుక్రాయ నమః

114. **శని** - ఓం శం శనైశ్చరాయ నమః

115. **రాహు** - ఓం రం రాహవే నమః

116. **కేతు** - ఓం కం కేతవే నమః

## దిక్పాలక మంత్రములు

117. ఇంద్ర - లం ఇంద్రాయ నమః (తూర్పు)

118. ఓం ఇంద్రో విశ్వస్య రాజతి (ఇంద్ర గాయత్రి)

119. అగ్ని - రం అగ్నయే స్వాహా (ఆగ్నేయం)

120. ఓం రం వైశ్వానరాయ జాతవేదసే నమః

121. యమ - హం యమాయ నమః (దక్షిణం)

122. నిరృతి - షం నిరృతయే నమః (నైరృతి)
123. వరుణ - వం వరుణాయ నమః (పడమర)
124. వాయు - యం వాయవే నమః (వాయవ్యం)
125. **కుబేర** - శ్రీం సం సోమాయ కుబేరాయ నమః (ఉత్తరం)
126. **ఈశాన** - శం ఈశానాయ నమః (ఈశాన్యం)
127. బ్రహ్మ - ఆం బ్రహ్మణే నమః (ఊర్ధ్వ దిశ)
128. **ఆదిశేషుడు** - హ్రీం అనంతాయ నమః (అధోదిశ)

## పంచభూత మంత్రములు

129. **భూమి** - లం పృథివ్యై నమః
130. **జల** - వం వరుణాయ నమః
131. **తేజస్సు** - రం అగ్నయే స్వాహా
132. **వాయువు** - యం వాయవే నమః
133. **ఆకాశ** - హం ఆకాశాయ నమః

## సంపుటీకరణ మంత్రములు కొన్ని

134. క్లీం హ్రీం హూం మాతంగి వజ్రవైరోచనీయేఫట్ స్వాహా
135. రంజరరాగ్నయేబడబానలాయ స్వాహా
136. ఓం క్ష్రీం అష్టముఖ గండభేరుండ జ్వాలానరసింహాయ నమః
137. ఓం హ్రాం హ్రీం హూం జూం సః మృత్యుంజయాయ మార్తాండ భైరవాయ నమః
138. ఓం హూం జూం సః మృత్యుంజయాయ కాలభైరవాయ నమః
139. ఓం హ్రీం దుం జ్వల జ్వలశూలిని దుర్గే సర్వశూలబాధాం నివారయ హుం ఫట్ స్వాహా
140. ఓం హ్రీం హిలి హిలి సిద్ధగురో జ్ఞానభైరవ ప్రసీద హ్రీం ఓం నమః అవతర అవతర స్వాహా
141. గ్లౌం గం వారాహీ గణపతయే నమః

## ప్రధాన బీజాక్షరములు

| | | |
|---|---|---|
| ఓం | - | ప్రణవము |
| హ్రీం | - | శక్తి |
| శ్రీం | - | లక్ష్మి |
| ఈం | - | మహామాయ |
| ఆం | - | పాశము |
| క్రోం | - | అంకుశము |
| క్లీం | - | మన్మథ |
| బ్లూం | - | సమ్మోహన |
| సః | - | సౌభాగ్య |
| ఐం | - | సరస్వతి |
| సోం | - | చంద్ర |
| హ్రాం | - | సూర్య |
| ఇం,ఈం | - | నేత్ర (కన్నులు) |
| ఉం,ఊం | - | శ్రోత్ర (చెవి) |
| లం | - | ఇంద్ర, పృథివి |
| వం | - | వరుణ |
| హం | - | ఆకాశ |
| యం | - | వాయు |
| రం | - | అగ్ని |
| ఖేంఖేం | - | మారణము |
| ఖట్‌ఫట్ | - | సంహారము |
| హుం | - | కవచము |
| ఫట్ | - | అస్త్రము |
| గం | - | గణపతి |
| గ్లౌం | - | గణపతి, వారాహి |

రాం - రామ

ద్రాం - దత్తాత్రేయ

దం - దత్తాత్రేయ

ధూం - ఉచ్చాటనము

క్రీం - కాళీ

హూం - క్రోధ, ధేను, కూర్చ

హ్లీం - బగళాముఖి

ఠ - స్తంభన

క్ష్రౌం - నరసింహ

క్షౌం - గరుడ

హ్సౌం - అశ్వ

హిలిహిలి - దేవత మాట్లాడుటకు

కిలికిలి - దేవత మాట్లాడుటకు

ఈ బీజాక్షరములను ప్రయోజనమును బట్టి మంత్రమునకు ముందు బీజములలో చేర్చుకొనవలెను.

## అవసర విషయాలు

1. ముక్తి - 3, 5, 14, 15, 16, 27 మొ॥ మహా దేవతా మంత్రములు

1ఎ. జ్ఞాన వైరాగ్యములకు - 1

2. భక్తి - ఏకాగ్రత - 3, 5, 14, 15, 16, 27 మొ॥ మహా దేవతా మంత్రములు

3. భుక్తి - 32ఎ

4. సంతానము - 23, 97

5. చదువు - 85, 86 64

5ఎ. బుద్ధి, జ్ఞాపకశక్తి - 87

6. శారీరక పెరుగుదల - 101

7. మానసిక సమస్య - 37
8. ఆరోగ్యము - 107
9. కంటివ్యాధి పోవుట - 108
10. ఆటిజం, నాడీ, అవయవ వికృతి రోగములు పోవట - 9 (ఐం కలపవలెను)
11. చర్మవ్యాధులు పోవుట - 97
12. వెన్నెముక, కీళ్ళు, నడము నొప్పులు పోవుట - 9
13. మూర్ఛలు పోవుట - 51
14. జుట్టు పెరుగుట - 37(ఎ)
15. పక్షవాతము పోవుట - 51, 9, 107
16. కేన్సరు పోవుట - 107, 9
17. తలనొప్పిపోవుట - 41
18. కరోనా పోవుట - 9, 51, 107,
19. వ్యసనములు పోవుట - 51
20. స్త్రీల వ్యాధులు పోవుట - 57
21. వివాహము - 88, 88ఎ
22. కుటుంబ సమస్యలు తగ్గుట - 80, 28(ఎ), 57
23. అన్యోన్యదాంపత్యము - 134
24. విదాకులు - 51
25. ఆర్థిక ఇబ్బందులు పోయి ధనము వచ్చుట - 125, 81
26. నిద్ర - 40
27. ప్రయోగబాధలు పోవుట - 74, 75, 68, 7
28. దుష్టశక్తుల పీడ పోవుట - పైవి
29. విదేశీయానము - 105ఎ
30. భూ సమస్యలు తీరుట - 52, 80
31. కోర్టు గొడవలు విజయము - 89

32. పోయినవస్తువు తిరిగి వచ్చుట - 26
33. మాటలు వచ్చుట- 65
34. కోరినవ్యక్తి తిరిగి వచ్చుట - 36
35. నాగదోషము, కాలసర్ప దోషము - 97
36. పిల్లలు మాట వినుట - 38, 89ఎ
37. లలిత కళలో రాణించుట - 55
38. క్రీడలలో నైపుణ్యము - 101
39. కార్యసిద్ధి - 89
40. దివ్యదృష్టి, దివ్యజ్ఞానము - 64ఎ, 35, 29

గమనిక

1. పై మంత్రములన్నింటిలోను అవసరము ననుసరించి సాత్విక, రాజస, తామస మంత్రములను గుణములను బట్టి రెండు మంత్రములను సంపుటీకరించవచ్చును. అనగా కలపవచ్చును.
2. మహా మంత్రములు అన్ని ప్రయోజనములకు పనికి వస్తవి. సంకల్పము చెప్పుకొని, ప్రయోజనమును మంత్రముతో కలిపి చెప్పి గాని ఉపయోగించు కొనవచ్చును.
3. మంత్ర సిద్ధికి గురూపదేశము ప్రధానము. లేక మంత్రమును కాగితము పై వ్రాసి దేవాలయమునకు వెళ్ళి దేవతా విగ్రహము ముందు పెట్టించి, పూజ చేయించి దేవతనే గురువుగా భావించి జపసాధన చేయవచ్చును.
4. ప్రతి మంత్రమునకు పురశ్చరణ సంఖ్య జపము పూర్తి చేయవలెను. కనీసం ఒక లక్ష తప్పనిసరి. అప్పుడు గాని మంత్రము మీద అధికారము రాదు, జపమునకు మాల ఉపయోగించుట సౌకర్యము. సాత్విక మంత్రములకు తులసి, రాజస మంత్రములకు ముఖ్యంగా శైవ శాక్తేయములకు రుద్రాక్షమాల ఉపయోగించ వలెను. దేవతా శరీర వర్ణముగల మాలలు ఉపయోగించవచ్చును.

జపము చేసిన పిదప హోమము పదవ వంతు చేయవలెను. హోమము జపము కంటె ఎన్నోరెట్లు శక్తికలది. హోమమునకు ఏ వస్తువులను

ఉపయోగించవలె, ఎలా చేయాలి దానిని విడిగా తెలుసుకోవాలి. అలాగే తర్పణము, మార్జనము, సమారాధనము, అన్న సంతర్పణ మంత్ర సిద్ధికి ముఖ్యము. ఇంట్లో కంటె గుడి, దానికంటె మహాక్షేత్రము దేవతా అనుగ్రహమునకు, మంత్ర సిద్ధికి ప్రధానము, బలులు - రాజస, తామస మంత్ర దేవతలకు నిమ్మకాయ, కొబ్బరికాయ, గుమ్మడికాయ, కుంకుమ కలిపిన అన్నం ముద్ద బలి సమర్పించవలెను.

5. ఇప్పుడు చెప్పిన మంత్రములు సామాన్యంగా ఎక్కువగా అవసరమయ్యేవి. ఇవి కాక ఇంకా అనేక ప్రయోజనాలకు అధికంగా తెలుసుకోదలచు కొన్నవారు మన సమస్యలు - మంత్ర సాధనలు అనే మా గ్రంథమును చదవగలరు.

## మంత్రసాధన

- మంత్రదేవత అనుగ్రహం కోసం, కష్టాలు తొలిగి సంకల్పం సిద్ధించటం కోసం ఏ మంత్రమయినా ఉపదేశం పొంది పురశ్చరణ చేయాలి.
- పురశ్చరణ అంటే (పురః:- ముందు, చరణ:- చరించుట) దేవతను మన ముందు చరించేలా చేసేది పురశ్చరణ.
- పురశ్చరణ అయిదు భాగాలు: -1) జపము 2) హోమము 3) తర్పణము 4) మార్జనము 5) అన్న సమారాధనము.
- పురశ్చరణలో భాగంగా - పొందిన ప్రతి మంత్రము కనీసము ఒక లక్ష సంఖ్య ( 1000 మాలలు) జపము; జపసంఖ్యలో పదవ వంతు 10,000 ఆహుతులతో (100 మాలలు) హోమము; హోమసంఖ్యలో పదవ వంతు 1000 సార్లు (10 మాలలు) తర్పణము; తర్పణ సంఖ్యలో పదవ వంతు 100 సార్లు (1 మాల) మార్జనము; మార్జనములో పదవ వంతు 10 మందికి అన్నసమారాధన చేయాలి.

**జపవిధానము:**

- ఏదైనా పుణ్య క్షేత్రంలో కానీ, దేవాలయంలో కానీ, కుదరని పక్షంలో తమ ఇంటిలో పూజాగదిలో లేదా వీలైన చోట శుచిగా కూర్చొని, పంచపాత్రలో నీరు తీసుకొని, పాత్రమీద చేయి పెట్టి, జపం చేసేవారి

పేరు, గోత్రం, సంకల్పం (అంటే ఏ పని కోసం జపం చేస్తున్నామో చెప్పుకోవాలి. తెలుగులో చెప్పుకోవచ్చు - ఎటువంటి దోషము లేదు) ఇతరుల కోసం జపం చేస్తే వారి వివరాలు, సంకల్పం చెప్పుకొని జపం మొదలు పెట్టాలి.

- మంత్రానికి తగినటువంటి జపమాలను ఎన్నుకొని జపం చేయాలి. జపమాల లేని పక్షంలో చిన్న కౌంటింగ్ మిషను సహాయం తీసుకొని జపసంఖ్య లెక్కించుకోవచ్చు.
- మంత్రములు రహస్యములు, ఇతరులు వినరాదు. కనుక మంత్ర జపము చేసేటపుడు వీలైనంతవరకు మనస్సులో (మానసికంగా) లేక పైకి శబ్దము రాకుండా పెదవులు కదిలిస్తూ (ఉపాంశు జపం) జపం చేయవలెను.
- జపం చేసేటపుడు మరీవేగంగా కానీ, నెమ్మదిగా కానీ కాక సమవేగంతో మంత్రజపం చేయాలి.
- జపమాలను కుడిచేతి ఉంగరపువేలిపై ఉంచి బొటనవేలు, మధ్యవేలు, ఈ రెంటితో సాధకుడు తన వైపు పూసను జరుపుకోవాలి, జపవేళ మాలకు చూపుడువేలు తగలరాదు.
- జపం చేసే వేళ నేల తగలకుండా పీట కానీ, చాప కానీ, వీలైతే చిత్రాసనము, దర్భాసనము / ఏదైనా శుభ్ర వస్త్రము వేసుకొని కూర్చోవాలి. క్రింద కూర్చొనలేని వారు ఎత్తైన బల్ల / కుర్చీమీద కూర్చొని కాళ్ళు నేలకు తగలకుండా కాళ్ళ క్రింద ఏదైనా వస్త్రం వేసుకోవాలి.
- మంత్ర జపానికి పగలు రాత్రి అనే నిబంధన లేదు. అయితే భోజన అనంతరం రెండు గంటలు విడిచి పెట్టి ఎప్పుడైనా చేయవచ్చు. అల్పాహారం తీసుకున్నప్పుడు ఈ నియమం లేదు.
- మంత్ర జపం నిరంతరం మనసులో చేసుకోవచ్చు. అందుకు ఎటువంటి నియమములు లేవు. ఈ నిరంతర మానసిక జపం వలన మంత్రశక్తి పెరుగుతూ ఉంటుంది. అయితే ఏదైనా సంకల్పం సిద్ధించాలన్నా, దేవత అనుగ్రహం కోసం జపం చేయాలన్నా శుచిగా కూర్చొని చేసే జప సంఖ్యను మాత్రమే పరిగణనలోకి తీసుకోవాలి.

- ఎప్పటికప్పుడు లేదా ఆరోజు మొత్తం చేసిన జపసంఖ్యను పూర్తి చేశాక పంచపాత్రలోని నీరును చేతిలోకి తీసుకొని జప ఫలితం మొత్తం సంకల్పం నెరవేరటం కోసం మంత్ర దేవతకు సమర్పిస్తున్నాను అని ఆ నీటిని ఒక చిన్న ప్లేటులో వేసి, కొంత భాగం తీర్థంగా తీసుకోవాలి.
- ఇతరుల కోసం జపం చేస్తే, వారికి ఆ తీర్థాన్ని యివ్వాలి. ఒక వేళ యితరుల కోసం జపం చేసినప్పుడు వారు దగ్గర లేకపోతే కుంకుమ / అక్షతలతో (నీటి బదులుగా) జప ఫలితాన్ని దేవతకు సమర్పణ చేసి, వారికి ఆ కుంకుమను/అక్షతలను పంపి ధరింపజేయాలి.
- పురశ్చరణలో భాగంగా జపసంఖ్యను ఒక లక్ష పూర్తి అయిన తరువాత 10,000 ఆహుతులతో హోమం , అనంతరం 1000 సార్లు తర్పణం, 100 సార్లు మార్జనం, 10 మందికి అన్నసమారాధన చేయాలి. ఒక వేళ మంత్రజపం మాత్రమే సాధ్యమయినప్పుడు, మిగిలినవి సాధ్యం కానప్పుడు, అదే విషయాన్ని మంత్ర దేవతకు విన్నవించి హోమానికి బదులుగా 20,000 మంత్రజపం, తర్పణానికి బదులుగా 3000 మంత్రజపం, మార్జనానికి బదులుగా 400 మంత్రజపం చేయవచ్చు. అన్నసమారాధనానికి బదులుగా ఏదైనా దేవాలయంలో నైవేద్యం చేయించి పంచవచ్చును.
- కుదరని పక్షంలో తప్ప యథావిధిగా పురశ్చరణలో హోమ, తర్పణ, మార్జనములు చేస్తే అధిక ఫలితం.
- మొదటిసారి పురశ్చరణ పూర్తి చేశాక జపం, హోమం, తర్పణము విడిగా ఎంత సంఖ్య అయినా చేయవచ్చు.
- కార్యసిద్ధి అయ్యేంత వరకు, కర్మబాధలు తొలగిపోయేవరకు, దేవతానుగ్రహం పొందేంత వరకు మంత్రసాధన చేస్తూ జీవితం అంతా దేవతానుగ్రహంతో తరించవచ్చును.

## మంత్రసాధనా మంజూష (శీఘ్ర మంత్రసిద్ధి కోసం)

- మంత్రసాధన త్వరగా ఫలించటం కోసం ఉపయోగించే ఉపకరణములు "మంత్ర సాధనములు".

- త్వరగా కష్టాలు తొలగి కోరికలు సిద్ధించటంకోసం, మంత్ర సాధనలో పురోగమించి మంత్రసిద్ధిని, దేవతా అనుగ్రహాన్ని పొందటం కోసం ప్రాచీన మంత్ర గ్రంథములో అనేక మంత్రసాధనములను గురించిన విశేషములు నిక్షిప్తం అయ్యి ఉన్నాయి.
- వివిధ మంత్రములకు, వివిధ ప్రయోజనములకు ప్రత్యేకమైన మంత్ర సాధనములు చెప్పబడ్డాయి.
- వివిధ మంత్ర సాధనములను సేకరించి మంత్ర సాధనకు ఉప యోగించటం సులభమైన అంశం కాదు.
- సాధకుల ప్రయోజనముల కోసము, శీఘ్ర మంత్రసిద్ధి కోసము, వివిధ మంత్ర సాధనములను సేకరించి, ఒకే చోట మంత్రసాధనా మంజూషగా ఇవ్వటం జరుగుతున్నది.
- మంత్ర ఉపదేశం పొందినవారు తమ మంత్రసాధనలో వీనిని ఉపయోగించి తమ ప్రయోజనములను త్వరగా నెరవేర్చుకొందురు గాక!!!

**జపమాల:**

- మంత్ర జప సంఖ్యను లెక్కించటం కోసం జపమాలను ఉపయోగిస్తారు.
- ప్రతి జపమాలకు ప్రత్యేక వర్ణము, లక్షణము ఉంటాయి.
- మంత్రమునకు, ప్రయోజనమునకు తగిన జపమాలను చాలా జాగ్రత్తగా ఎంచుకోవాలి.
- మంత్రదేవతను, సాధకుని సంకల్పమును అనుసరించి జపమాల మారుతూ ఉంటుంది.
- సరైన జపమాలతో జపం చేస్తే త్వరగా సత్ఫలితాలను పొందవచ్చు.
- సరైన జపమాలను ఎంచుకోకపోతే ఆశించిన ఫలితం లభించకపోవచ్చు.
- ప్రాచీన మంత్ర గ్రంథములను అనుసరించి మంత్రమునకు తగిన జపమాల యిక్కడ లభిస్తుంది.

## జపమాల సంచి:

- జపమాలను ఉపయోగించి మంత్ర జపం చేసే సమయంలో మంత్రశక్తి జపమాలలోకి, సాధకునిలోకి ప్రవేశిస్తుంది.
- మంత్ర జపం చేసే సమయంలో జపమాల యితరులకు కనిపించకూడదు, యితరులు స్పర్శించకూడదు.
- జప సమయంలో జపమాల క్రింద పడకూడదు. చేతినుండి జారితే వస్త్రం మీద పడేలా చూచుకోవాలి.
- జప సమయంలో మాలను ప్రత్యేకమైనగోముఖ ముద్ర కలిగిన జపమాల సంచిలో ఉంచి, అదే ముద్రతో జపం చేస్తే మంత్రం త్వరగా సిద్ధిస్తుంది.
- అందుకని మంత్ర సాధకుల కోసము, జపసమయంలో చూపుడువేలు జపమాలకు తగలకుండా ప్రత్యేక శ్రద్ధతో రూపొందించిన జపమాల సంచి లభిస్తున్నది.
- జప సమయంలో జపమాలను ఈ సంచిలో ఉంచి జపం చేస్తే త్వరగా సత్ఫలితాలను పొందవచ్చు.
- జపం చేయని సమయంలో జపమాలను భద్రపరచటానికి, ప్రయాణ సమయంలో యింకో చోటుకు తీసుకువెళ్ళటానికి జపమాల సంచిని ఉపయోగించవచ్చు.

**గమనిక: జపమాల అతిపవిత్రమైనది. అందుకని జపమాలను ప్లాస్టిక్ కవర్లలోను, డబ్బాలలోను భద్రపరచకూడదు. ప్రకృతి నుండి వచ్చిన ప్రత్తితో చేసిన సంచీలో లేదా చెక్క పెట్టెలో భద్రపరచాలి.**

## జపమాల మంజూషిక:

- శీఘ్ర మంత్ర శక్తి కోసం ప్రత్యేకమైన జపమాల మంజూషిక (పెట్టె) లభిస్తున్నది.
- పిరమిడ్ ఆకారంలో ఉన్న ఈ మంజూషికకు దివ్యశక్తిని ఆకర్షించే లక్షణం ఉన్నది.
- అందువలన ఈ మంజూషికలో జపమాలను ఉంచితే జపమాల మరింత శక్తివంతమయి, జప సమయంలో ఆ శక్తి సాధకులలో ప్రవేశిస్తుంది.

- శీఘ్రంగా మంత్ర సిద్ధిని పొందాలనుకున్నవారు ఈ మంజూషికను ఉపయోగించవలెను.

## గురు చిత్రము:

- గురువు చూపు సాధకుల పైన ప్రసరిస్తే మంత్ర దేవతా అనుగ్రహము త్వరగా లభించి కష్టములు, యిబ్బందులు తొలగిపోయి కోరినవన్నీ లభిస్తాయి. గురుచిత్రము ముందు పెట్టుకొని సాధన చేయటం మంచిది.

## మంత్రదేవతా చిత్రములు:

- మంత్రం చేసే సమయంలో మంత్రదేవతా రూపమును చూస్తూ జపం చేస్తే, ఆ దేవత అనుగ్రహం త్వరగా సాధకుల మీద ప్రసరిస్తుంది.
- వివిధ మంత్ర దేవతల చిత్రములు యిక్కడ లభిస్తున్నాయి.

## డిజిటల్ కౌంటర్:

అవసర సమయములలో ఈ చిన్న డిజిటల్ కౌంటర్ సహాయంతో మంత్ర జప సంఖ్యను లెక్కించుకోవచ్చు.

### బాధా నివారణ కోసం ప్రత్యేక పద్ధతులు

- వండినటువంటి అన్నం ఒక పిడికెడు తీసుకొని, అందులో కుంకుమ, నెయ్యి కలిపి చిన్న కప్పులో పెట్టి, ఆ ఎర్రటి అన్నం ముద్దను తాకి ఉపదేశమయిన మంత్రాన్ని 11 సార్లు జపించి, ఆ తరువాత ఆ కప్పును చేతితో పట్టుకొని 3 సార్లు ముఖం ముందర త్రిప్పుకొని పక్షులకు వేయాలి / లేదా ఎవరూ తొక్కని చోట పడవేయవలెను.
- పైన చెప్పిన పద్ధతిని కుంకుమ నీళ్ళతో లేదా ఉప్పుతో చేయవచ్చును.
- ఎవరికి వారు, లేదా యితరులకు అయినా ఈ ప్రక్రియలను చేయవచ్చును.
- కర్పూరపు బిళ్ళను కానీ, నూనె వత్తిని కానీ చిన్న ప్రమిదలో లేదా చెంచాలో వెలిగించి ముఖము ముందరి భాగంలో ఉపదేశ మంత్రంతో జపిస్తూ మూడు సార్లు తిప్పుకోవలెను.

- ఈ ప్రక్రియలు రోజులో ఎప్పుడయినా పగలు రాత్రి చేయవచ్చు. ఎర్రని అన్నం ముద్ద / ఉప్పు / కుంకుమనీళ్ళు / కర్పూర దీపం త్రిప్పుకునేటప్పుడు కుడి నుండి ఎడమ వైపుకు లేదా ఎడమ నుండి కుడి వైపుకు ఏ పద్ధతిలో అయినా త్రిప్పుకొనవచ్చును.

## సాధనకు కావలసిన జపమాలలు

రుద్రాక్షమాల - స్ఫటిక మాల - ఎర్రపూసల మాల - తులసి మాల - ముత్యాల మాల - రుద్రాక్ష స్ఫటిక మాల - ఆకుపచ్చ మాల - పసుపు /పసుపు కొమ్ముల మాల - నల్లపూసల మాల - తామరగింజల మాల

# లఘుహోమ పద్ధతి

**(సంస్కృత భాషతో పరిచయము లేనివారికి క్లుప్తముగా చిన్న హోమములు స్వయముగా చేసుకోదలచినవారికి ఇది ఉద్దేశించబడినది)**

కాళ్ళు, చేతులు, ముఖము కడుగుకొని, ఉతికిన దుస్తులు కట్టుకొని, తూర్పు వైపుకానీ, ఉత్తరము వైపుకానీ తిరిగి, పీటపై కానీ, వస్త్రముపై కానీ కూర్చుండవలెను. ఎదురుగా రాగి కుండముకానీ, ఇటుకలతో చేసిన తాత్కాలిక కుండము కానీ ఏర్పాటుచేసుకొని ఉండవలెను.

జలపాత్రను పెట్టుకొని, దానిలో ఉద్ధరిణ వేసి ఒక ఆకుతో నీటిని త్రిప్పుచు "బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులారా! మాతృగణములారా! వేదములారా! సముద్రములారా! భూదేవతా! గంగ, యమున, గోదావరి, కృష్ణ మొదలగు నదులారా! ఈ నీటిలో ప్రవేశించి, తీర్థ జలముగా మార్చవలసినదిగా ప్రార్థిస్తున్నాము.

ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః ఓం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి, ధియోయోనః ప్రచోదయాత్. ఓం ఆపోజ్యోతీ రసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోం"

**సంకల్పము:** నా కోరిక సిద్ధించుట కొరకు ఇష్టదేవతా హోమము

చేయుచున్నాను (ఇక్కడ దేవత పేరు చెప్పవలెను). శ్రీ గురుభ్యో నమః అని గురువులకు నమస్కరించి మూలమంత్రమును స్మరించుచూ కలశములోని నీరును కొంచెము తీసుకొని కుండములో చల్లవలెను.

అదే విధముగా పసుపు, కుంకుమ, అక్షతలు, పూలు దానిలో వేసి "ఇష్ట దేవతా హోమకుండాయ నమః" అని హోమ కుండమునకు నమస్కారము చేయవలెను. కుండము యొక్క అంచులమీద 8 దిక్కులయందు అక్షతలతో ఈ క్రింది మంత్రములు చెప్పుచూ పూజ చేయవలెను.

1. తూర్పు - అగ్నయే నమః 2. ఆగ్నేయము: హుతవహాయ నమః 3. దక్షిణము - హుతాశినే నమః, 4. నైరృతి - కృష్ణవర్త్మనే నమః, పడమర - దేవముఖాయ నమః, 6. వాయవ్యము - సప్తజిహ్వాయ నమః, 7. ఉత్తరము - వైశ్వానరాయ నమః 8. ఈశాన్యం- జాతవేదసే నమః

**అగ్ని పీఠపూజ:** కుండములోపల దశ (10) దిక్కులయందు అక్షతలతో పూజించవలెను. 1. తూర్పు - ఓం పీతాయై నమః, 2. ఆగ్నేయం - ఓం శ్వేతాయై నమః, 3. దక్షిణం - ఓం అరుణాయై నమః, 4. నైరృతి - ఓం కృష్ణాయై నమః, 5. పడమర - ఓం ధూమ్రాయై నమః 6. వాయవ్యం - ఓం తీవ్రాయై నమః, 7. ఉత్తరం - ఓం విస్ఫులింగాయై నమ, 8. ఈశాన్యం - ఓం రుచిరాయై నమః, 9. ఊర్ధ్వము - (ఈశన్యము - తూర్పు మధ్య) ఓం జ్వాలిన్యై నమః, 10. అధోదిక్కు - (నైఋుతి - పడమర మధ్య) ఓం రం సర్వశక్తి కమలాసనాయై నమః

**ఆసన పూజ:** "రం వహ్న్య సనాయ నమః" అని అగ్ని ఆసనమునకు నమస్కరించవలెను.

**అగ్ని జ్వాలనము:** చిన్న కట్టెముక్కలు, పిడకల ముక్కలు ఉపయోగించి వానిపై కర్పూరము పెట్టి, అగ్నిని ముట్టించవలయును. 8 సార్లు "ఓం" కారము ఉచ్చరించి అమృత బీజమగు "వం" 3 సార్లు ఉచ్చరించి, "రం" అను అగ్ని బీజమును 7 సార్లు ఉచ్ఛరించి "రం వహ్నిమూర్తయే నమః" అనుచు మంటలలోనికి అగ్ని దేవుడు దిగినట్లుగా భావించి నమస్కరించ వలయును.

కుడిచేతిలో నీరు పోసుకుని కుండము చుట్టూ "హుం ఫట్" అని

పలుకుచూ అగ్ని చుట్టూ రక్షాకవచము నిర్మించినట్లు భావించుచూ నీరు పోయవలెను.

మండుచున్న కట్టె పుల్లలలో నుండి ఒక పుల్ల తీసి "హూం ఫట్ క్రవ్యాదేభ్యః స్వాహా" అనుచు నైరుతి దిక్కున వేసి దానిని రాక్షసులకు అర్పించినట్లు భావించవలెను.

అగ్నిదేవుడు పూర్తిగా అవతరించి అనుగ్రహించుట కొరకు ఈ క్రింది మంత్రమును చదవవలెను.

1. భూర్భువస్సువరోం, 2. హ్రూం వహ్ని చైతన్యాయ నమః,
3. చిత్పింగళ హనహన దహదహ పచపచ సర్వజ్ఞ ఆజ్ఞాపయ స్వాహా,
4. హ్రీం హ్రీం జ్వలజ్వల ప్రజ్వల ప్రజ్వల హుం ఫట్ స్వాహా,
5. ఓం వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ స్వాహా,

6. అగ్నిం ప్రజ్వలితం వందే జాతవేదం హుతాశనం సువర్ణవర్ణమమలం సమిద్ధం విశ్వతో ముఖం అని అగ్ని దేవునకు నమస్కరించవలెను.

**పంచ పూజ:** వం జలతత్వాత్మికాయ నమః పాద్యం సమర్పయామి, అర్ఘ్యం సమర్పయామి, ఆచమనం సమర్పయామి అని ఉద్ధరిణెడు నీళ్ళు మూడు సార్లు కుండములో వేయవలెను.

లం పృధ్వీ తత్వాత్మికాయ నమః – గంధం ధారయామి అని తడి గంధము చల్లవలెను.

హం ఆకాశతత్వాత్మికాయ నమః – పుష్పై: పూజయామి అనుచు పూలు వేయవలెను.

యం వాయుతత్వాత్మికాయ నమః – ధూపమాఘ్రాపయామి అనుచు అగరుబత్తితో ధూపము చూపించవలెను.

రం తేజస్తత్వాత్మికాయ నమః – దీపం దర్శయామి అనుచు దీపము వెలిగించి చూపించవలెను

ధూపదీపానంతరం ఆచమనం సమర్పయామి అనుచు ఒక చుక్క నీరు వేయవలెను.

"ఆం అమృతతత్వాత్మికాయ నమః – నైవేద్యం సమర్పయామి" అనుచు మధుర పదార్థములను మూలమంత్రము చదువుతూ సమర్పించవలెను. ఎదురుగా నేతిపాత్రను పెట్టుకొని దర్భతో కుండములో దానిని కాల్చి, ఆ మంటను నేతిలో ప్రతిఫలింపచేయవలెను. ఆహుతులు వేయుటకు 'స్రుక్కు' (కొయ్యతో చేసిన పెద్ద మూతిగల పొడుగాటి గరిటె), 'స్రువము' (కొయ్యతో చేసిన చిన్న మూతిగల చెంచావంటిది) ఉపయోగించవలెను. పాత్రలో నుండి స్రువముతో కుడి ప్రక్క నుండి నమః అని నేతిని తీసుకుని "ఓం అగ్నయే స్వాహా" అని ఆహుతి వేయవలెను. ఎడమభాగం నుండి నమః అని నేతిని తీసుకొని "ఓం సోమాయ స్వాహా" అని ఆహుతి వేయవలెను. మధ్య నుండి నమః అని తీసుకొని "ఓం అగ్ని సోమాభ్యాం స్వాహా" అని ఆహుతి వేయవలెను. మరల కుడివైపు నుండి నమః అని నేతిని తీసుకొని "ఓం అగ్నయే స్విష్టకృతే స్వాహా" అని ఆహుతి వేయవలెను. మధ్యనుండి నేతిని తీసుకొని 1. ఓం భూః స్వాహా, 2. ఓం భువః స్వాహా, 3. ఓం సువః స్వాహా, 4. ఓం భూర్భువస్సువః స్వాహా అని ఆహుతులు వేయవలెను.

"ఓం వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ స్వాహా" అని మూడు సార్లు ఆహుతులు వేయవలెను.

ఈ క్రింది మంత్రములతో ఒక్కొక్క ఆహుతి వేయవలెను

1. ఓం అగ్ని జిహ్వాభ్యః స్వాహా, 2. ఓం జిహ్వాధిదేవతాభ్యః స్వాహా, 3. ఓం షడంగదేవతాభ్యః స్వాహా, 4. ఓం అష్టమూర్తిభ్యః స్వాహా, 5. ఓం అష్టమాతృకాభ్యః స్వాహా, 6. ఓం అష్టభైరవేభ్యః స్వాహా, 7. ఓం దిక్పాలకేభ్యః స్వాహా – స్రువముతో నాలుగు సార్లు నేతిని/నూనెను తీసుకొని స్రుక్కునందు వేసి దానిపై ఒక పువ్వు ఉంచి, స్రువమును దానిపై బోర్లించి "ఓం వైశ్వానర జాతవేద ఇహావహ లోహితాక్ష సర్వకర్మాణి సాధయ వౌషట్" అనుచు ఆహుతి వేయవలెను. "ఓం శ్రీం హ్రీం క్లీం గ్లౌం గం గణపతయే వరవరద సర్వజనం మే వశమానయ స్వాహా" అనుచు ఒక ఆహుతి వేయవలెను. "శ్రీ గురుభ్యో నమః స్వాహా" అని గురువును స్మరించుచు ఆహుతి వేయవలెను.

ఆ తరువాత మూలమంత్రమును 10 సార్లు ఉచ్చరించుచూ దేవతను అగ్నియందు అవతరింప చేయవలెను. (ప్రాణప్రతిష్ఠా మంత్రమును పురశ్చరణ

చేసినవారు దానిని ఉపయోగించవచ్చును). అగ్ని, ఇష్టదేవతల ముఖము ఒకటి అగుటకు మూలమంత్రముతో 25 ఆహుతులు స్రువముతో వేయవలెను, ఇద్దరు దేవతల నాడులు ఒకటి అగుటకు 11 ఆహుతులు మూలమంత్రముతో వేయవలెను.

ఇప్పుడు దేవత అగ్నిలోకి అవతరించినది కనుక పాద్యము, అర్ఘ్యము, ఆచమనము, గంధము, పుష్పము, ధూపము, దీపము, నైవేద్యము సమర్పించవలెను. నైవేద్యమును మూలమంత్రమును చెప్పుచూ, స్వాహా అనుచు అగ్నిలో వేయవలెను. పిమ్మట మూలమంత్రముతో 10 ఆహుతులు వేయవలెను (స్రుక్కు, స్రువములు లేనివారు ఉద్ధరిణలు వాడవచ్చును). ఇప్పుడు సాధకుడు తన ప్రయోజనమును అనుసరించి తగిన వస్తువులతో హోమము చేయవలెను (1000, 2000.....10,000 ఆహుతులు). ప్రతిసారి మంత్రమునకు చివర స్వాహా అనుచు ఆహుతి వేయవలెను.

**దేవతాబలి:** ఒక పీచు తీసిన కొబ్బరికాయను కానీ, గుమ్మడి కాయను కానీ, కుంకుమ వ్రాసి, పగలకొట్టకుండా "బలిం సమర్పయామి" అని మూలమంత్రము చివర స్వాహా కలిపి కుండములో వేయవలెను.

చేయదలచుకున్న ఆహుతుల సంఖ్య పూర్తిఅయిన తరువాత ఈ క్రింది మంత్రములతో మహావ్యాహృతి హోమము చేయవలెను.

1. ఓం భూ: అగ్నయేచ పృధివ్యైచ మహతేచ స్వాహా, 2. ఓం భువ: వాయవేచ అంతరిక్షాయచ మహతేచ స్వాహా, 3. ఓం సువః ఆదిత్యాయచ దివేచ మహతేచ స్వాహా, 4. ఓం భూర్భువస్సువ: చంద్రమసేచ నక్షత్రేభ్యశ్చ దిగ్భ్యశ్చ మహతేచ స్వాహా - అనుచు నాలుగు ఆహుతులు సమర్పించవలెను.

**తరువాత బ్రహ్మార్పణ మంత్ర హోమము**

ఓం తత్సత్ ఇత: పూర్వం ప్రాణబుద్ధి దేహ ధర్మాధికార జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థాసు మనసా వాచా కర్మణా యత్ స్మృతం యదుక్తం యచ్చకృతం తత్సర్వం బ్రహ్మార్పణం భవేత్ భూ: స్వాహా - అని ఆహుతి వేయవలెను.

**పూర్ణాహుతి-** పూర్ణాహుతిం జుహోమి అని అనవలెను.

ఒక గిన్నెలో కొబ్బరికాయ కానీ, ఖర్జూరకాయ కానీ, పోకకాయ కానీ

(వక్క), ఉంచవలెను. దానిని పూర్ణాహుతి దేవతగా భావించి ధూప, దీప, నైవేద్యములు సమర్పించవలెను. 12 సార్లు స్రువముతో నేతిని/నూనెని తీసుకొని ద్రవ్యముపై పోయవలెను. లేచి నిల్చొని మూలమంత్రముకు చివర వౌషట్ కలిపి ఉచ్చరించుచు పూర్ణాహుతి ద్రవ్యమును హోమకుండమునందు వేయవలెను.

పూర్ణాహుతి అనంతరము దిక్పాలకులకు ఎర్రన్నం ముద్ద కానీ, కోసి కుంకుమ అద్దిన నిమ్మకాయ కానీ ఈ క్రింది మంత్రమును చెప్పుచూ బలి సమర్పించవలెను. కుండము బయట ఆకు కానీ, కాగితము కానీ పెట్టి, ఆయాదిక్కులలో బలి సమర్పణ చేయవలెను. 1. తూర్పు – "లం ఇంద్రాయ నమః బలిం సమర్పయామి", 2. ఆగ్నేయము – "రం అగ్నయే నమః బలిం సమర్పయామి", 3. దక్షిణము – "హం యమాయ నమః బలిం సమర్పయామి", 4. నైఋతి – "షం నిఋతయే నమః బలిం సమర్పయామి", 5. పడమర – "వం వరుణాయ నమః బలిం సమర్పయామి", 6.వాయవ్యము – "యం వాయవే నమః బలిం సమర్పయామి", 7. ఉత్తరం – "సం సోమాయ నమ: బలిం సమర్పయామి", 8. ఈశాన్యం – "శం ఈశానాయ నమః బలిం సమర్పయామి" 9. ఊర్ధ్వము – "ఆం బ్రహ్మణే నమః బలిం సమర్పయామి", 10. అధో – "హ్రీం అనంతాయ నమః బలిం సమర్పయామి"

**భూతబలి:** ఈశాన్యమున ఆకు వేసి పెద్ద ఎర్రన్నం ముద్దగాని, కోసి కుంకుమ అద్దిన నిమ్మకాయ గాని, కుంకుమ అద్దిన కొబ్బరికాయ ముక్కలు కానీ పెట్టి ఈ క్రింది మంత్రముతో బలి సమర్పించవలెను. "నమః సర్వవిఘ్న కృద్భ్యః సర్వభూతేభ్యో హుంఫట్ స్వాహా – భూతేభ్యో నమః బలిం సమర్పయామి" అని నీరు వదిలిపెట్టవలెను.

**ఉద్వాసన:** 1. దేవతకు "ఓ మంత్రదేవతా! నా అభీష్టమును నెరవేర్చి, మరల నేను పిలిచినపుడు వచ్చునట్లుగా ప్రస్తుతము నీ స్వస్థానమునకు వెళ్ళవలసినదిగా ప్రార్థిస్తున్నాను" అని కుడిచేతిలో నీరు తీసుకొని కుండములో వదలవలెను. అటులే అగ్నికి కూడా చెప్పవలెను.

ఇప్పటికి హోమము పూర్తి అయినది. హోమ భస్మమును నేయి, లేదా నూనె కలిపి బొట్టు పెట్టుకోవలెను.

**హోమ పదార్థాలు:** దేవతా పురశ్చరణలో భాగంగా దేవతా ప్రీతికి - 1. నెయ్యి, 2. నువ్వుల నూనె, 3. నువ్వులు, 4. బియ్యము, 5. బెల్లము, 6. మధుర పదార్థములు, 7. పండ్ల ముక్కలు, 8. పూలు, 9. ఎరుపు, పసుపు అక్షతలు, 10. కొబ్బరి ముక్కలు లేదా పొడి.

**వశీకరణమునకు -** 1. ఎర్రని అక్షతలతో కలిపిన నువ్వులు, 2. బెల్లము, 3. ఎర్ర జొన్నలతో కలిపిన నువ్వులు, 4. మధుర వస్తువులు, 5. ఎర్రని పూలు

**ఐశ్వర్యమునకు -** 1. తామర పూలు, 2. కలువ పూలు, 3. పసుపు పూలు, 4.తామర గింజలు, 5. మారేడు దళములు, సమిధలు, పండ్లు

**దుష్టగ్రహ రోగనివారణకు, దుష్టవశీకరణమునకు -** 1. ఉప్పు కుంకుమ కలిపిన ఆవాలు, 2. మిరియాలు, 3. మిరపకాయలు, 4. వేప, ఊడుగ సమిధలు, 5. మేడి సమిధలు

**వివాహ సిద్ధికి -** 1. పసుపు, 2. జీలకర్ర, 3. బెల్లము, 4. పేలాలు

**సంతానమునకు -** 1. తామర గింజలు, 2. మామిడి పండ్ల ముక్కలు, మామిడి తాండ్ర ముక్కలు, 3. వెన్న, 4. మినప సున్ని, 5. గారె ముక్కలు, 6. మామిడి, రావి సమిధలు

**సూచన:** రోగ నివారణకు ఆయుర్వేదంలో చెప్పబడిన మూలికలను హోమ ద్రవ్యములుగా వాడవచ్చును.

హోమము మధ్య లేవ వలసి వచ్చినచో 1. ఓం భూః స్వాహా 2. ఓం భువః స్వాహా 3. ఓం సువః స్వాహా 4. ఓం భూర్భువస్సువః స్వాహా అని నాలుగు ఆహుతులు వేసి, లేచి వెళ్ళి, మళ్ళీ వచ్చి ఇవే నాలుగు ఆహుతులు వేసి హోమము మరల చేయవలెను. ఈ మధ్యకాలములో అగ్ని ఆరరాదు. ఒక రోజే కాక ఎక్కువ రోజులు చేసినా ఇదే పద్ధతి.

# హోమద్రవ్యాలు

## సాత్విక వస్తువులు

1. నెయ్యి
2. కొబ్బరిపొడి, ముక్కలు
3. చెరుకు ముక్కలు
4. మారేడు దళాలు
5. మోదుగపూలు
6. కొబ్బరికాయలు
7. పంచదార
8. బియ్యము (+ పసుపు)
9. తెల్లవి పువ్వులు
10. పండ్ల ముక్కలు
11. రావి సమిధలు
12. బెల్లము

## రాజస వస్తువులు

1. నువ్వుల నూనె
2. జొన్నలు
3. మామిడి ఆకులు
4. తిప్పతీగ
5. గుమ్మడి కాయలు
6. నల్ల మినుములు
7. ఎర్రటి పువ్వులు
8. తెల్ల నువ్వులు
9. శొంఠి కొమ్ములు
10. గోధుమలు
11. తెల్ల జిల్లేడుపూలు

12. నిమ్మకాయలు
13. గుమ్మడి కాయలు
14. తామర గింజలు
15. పిప్పళ్ళు
16. తెల్ల ఆవాలు
17. మినుములు
18. శనగలు
19. కందులు
20. అలచందలు
21. పెసలు
22. కుంకుమ కలిపిన అక్షతలు
23. యవలు
24. వివిధ ధాన్యములు
25. మోదుగ, వేప, మామిడి సమిధలు
26. ఇప్పపువ్వు
27. వివిధ మూలికలు వాటి గుణమునుబట్టి వాడవలెను.

**తామస వస్తువులు**

1. ఆవ నూనె
2. ఆవాలు
3. మిరియాలు
4. తానికాయలు
5. మిరపకాయలు
6. తాటి బెల్లం
7. ఉమ్మెత్త పూలు
8. ఉప్పు
9. నల్ల నువ్వులు
10. ఎర్ర అన్నం (కుంకుమ కలిపిన అన్నం)

## సాధన భాగములు

1. **జపము** – గుణమును బట్టి మాల ఉపయోగించవలెను (లెక్కకోసం) **ధ్యానము** – మాల మెడలో ధరించి చేయవలెను. లెక్క అక్కరలేదు.
2. **హోమము** – విధానము ప్రత్యేకముగా ఇవ్వబడినది. (జప సంఖ్యలో పదవవంతు చేయవలెను)
3. **తర్పణము** – మంత్రమునకు దేవత పేరు కలిపి తర్పయామి నమః అని యంత్రము మీదగాని విగ్రహము మీదగాని ద్రవమును చేతితోగాని ఉద్ధరిణతోగాని వేయవలెను. (హోమ సంఖ్యలో పదవవంతు)

   **వస్తువులు**

   1. మంత్రసిద్ధికి కొబ్బరినీళ్ళు, పాలు, నెయ్యి
   2. శాంతికి – పాలు, కొబ్బరినీళ్ళు, పసుపునీళ్ళు, తులసీజలం
   3. వశీకరణము, కార్యసిద్ధి – కుంకుమనీరు, నువ్వుల నూనె
   4. రోగనివారణ – మిరియాలు, వేప, మామిడి, మారేడు కషాయములు
   5. శత్రు బాధా నివారణ – మిరియాల కషాయము, కారపు నీరు, ఆవనూనె

4. **మార్జనము** – మంత్రము చదువుచూ పువ్వుతో యంత్రము మీదగాని, విగ్రహము మీదగాని నీళ్ళు చల్లవలెను (తర్పణ సంఖ్యలో పదవవంతు)
5. **సమారాధనము** – లక్ష జపమునకు పదిమందికి భోజనము పెట్టవలెను. సాధ్యము కానప్పుడు ప్రసాదము చేయించి దేవాలయములో భక్తులకు పంచిపెట్టవలెను.
6. **పూజ** – దేవతకిష్టమైన పుష్పములు, అక్షతలు ఉపయోగించి అష్టోత్తరసహస్ర నామములతో చేయవలెను. మంత్రమునకు నమః కలిపి వీలైనంత ఎక్కువ సంఖ్య అర్చనచేయుట మంచిది. యంత్రముగాని విగ్రహంకాని లేనప్పుడు శివలింగముగాని, సాలగ్రామముగాని, కుంకుమతో అలంకరించిన పసుపుముద్ద గాని పెట్టి పూజ, తర్పణము

మొ॥ చేయవచ్చును. దేవతా వర్ణముగల రత్నములు, రత్న శిలలు కూడా వాడవచ్చును. జలకలశముపై కొబ్బరికాయ అలంకరించిపెట్టి కూడా పూజ చేయవచ్చు.

## కార్య సిద్ధి

మొదటి మంత్ర పురశ్చరణ దేవతానుగ్రహం కోసం చేయాలి. కోరికలు కోరకూడదు. పురశ్చరణ చెయ్యకుండా సమస్యల నివారణకు జపం చేయటానికి గురువు యొక్క ప్రత్యేక అనుమతి తీసుకోవాలి. పురశ్చరణ పూర్తి అయితే కార్యసిద్ధి కోసం జపము, హోమము మొదలైనవాటిని స్వతంత్రంగా అంటే విడివిడిగా చేయవచ్చును. సంకల్పం చెప్పుకొని జపము మాత్రమే చేయవచ్చును. బలమైన పని కావలసినప్పుడు హోమం చేయాలి. అది అత్యంత శక్తిసంపన్నమైనది. తర్పణము కూడా అవసరమైన నిర్దిష్ట ద్రవములతో చేయవచ్చును. తీవ్రమైన కర్మ వ్యతిరేకంగా ఉన్నప్పుడు, మహాకార్యం కావలసినప్పుడు హోమం రోజులతరబడి చేయవలసివస్తుంది. కొద్ది జపము, హోమము చేసి పని కాకపోతే నిరాశచెందకూడదు. పట్టుదలతో చేస్తే తప్పక కార్యసిద్ధి లభిస్తుంది.

**గమనిక:** జపమాలలు, చిత్రములు, మొదలైన సాధన సామగ్రి పూజ్య శ్రీస్వామివారి గ్రంథములు, ఇతర వివరములు కావలసినవారు సంప్రదించవలసిన సెల్ నెంబర్లు :

1) 90637 01687 2) 89999 88055

సాధన సంబంధమైన సందేహాలకు, వివరాలకు

1) 94402 08103 2) 91609 16006